# శ్రీరామ సాక్షాత్కారం పొందిన
# బ్రహ్మశ్రీ రామకరామశర్మ గారి
# రచనలు - పరిశీలన

## తెలుగు ఎం. ఫిల్
## సిద్ధాంతవ్యాసము 2014

## ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయము
## గుంటూరు.

పరిశోధకుడు :

**శేషం వేణుగోపాల శర్మ**

తెలుగు పండితులు, కరీంనగరం

**Brahamasri Ramaka Ramasharma Gari**
**Rachanalu -- Parisheelana**

# బ్రహ్మశ్రీ రామకరామశర్మ గారి
# రచనలు - పరిశీలన

ముద్రణ : 2019


ప్రతులు : 500

**వెల : 150/-**

ప్రతులకు : 9948941516

**శేషం వేణుగోపాల శర్మ**
తెలుగు పండితులు
ఇ.నం. 10-2-530/1,
కొత్తయాస్వాడ, విద్యానగర్,
కరీంనగర్-505001. తెలంగాణ.

ముద్రణ :
శ్రీ విజయ గ్రాఫిక్స్ & ఆఫ్‌సెట్ ప్రింటర్స్
తిలక్ రోడ్, కరీంనగర్.

ఆచార్య **డా॥ కె. యాదగిరి**
**M.A.,Ph. D**
**అధిపతి, తెలుగు విభాగం**

తెలుగు విభాగము,
కాకతీయ విశ్వవిద్యాలయము,
వరంగల్లు - తెలంగాణ.

# అభినందన

పరిశోధకుడు చి॥శేషం. వేణుగోపాల శర్మ తెలంగాణ పల్లెల్లో దాగిన ఆణిముత్యాలను వెలికితీయాలనే సదుద్దేశంతో "బ్రహ్మశ్రీ రామకరామ శర్మగారి రచనలు - పరిశీలన" అనే అంశముపై నా పర్యవేక్షణలో పరిశోధన చేయడానికి ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయము నుండి అనుమతి నందియున్నారు. చాలాశ్రమించి వారి రచనలను సేకరించి వరంగల్లు, బోధన్, భాగ్యనగరం, పెద్దపల్లి, వంటి ప్రాంతాలలో పర్యటించి కవిగారికి సంబంధించిన అనేక అంశాలనుసేకరించి ఐదారు పద్యకావ్యాలను మరియు ఇతరములైన శ్రీరామ నవరాత్రి పూజావిధానము, భజనలు-కీర్తనలు, వివిధ మంగళహారతులు వంటివి సేకరించి కవిగారు ఆచరించిన శ్రీరామయాగము పట్టాభిషేకము వంటి మహత్తరమైన విషయాలపై ప్రత్యక్ష పరిచయమున్న వృధ్ధులను సంప్రదించి కవిగారి పద్యకావ్య సృజనా వైనాలను తెలుసుకుని పరిశోధనను ఐదు విభాగములుగా వింగడించుకుని చక్కగా విశ్లేషిస్తూ వ్యాసరచనకు పూనుకున్నారు.

అనేకసందర్భాలలో నన్ను సంప్రదిస్తూ సలహాలను మదింపు చేసుకుంటూ శ్రద్ధగా కట్టుదిట్టంగా చక్కని వ్యాసాన్ని సమర్పించియున్నారు. పరిశోధకుడు బాల్యంలో కవిగారికి శిష్యుడుగా వుండి యుండడం మూలాన వారు గురుదక్షిణను ఈ రూపంలో చెల్లించాలనుకోవడం చాలాగొప్పవిషయం తెలుగు సాహిత్యంలో పద్యానికి గల అత్యంతప్రాధాన్యతను గ్రహించి కవిగారు వెలయించిన చక్కటి పద్యకావ్యాలను భక్తిశతకములను సమగ్రంగా పరిశీలించి " నరత్నమన్విష్యతి మృగ్యతే హితత్" అన్న మహాకవి కాళిదాసుగారి మాటలను గుర్తుకుచేస్తూ మహాకవి బ్రహ్మశ్రీ రామకరామశర్మ గారి చక్కటి పద్యరత్నాలను ఎన్నుకుని మంచి విశ్లేషణ గావిస్తూ పరిశోధకుడు కవిగారు చూపించిన నవవిధ భక్తులలోని మార్మికతను, ధార్మికతను, నిర్మల మైన భక్తిచింతనను, సామాజిక చింతనను, కవిగారు సమాజానాకి అందించిన చైతన్యవీచికలను,సందేశాదులను క్రమంగా చూపించినారు. మహత్తరమైన పద్యకావ్యాలను పాఠకలోకానికి అందించిన మహనీయులు వెలుగు లోకిరాక

వుండివున్నారని అటువంటి మహనీయుల కవితాశక్తిని వెలుగులోకి తేవాలనే శుభసంకల్పం గల పరిశోధకుడిని, అతని ప్రయత్నాన్ని మనసారా అభినందిస్తూ ఈ పరిశోధకుడు త్వరలోనే పీ హెచ్‌డీ ని కూడా పూర్తిచేసి డాక్టరేట్ సాధించాలని అభిలషిస్తూ మరెన్నో మహత్తరమైన పద్యకావ్యాలను సమాజానికి అందించాలని భగవంతుని దయతో అన్నిట్లో సఫలీకృతులవుతారని భావిస్తూ ఉన్నాను. పద్య సాహిత్యమంటే మహా మక్కువ కలిగ్మిమమ వీరు వీరిగురువుగారినే ఆదర్శంగా తీసుకుని పద్యరచనా వ్యాసంగంలో కొనసాగుతూనే వున్నారు. పద్యశతక కావ్యాదులను రచిస్తూ పద్యకవిగా కొనసాగుతూ వుండడం ముదావహం. బ్రహ్మశ్రీ రామకరాశర్మగారి రచనలను కూలంకషంగా పఠించి వారి రచనలలోని ధార్మికను, సద్భక్తి భావనను భక్త సమాజానికి వెల్లడి చేయాలనేసదుద్దేశంతో వీరీ పరిశోధనను గావించినారని వీరిని అభినందిస్తూ వున్నాను.

ఇట్లు


**ఆచార్య డా॥ కె.యాదగిరి**

**ప్రొఫెసర్ తెలుగు హెడ్ ఆఫ్‌ద**

**తెలుగు డిపార్టుమెంట్**

పర్యవేక్షకులు

కాకతీయ విశ్వ విద్యాలయము

వరంగల్లు.

మహామహోపాధ్యాయ, మహాకవీ, వాచస్పతీ

**శ్రీ శ్రీభాష్యం విజయసారథి**

కులపతి సర్వవైదిక సంస్థానమ్

కరీణ్ణగరమ్ – తెలంగాణ

---

శోధ ప్రబంధు: శేషం వేణుగోపాల శర్మణ:

హార్దం సభాజనమ్

శ్లో॥ రామాయణ మహాయాగ । నిర్వోఢూ రామశర్మణ:
కృతీ: ప్రతి కృతం శోధ । బంధం పర్యవా శీలయమ్॥(1)

శ్లో॥ నామూలం లిఖితం క్వాపి । నానపేక్ష్య ముదీరితమ్
అను సంధాన సంబంధి । సర్వం ప్రోడీకృతం త్వయా ॥ (2)

శ్లో॥ శేషం శ్రీ వేణు గోపాల । వర్ధస్వ వరివస్యయా
జనతా హృదయో ద్గారి । వాఙ్మయస్య విశేషత: ॥ (3)

శ్లో॥ అంత: ప్రసుప్త చిచ్ఛక్తి । ప్రబోధ పర మార్ధకమ్
కవిత్వం విత్త్వ నిర్వ్యూఢం । బ్రాహ్మ్యా నీరాజనాయతే ॥ (4)

శ్లో॥ ప్రజా ప్రబోధ నిరతా । ప్రజా జీవన దర్శినీ
ప్రజాహిత పరిస్ఫూర్ణా । లేఖినీ తే పురణ్యతు ॥ (5)

శ్లో॥ చిరాయుషా సమేధస్వ । శేషవంశ విభూషణ
శుభ మభ్యుదయం వింద । మహాలక్ష్మీ ప్రసాదత: ॥ (6)

శ్లో॥ యద్ విధాస్యతి లోకస్య । జీవనే మార్గదర్శనమ్
యద్ వ్యపోహతి వర్గానామ్ । అన్యోన్య స్యోపమర్దనమ్ । (7)

శ్లో॥ తద్ధి సాహిత్య మారాధ్యం । తద్ధి లోకోపకారకమ్
నిర్మాతవ్యం తదేవాద్య । తస్మై స్వాగతకోజన: ॥ (8)

శ్లో॥ రచనా లోచనా శిక్షా । ధారాస్త్రిస్ర స్సుధీస్తవ
సామాజిక వికాసాయ । నిస్తంద్రం సహాయుంజతామ్ ॥ (9)

శ్లో॥ అశేష విషయావలీ విశదవర్ణ నోపస్కృతం
సమస్త జనజీవన స్థితిగతి ప్రతీకాస్పదమ్
మనోజ్ఞ కవిభావనా స్ఫుటిత భావభంగీ స్ఫుర-
చ్చమత్కృతి పురస్కృతం జయతి హారిసారస్వతమ్ ॥ (10)

ఏవ మాశంసు:

విళంబి ॥ మార్గశిర దశమి
31 - 12 - 2018.

**శ్రీ భాష్యం విజయసారథి:**
కులపతి: సర్వ వైదికసంస్థానమ్,
కరీణ్ణగరమ్, తెలంగాణ.

**డా॥ రామక లక్ష్మణమూర్తి**
**M.D.**
**ఫిజీషియన్**

శ్రీనిలయం – రాంనగర్
హనుమకొండ,వరంగల్,
ఫోన్ :– 2577488.

# శుభాభినందన

శ్లో॥ శ్రీరామచంద్ర: ఆశ్రితపారిజాత:
సమస్త కళ్యాణ గుణాంబురాశి:
సీతాముఖాంబోరుహ చంచరీక:
నిరంతరం మంగళ మాతనోతు ॥
“శ్రీరామ జయ రామ జయ జయ రామ”

పూజ్యులు శేషం వేణుగోపాల శర్మ గారు పరిశోధించి, సమగ్ర విశ్లేషణ చేసిన ”శ్రీరామ సాక్షాత్కారం పొందిన బ్రహ్మశ్రీ రామక రామశర్మ గారి రచనలు – పరిశీలన – విశ్లేషణ” అనే యంఫిల్ పరిశోధన గ్రంధానికి అభిమానంతో ముందుమాట రాయమని కోరినారు చాలా ఆనందం కలిగింది మారుమూల ప్రాంతాలలో మరుగున పడిన మణిరత్నా లను వెలికితీసి తత్ప్రకాశమును వెదజల్లాలని చేసేప్రయత్నంలో భాగంగా ఈ పరిశోధనను ఎంచుకున్నందుకు శ్రీ వేణుగోపాలశర్మ బహువిధ ప్రశంసార్హుడు తెలంగాణా మణిరత్నమయిన బ్రహ్మశ్రీ రామక రామశర్మగారు ( మన్నెంపల్లి రామయ్యగారు) కరీంనగరం జిల్లాలోని తిమ్మాపూర్ మండలంలోని మన్నెంపల్లి గ్రామవాస్తవ్యులు వీరు మాసమీప బంధువు వీరు రచించిన పుస్తకములలో ”శ్రీరామ నవరాత్రి పూజావిధానం” అత్యంత ప్రామాణికమైనది అందరికీ అత్యంత ఉపయోగకరమయిన పుస్తకముగా పెద్దగా గుర్తింపును పొందింది. అధ్యాత్మికంగానూ, వైదికంగానూ చాలా ప్రఖ్యాతి చెందినవారు వీరు.

వీరి రచనలు శ్రీరామ నవరాత్రి పూజావిధానము,మరియు శ్రీరామ రాఘవ సంస్తవము, శ్రీరామ రాఘవ స్తవము, శ్రీమదాంజనేయ స్తుతి, శ్రీ చెన్న కేశవ శతకం, వివిధమంగళ హారతులు, భజనలు, కీర్తనలు మున్నగునవి అన్ని ఆ ప్రాంతంలో జనబాహుళ్యము పొందినవి.

"అశాశ్వత శరీరంలో ప్రాణముండగానే నాకు దర్శనమీయమని అర్థించి సన్ముక్తి ప్రసాదించమని శ్రీరాముడిని వేడుకుని శ్రీరామసాక్షాత్కారం పొందిన విలక్షణ కవివర్యులు బ్రహ్మశ్రీ రామక రామశర్మగారు" నా సన్మాన సభలో మంచివక్తలు డా॥ లక్ష్మణమూర్తి అందరివాడని వక్కాణిస్తే "డా॥ కాళోజి నారాయణ రావు గారు" డా॥ లక్ష్మణమూర్తి "రామ్ - కా" (రామక) అన్నారు రాముని సంబంధించిన వారు ఎవరైనా రామ్-కా (రామక) రామునివలె ఆవిధంగాతనువు, మనస్సు, ఆత్మ రామార్పణంలా జీవనం గడిపిన బ్రహ్మశ్రీ రామక రామశర్మ గారు " రామ్ -కా" (రామక) వరే అని కవిగారి విషయంలో నా నిశ్చితాభిప్రాయము కవిగారు నిరంతర రామనామ స్మరణ అనే యజ్ఞంలో తానే సోమయాజియై భక్తులందరికి ఆదర్శనీయులై సహస్రానేక రామాయణ పారాయణములు పరమభక్తితో నిర్వహించిన నిష్కామయోగి సన్మునివర్యులుగా సమాజంలో ఖ్యాతిగాంచిన కవివర్యులకు ధన్యవాదములు అందజేస్తున్నాను.

బ్రహ్మశ్రీ రామక రామశర్మ గారి గురించి ఎక్కువ ప్రాచుర్యము లేదు అయిననూ ఆ లోటు లేకుండా చేసిన శ్రీ శేషం వేణుగోపాల శర్మ గారు కడు అభినందనీయులు బ్రహ్మశ్రీ రామక రామశర్మ గారు "మానవ సేవయే మాధవసేవ" అనుదానిని ఆచరించి చూపిన మహామనీషి ఋషితుల్యులు ఇప్పటికీ మా స్వగృహంలో ప్రతిసంవత్సరం దాదాపుగా ఎన్నో ఏళ్లనుండి వీరు రచించిన శ్రీరామ నవరాత్రి పూజావిధానము అనే పుస్తకాధారంగానే శ్రీరామ నవరాత్రులు నిర్వహించుకోవడం జరుగుతున్నది అనేక దేవాలయాలలో అనేక ప్రాంతాలలో గృహాలలో శ్రీరామ

నవరాత్రులు వీరి పుస్తకాధారంగానే కొనసాగుతున్నవని చెప్పడంలో ఎటువంటి సందేహం లేదు శ్రీరామ అర్చనలు కళ్యాణాదులు నివేదనలు మున్నగునవన్నీ అదేగ్రంథంలో సూచించినట్లుగా నేటికినీ కొనసాగుతుండడం అనేది కవిగారిపట్ల శ్రీరామచంద్రమూర్తి సంపూర్ణ దివ్యానుగ్రహం అపారంగా వుండడం చేతనే అనునది సుస్పష్టమని భావించవచ్చు. ఇట్టి బహుముఖ ప్రజ్ఞాశీలి మరోరామదాసు వంటి రామభక్త రత్నము అయిన శ్రీ రామక రామ శర్మ గారు మన తెలంగాణా రాష్ట్రం వాడవడమనేది నిజంగా మనందరి అదృష్టమని చెప్పవచ్చు వీరికిగల బహుకావ్యపఠనం నిరంతర రామ నామస్మరణ, భాగవత పద్యపఠనం, రామాయణ నిత్యపారాయణమనే గొప్ప సుగుణములు వీరివి కావడంచేతనే వీరింతమంచి మంచి పద్యకావ్య శతకములను నాటి తెలంగాణా భక్తసమాజంలో ప్రచురించి వితరణ చేసినారని భావిస్తూ మహాకవి బ్ర॥ శ్రీ॥ రామక రామశర్మ గారి రచనలపై పరిశోధన చేసిన శ్రీశేషం వేణుగోపాల శర్మ గారు మరెన్నో పరిశోధనా గ్రంధములు వెలికి దీయాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ.... ఇతిశమ్...

**శ్రీరామ రామ రామేతి । రమే రామే మనోరమే**
**సహస్ర నామ తత్తుల్యం । రామనామ వరాననే ॥**

మీ

విళంబి, కార్తీక బ॥ చవితి, **డా॥ రామక లక్ష్మణ మూర్తి**

తేదీ : 27-11-2018, వరంగల్లు

సాహితీరత్న
**డా॥ గంద్ర లక్ష్మణరావు**

వివేకానందపురి,
కరీంనగరం.
చరవాణి–9849328036

తేది : 20–1–2019

# ఆవిష్కృతారామం

రామా ! నా హృదయములో
రామా ! జానకిని గూడి రామానుజు తో
రామా ! దర్శన మిచ్చుచు
నామాట వినెద వనుచును నమ్మితి రామా !

బ్రహ్మశ్రీ రామక రామశర్మ గారు శ్రీ రాముని గురించి రాసిన పద్యమిది రామశర్మగారిది కరీంనగర్ జిల్లా మానకొండూరు సమీపానగల మన్నెంపల్లి అను గ్రామము ఆ ఊరిలో ప్రాచీనమైన చెన్నకేశవ స్వామి ఆలయం ఉంది. ఈ కవిగారు ఆ ఆలయంలో అర్చనలు, యజ్ఞాలు, యెన్నింటినో చేశారు. ఊరివారందరికి హితుడిగా వాస్తు, జ్యోతిషం మొదలైనవి తెలిపేవారు. భాగవతం, రామాయణం వారు చదవడమే గాక గ్రా మ ప్రజలందరికి ఆలయం వేదికగా పరిచయం చేశారు. అందరితో భజనలు చేయించేవారు చేతనైనంత ధార్మికతను పంచిపెట్టారు. అరవైలో ఉండగా ఆ రాముని స్తుతిస్తూ శతకాలు రచించారు. అంతటి భక్తుడు, జనహితుడు కవి, పండితుడు అయి ఉండి కూడా పేరుగాంచలేదు అది కాలమహిమ.

నిజాము కాలమునాడు చాలా ఊళ్లలో పురోహితులు, అయ్యవార్లు, భట్రాజులు, పద్మ శాలీలు, విశ్వబ్రాహ్మణులు అక్కడక్కడ వైశ్యులు, రెడ్లు, బ్రాహ్మణులు, కాపులు కూడా పద్యాలు, పాటలు, భజనలు, స్తుతులు, తత్వగీతాలు పాడేవారు రాసేవారు ఉండేవారు. ఆ గ్రామంలోనే పండుగల్లో, పంటచేలల్లో, పనుల్లో, కల్లాలదగ్గర పాడుకునేవారు పంచాయితీలలో వాడుకునేవారు ఎందరో వ్రాసినవి దాచుకోలేదు. ప్రచారం చేసుకోలేదు. అట్లాంటివారిలో బ్రహ్మశ్రీ రామక రామశర్మ వంటి వారెందరున్నారో ? అదేగ్రామానికి చెందిన పండితుడు, కవి చిన్నప్పుడు తనను ప్రభావితం చేసిన కవిని గుర్తుపెట్టుకుని ఎం ఫిల్ పరిశోధన వ్యాసం అందించిన వారు శ్రీ శేషం వేణుగోపాల శర్మ గారు.

వేణుగోపాల శర్మ స్వయంగా శతకాలు వ్రాసినాడు పద్యకవితాభిమాని. రామక రామశర్మ గారి జీవితాన్ని, శతకాలను తనపరిశోధన తో వెలుగులోకి తెచ్చినాడు రామక రామశర్మగారిని, రాముడిని అజ్ఞాతంనుండి ఆవిష్కరించినందుకు అభినందనలు.రామక రామశర్మగారి శతక పద్యాలన్నింటికీ తాత్పర్యంతో పాటు విశేషణాలు, విశ్లేషణలు అందించినారు మత్తేభవృత్తంలో రాముడిని మత్తేభంపై ఎక్కి రమ్మని ఆహ్వానించిన పద్యం ఎంత ఔచితీవంతమైనదో వివరించినారు.

శ్రీ రాముని, చెన్నకేశవుని, హనుమంతునిపై శ్రీ రామక రామశర్మగారు వ్రాసిన పద్యాల వ్యాఖ్యానం సవివరంగా అందించారు విశ్లేషణ ఒక భాగంగా, ఛందస్సు అలంకారాదులు మరొక భాగంగా వీరు వివేచించారు.

రామక రామశర్మగారి సన్నిహితులు, సమకాలికులైన వారితో ఇంటర్వ్యూలు జరిపి వివరాలు సేకరించినారు పరిశోధనలో ఇదొక ప్రధానమైన అంశం వీరీ విషయంలో చాలాచక్కగా విషయసేకరణ చేసినారు రామక రామశర్మగారి భక్తిచింతనను సామాజికసేవలను అనేకరూపాల్లో వీరు చేస్తున్న ప్రజాహితా లను ధార్మిక సేవలను చాలా చక్కగా తెలియపరిచారీ పరిశోధకులు.

రామాయణ, భాగవత, భగవద్గీత వేదమంత్రాల ప్రభావం కవిగారిపై ఎట్లా వుందనే విషయాలను ఉటంకించి చూపారు సంస్కృత, తెలుగు భాగవతాల ప్రభావాన్ని చూపించినారు బ్రహ్మశ్రీ రామక రామశర్మ గారు చేసిన యజ్ఞములు, పారాయణ విధాన క్రమాలను తెలిపిన వివరాలు కూడా పరిశోధకులు అంద జేసినారు.

రామక రామశర్మ గారి పద్యాలు అలవోకగా, వాడుకమాటల తోనూ, ఆధ్యాత్మిక, తాత్విక భూమికలతోనూ సాగడం విశేషం సంస్కృత సమాస, శబ్దప్రయోగాల ఆర్భాటం లేకుండా మనసా కీర్తించిన మాటలే పద్యాలుగా రూపొందినాయి. శార్దూలాలు కూడా సరళ సుందరంగా రచించిన శర్మగారి ప్రతిభ ప్రశంసనీయం జనులకు అర్థం కావాలి, అనరావాలి అనే ఆలోచన కూడా యీ కవిగారిది.

వీటన్నిటినీ వెలికి తీసే ఈ పరిశోధన చేసిన శ్రీ శేషం వేణుగోపాల శర్మ అభినందనీయుడు తెలంగాణలో ఇట్లాంటి ఎందరో కవులను వెలికి తీయడానికి ఇది మార్గదర్శకంగా వుంటుందని భావిస్తున్నాను.

20-1-2019

**డా॥ గండ్ర లక్ష్మణరావు**
విశ్రాంత భాషోపన్యాసకులు
కరీంనగరం.

**శ్రీ గంగవరం(రామక) నారాయణ శర్మ**
కంఠేశ్వరకాలనీ – నిజామాబాద్, చరవాణి : 9440473629,

శ్రీ గణేశాయ నమ:, శ్రీ మాత్రే నమ: శ్రీ మాతా పితృభ్యాం నమ:

శ్లో ॥ షోడశ్యంబా రసాస్వాద । ప్రసక్త కరపాత్రిణే
షోడశానంద నాథాయ । నతోస్మి గురుమూర్తయే ॥

శ్లో ॥ రామాయణ సేవితపాదపద్మం
గజేంద్ర మోక్ష స్మృతిలభ్యవిశ్వం
పట్టాభిషేకార్చిత రామపాదం
(సదా) ప్రాతఃశ్రయే మత్పితృపాదయుగ్మం ॥

పూజ్యపాదులు, ప్రాతస్మరణీయులు, అనన్య రామపాదసేవా దురంధరులు, నిరతులు మత్పితృపాదులైన బ్ర॥ శ్రీ॥ రామక రామశర్మ అస్మన్మాతృదేవి యైన పూజ్యశ్రీ సౌభాగ్యవతి రామామణి గారల పాదపద్మములకు నమస్కరించి చి॥ శేషం వేణుగేపాల శర్మ యం.ఎ, యం. ఫిల్, ఉభయ భాషాప్రవీణులు గారలు మాకత్యంత ఆప్తులు యంఫిల్ పట్టా ప్రదానము కొరకు పాక్షికావసరమైన పరిశోధనా, ప్రసంగ వ్యాసరచన కొరకు మా పితృపాదులైన రామక రామశర్మ గారి పద్యరచనలను స్వీకరించుట మాకెంతో ముదావహము.

సాధారణంగా ప్రముఖ కవులకావ్యాలు ఎక్కువగా యంఫిల్ పరిశోధనకు గానూ తీసుకుంటూ వుంటారు. కానీ కేవలం నాలుగైదు శతక కావ్యములు మాత్రమే వ్రాసిన మానాన్నగారి పద్యరచనలు పరిశోధనకు తీసుకుని కవిగారికి అఖండమైన కీర్తిప్రతిష్టలు కలిగించినందులకు పరిశోధకుడు చి॥ వేణుగోపాల శర్మ గారికి కృతజ్ఞతా పూర్వక ఆశీరభి నందనలు.

మా తండ్రిగారు ఒకమారుమూల పల్లెటూరు యైన గ్రా.మన్నెంపల్లి మం. తిమ్మాపూర్ జి. కరీంనగరం నందు సాధారణ శ్రోత్రియ కుటుంబంలో జన్మించి, చిన్ననాటినుండి అమితమైన రామభక్తి కల్గి అనుక్షణం శ్రీ రామనామ స్మరణ చేస్తూవుండేవారు. సమీపగ్రామమైన నుస్తులాపురంలో వారి మేనమామలైన బ్ర॥శ్రీ హన్మయ్య, చంద్రయ్య గారలవద్ద చదువుకుని జ్యోతిషం, వాస్తుశాస్త్రము, స్మార్త కర్మలలో

నిష్ణాతులై నాటి తాలూకా కరీంనగరము నందు అత్యంత కీర్తి ప్రతిష్టలు ఆర్జించినారు. ఎంతోమందికి గృహనిర్మాణ విషయాలలో వాస్తుశాస్త్ర విధానంలో సశాస్త్రీయంగా గృహాలు నిర్మించేవిధంగా సూచించి గృహప్రవేశాదులు చేయించి, వారు సుఖసౌఖ్యాదులతో జీవించుటకు మార్గ దర్శులైనారు. మన్నెంపల్లి రామయ్యగారు చెప్పినారు చేయించినారని చెప్పితే పెద్దపెద్ద పండితులే ఎదురు చెప్పకపోవడమ కాక వారుచెప్పిన తరువాత ఇంక మనమేమి మాట్లాడేది లేదని అతంకంటే మంచిగా గొప్పగా చెప్పేవారు వేరెవరు లేరని కవిగారిని కొనియాడేవారు.

మా తండ్రిగారు నిత్యజీవితంలో కూడా సత్యధర్మనిరతితో జప పూజావిధులలో పౌరోహిత్యము, మరియు వ్యవసాయమును కొనసాగిస్తూ జీవితం గడిపారు ఇద్దరు సోదరులతో ఇద్దరు సోదరీమణులతో నలుగురు కుమారులు ఇద్దరు కూతురులతో ఎన్ని కష్టాలు వచ్చినా ఓర్పుతో అందరినీ ఆదుకుంటూ అందరి మన్ననలు పొందినారు. వారు ప్రతినిత్యము సూర్యోదయాత్పూర్వము మేల్కొని మహాభాగవతంలోని గజేంద్రమోక్షం పద్యాలను రాగయుక్తంగా ఆలపిస్తూండేవారు మధ్యాహ్న భోజనానంతరము ఎవరున్నా లేకున్నా ఏదో ఒక పురాణపఠనం చేస్తూండేవారు. రాత్రి భోజనానంతరము గ్రామంలోని శ్రీ చెన్నకేశవ స్వామివారి కోవెలలో అర్చకులైన శ్రీమాన్ కేశవాచార్య స్వామితో కూడి దాదాపు గంటసేపు అనన్యమైన భక్తి శ్రద్ధలతో భజనలు పాడి పరవశించి పోయేవారు. వీరి అమేయమైన రామభక్తికి సంతుష్టులైన నారదమహర్షులు స్వప్నంలో సాక్షాత్కరించి శ్రీరామ తారకమంత్రమును ఉపదేశించి త్వరలో శ్రీరామసాక్షాత్కారం లభిస్తుందని ఆశీ ర్వదించి అంతర్ధానమైనారు.

ఆ తరువాత కులగురువులైన ధర్మపురి వాస్తవ్యులయిన బ్రాఃశ్రీః రొట్టె చంద్రశేఖర శాస్త్రిగారి వద్ద ప్రత్యక్షంగా మా అమ్మగారితోసహా రామతారకం తీసుకుని అపరిమిత, అసంఖ్యాక జపానుష్టానం చేయడంవలన స్వప్నంలో నారదులవారు చెప్పినట్లుగా పరోక్షంగా శ్రీరామసాక్షాత్కారం జరిగింది. అది ఎట్లనగా వారికి చిన్ననాటినుండి మిత్రులై ఆత్మీయులైన మా మన్నెంపల్లి సమీపగ్రామమైన నేదునూరి గ్రామకరణం కేశవదాసుగారు గొప్పరామభక్తులుగా అమేయమైన యశస్సునార్జించి యున్నారు. వారు ఒంటిమిట్ట వాసుదాసాశ్రమంలో వానప్రస్థాశ్రమము స్వీకరించి పవిత్రమైన ధర్మపురీ క్షేత్రంలో శ్రీమద్రామాయణ పారాయణం శ్రీ సీతారామార్చనం చేస్తూ భిక్షాద్రవ్యంతో అత్యంత సాత్విక పక్వాహారంతో శ్రీసీతారాములకు నివేదించి, సప్రసాద భక్షణమాత్ర జీవియై ధన్యుడైన పూజ్యులు. శ్రీ కేశవదాసుగారు ఒకవ్రాతప్రతిని శ్రీ రామాయణ పారాయణ

పూర్వక శ్రీరామ నవరాత్రికల్పమును ఇచ్చి రామన్నా ఈ నవరాత్రవిధానం రాసుకో మళ్ళీనాకు తిరిగి ఇవ్వు దీంతో నీమనోరథం నెరవేరుతుందని ఇచ్చివెళ్ళినారు అప్పుడు నేనుకూడా వారితోవున్నాను. నేను మానాన్నగారు ఇరువురం కలిసి దానిని వ్రాసుకున్నాము. అప్పటినుండి మాతండ్రిగారు వాల్మీకిరామాయణం పారాయణం చేస్తూ, ఒక్కొక్కఘట్టంలో ఒక్కోరకమయిన అష్టోత్తరనామార్చన, ఒక్కోరకమయిన నివేదనాదులతో మా అమ్మగారు పదార్థాలు తయారుచేస్తూండేవారు నివేదించి నిశిపూజ తరువాత ఇద్దరు భుజించి నిద్రించేవారు. ఈవిధంగా 124 వందా ఇరవయినాలుగు మార్లు శ్రీమద్రామాయణ పారాయణం చేసి ప్రతిపారాయణంలో శ్రీ సీతారామజనన ఉత్సవాలు, కళ్యాణోత్సవాలు, పట్టాభిషేకోత్సవాలు విధిగా చేస్తూండేవారు.

ప్రతి 24 పారాయణాల తరువాత ధర్మపురి, కరీంనగరంలలో భక్తులనుంచి ద్రవ్యసేకరణచేసి 50 మంది ఋత్విక్కులతో వేదపండితులతో పెద్దపల్లి వాస్తవ్యులు వేద శాస్త్ర ఆగమాది శాస్త్రపండితులైన బ్రహ్మశ్రీ మల్లోర్జుల రాజలింగశాస్త్రిగారి ఆచార్యత్వంలో యాగనిర్వహణాదులు చేస్తూండేవారు 124 రామాయణ పారాయణాల తర్వాత ధర్మపురి క్షేత్రంలో

శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి ఆలయప్రాంగణంలో నవకుండాత్మక మయిన శ్రీరామసామ్రాజ్య పట్టాభిషేక మహాయాగమును 100 మంది వేదపండిత ఋత్విక్కులతో శ్రీ రాజలింగ శాస్త్రిగారి ఆచార్యత్వంలో నభూతోనభవిష్యతి అనురీతిగా అత్యంతవైభవంగా శ్రీమద్రామాయణ యాగం నిర్వహింపబడినది. ఇది ఆరోజుల్లో అత్యంత గొప్పదైన ధార్మికకార్యక్రమంగా గుర్తించబడింది భక్తజన సంద్రంతో వేనోళ్లగా కీర్తింపబడింది. ఇంతపెద్ద యాగకార్యక్రమాన్ని ఆప్రాంతంలో చేయడం చాలా శ్రేష్టమయినదిగా పండితులందరిచే భక్తాదులచే కొనియాడబడింది. సమాజంలో వైదికకార్యక్రమాలకు పెద్దసంఖ్యలో భక్తులు హాజరవడం పరిపాటిగా వుంటూండేది.

ఐతే ఈనవరాత్రికల్పమును మళ్లీ శ్రీ వాసుదాసుగారువచ్చి తీసుకుని వెళ్లినారు. ఇలాంటి యాగాదులతో కూడిన శ్రీరామసేవ మీ అనుగ్రహంతో చేయగల్గినానని వారితో విన్నవించితే ఎన్నడూ అసత్య మంటే తెలియనివాడైన శ్రీ వాసుదాసుగారు అరే నేను ఎప్పుడువచ్చినాను ఎప్పుడు ఇచ్చినాను ఎప్పుడు తీసు కువెళ్లినాను ఇదంతా నిజమా? నేనుకాదయ్యా నీమీదవున్న ఒకప్రత్యేక అభిమానంతో, ప్రేమతో ఆ శ్రీరాముడే ఇదంతా చేసినాడయ్యా అని గద్గదస్వరంతో ఆనందభాష్పములతో పులకాంకుర వదనంతో, బిగ్గరగా కౌగిలించుకుని నాకన్నా నువ్వు ధన్యుడవయ్యా శ్రీరామసాక్షాత్కారముతో నీవు

పునీతుడవయి మమ్మల్నికూడా ఉద్ధరించి నావయ్యా అంటూ వారి ఆనందాన్ని ఎంతగానో వ్యక్తంచేసినారు.

ఈ రూపంగా శ్రీరామ సాక్షాత్కారానుగ్రహంతో శ్రీరామ ప్రేరణతోనేగదా నాప్రయత్నం అంటూ ఇత:పూతర్వం కవిత్వంకానీ, వ్యాకరణంగానీ, ఛందశ్శాస్త్రాదులు కానీ తెలియకున్నా "పలికించెడు వాడు రామభద్రుండట" అన్నట్లు శ్రీరామచంద్రుడే తనతో పలికిస్తున్నాడేమోనని ఈ శతకాలు రేయింబవళ్లు శ్రమించి వ్రాసుకుని, పరిచయమున్న కవి రామక విశ్వనాథశర్మ గారికి, పార్వెళ్ల గోపాలకృష్ణయ్య గారికిశతకాలు చూపించి సవరణలుంటే చేయించుకుని అచ్చొత్తించుకుని పాఠకసమాజంలో ప్రకటించినారు.

ఇదంతా సాధ్యంకావడానికి ముందు వారు మాపెద్దన్నగారైన రామక మురళయ్యగారికి దాదాపు 30 సం॥కు పైగావున్నవారికి సంసారబాధ్యతలు అప్పగించి ఏ విషయంలోనూ జోక్యం చేసుకోకుండా అత్యంత నిస్పృహతో బాధ్యతలను వదలక వలయు స్వధర్మ కర్మానుష్టానము, దేవతార్చనము, పురాణపఠనము కోవెలలో భజనలు, భగవత్సేవ, రామాయణ పారాయణములు, శ్రీ రుద్రయాగము, శ్రీ చండీయాగము, శ్రీరామయాగము లాంటి ఎన్నో క్రతువులు కేవలం భక్తుల సహాయ సహకారాదులతో ఆచరిస్తూ ధార్మిక జీవనంతో వారు ధన్యులగుటయే కాక వారికుటుంబ సభ్యులమైన మేము వారి అనుగ్రహములతో ( ఎందుకనగా వారు ఏ పెద్దలకు నమస్కరించినా ఏ కార్యక్రమ అవసాన మహదాశీర్వాదాలతో మాపిల్లలు బుద్ధిమంతులు అయి సుఖసంతోషాలతో జీవించునట్లా శీర్వదించుమని కోరెడువారు) మేమందరము ఆనందకర జీవితాలతో పిల్లాపాపలతో సుఖమయ ప్రశాంత జీవనాన్ని గడుపుతున్నాము.

మా నాన్నగారికి భగవత్సంబంధము ఎంతటిదంటే వారిజీవితంలో జరిగిన ఒకటిరెండు సంఘటనలను అవలోకిస్తే తెలుస్తుంది ఒకప్పుడు మా మన్నెంపల్లిలో వందల ఎకరాల భూములు కల్గిన మోతుబరి రైతులు ఉండేవారు కానీ వారికి గ్రామంలో దేవాలయాలపట్ల గానీ దేవునిపట్ల గానీ శ్రద్ధాభక్తులు చాలా తక్కువ ఒకసారైనా దర్శనంచేసుకుని పొమ్మని ఎన్నిమార్లు చెప్పినా అసలు పట్టించుకునే వారుకాదు ఆలయంకు వచ్చేవారుకారు అయితే వరిసాగుకు సరిపడే నీటి సౌకర్యాదులు సరిగా లేనందున పెద్దపెద్ద వ్యవసాయ బావులకు మూడునాలుగు మోటలతో వంతులవారిగా రాత్రింబవళ్ళు మోటకొట్టి నీరుపారించుకునే వారు ఐతే అశ్వినికార్తెలో పొలాలు కోతకువచ్చే సమయానికి రాత్రి రాళ్లవానకురిసి అపారనష్టం వాటిల్లుతూ వుండేది

ఒకసారి ఈ వడగళ్లవర్షంతో వరిపంటలు అన్నీ తుడిచిపెట్టుకు పోయాయి బాధతో ఆ కర్షకులందరూ  మానాన్నగారివద్దకు వచ్చి ఇట్లా పంటనష్టం జరుగుతూందని దీనికి నివారణమార్గం సూచించాలని కోరగా మనవూరి దేవలయంలోని శ్రీ లక్ష్మీచెన్నకేశవ స్వామి ప్రత్యక్ష ఫలదాత కానీ మీరెన్నడూ కనీసం దేవాలయం ముఖమైనా చూడరు భగవదనుగ్రహం లేనిచో ఇట్లాగేవుంటది అందుకని మీరు స్వామివారి దేవాలయంలో అఖండ దీపారాధనను వెలిగింపజేసి మున్నూటరవై (360) రోజులు నిరంతరం వెలిగేవిధంగా చేయుమని సూచించినారు ప్రతి శనివారం దేవాలయంలో భజనకువచ్చి భగవంతుని ప్రార్థిస్తే మీ కష్టాలు నెరవేరుతాయని, సకాలంలో సువృష్టి కురుస్తుందని తెలియజేసినారు.

ఆనాటినుండి (నేటివరకు) మానాన్నగారు సూచించినవిధంగా ఆచరించడంవలన అప్పటి నుండి ఇప్పటి వరకు చుట్టుప్రక్కల రాళ్లవానలు కురిసినా మా మన్నెంపల్లిలో రాళ్లవానలు లేవు పంటనష్టము లేదు అంటే అతిశయోక్తి ఎంతమాత్రంకాదు ఇప్పటికీ అఖండదీపారాధనా కార్యక్రమాన్ని కొనసాగిస్తూనేవున్నారు.

ఇక రెండవ సంఘటన మా ఊరిలో ఒక గౌడు గీతకార్మికుడు ఈతచెట్టు పైనుండి ప్రమాద వశాత్తు క్రింద పడిపోయినాడు కంటిలో భయంకరంగా పొడుగాటి ముల్లు గ్రుచ్చుకోవడం జరిగింది నాటి రోజుల్లో కంటిదవాఖానాలు దగ్గరలో చుట్టుప్రక్కల ఏ గ్రామాలలో వుండేవికావు పాపంఆగౌడు చీము, నెత్తురు, మంటలు, పోట్లు వంటి బాధలతో ఏడుస్తూ వుంటే మా తండ్రిగారు అతనికిలా సూచించినారు బాబూ నీవీ చెన్నకేశవస్వామివారి మందిరంలోనే నిద్రచేస్తూ ఆలయంలోని బావిలోస్నానం చేస్తూ ప్రతిరోజూ చేతనయినన్ని ప్రదక్షిణలు చేస్తూ "కేశవ కేశవ" అనిస్వామిని స్మరిస్తూ వుండుత్వరగా నీకుతప్పక నయమవుతుందని చెప్పినారు అతను భక్తిశ్రద్ధలతో తదేకదీక్షతో అలాగే చేస్తూండగా ఒకనాటి ఉదయాత్పూర్వములో పూజారిగారి రూపంలో వచ్చి ఆయనకు దేవాలయంలోని తొక్కుడుబండ క్రిందినుంచి ఒకమూలిక తీసి రసంపిండి ఆరసాన్ని అతని కన్నులోపోసి వెళ్లినాడు తెల్లవారి లేచేసరికి విచిత్రంగా కంటిబాధ మటుమాయమైపోయింది  అతను ఆ ఆల య అర్చకునితో అయ్యా మీరిచ్చిన మందుతో నాకు మంచిగా ఐందని కన్నుబాధ తొలగిపోయిందని చెప్పగా వారు పరమాశ్చర్యంతో బాబూ నేనసలు ఆలయంలోకే రాలేదని అక్కడ ఒక ఔషధమూలిక వున్నదని తనకు తెలువవదని చెపుతూ నాయనా నీవు చాలా అదృష్టవంతుడవని స్వయంగా ఆకేశవ స్వామివారే వచ్చి నీకు చికిత్స చేసి నీ అవస్థను నయంచేశారయ్యా అనన్యభక్తికి

భగవంతుడు ప్రసన్నమవుతాడన్నది ఇందు మూలంగా నిజమని నిరూపణ ఐందని అర్చకులు, మాతండ్రిగారు ఎంతో ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసినారు అంతటి మాహాత్మ్యం గల దేవాలయమది. (మన్నెంపల్లి చెన్నకేశవ దేవస్థానం)

ఈ విషయం మానాన్నగారు అర్చకులు చెప్పగా విని ప్రత్యక్షనిదర్శనాన్ని గమనించి గ్రామస్తులే కాకుండా పరిసరప్రాంత భక్తులెల్ల శ్రీ చెన్నకేశవ స్వామివారి మహిమను కొనియాడుతూ గోవింద నామాలతో స్వామిని కీర్తిస్తూ నేటికినీ తరిస్తూ వున్నారు ప్రతిసంవత్సరం వైశాఖ శుద్ధ ఏకాదశి నుండి పౌర్ణిమ వరకు బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తూవుంటారు కళ్యాణోస్వం, శకటోత్సవం, రథోత్సవం, పుష్పయాగం వంటి వుత్సవాలు దిగ్విజయంగా కొనసాగుతూనే వున్నవి.

ఇంతటి చరిత్ర కలిగిన మా పితృదేవుల రచనలు పరిశోధనకు తీసుకుని చి|| వేణుగోపాల శర్మ గారు మా నాన్నగారి కీర్తిచంద్రికలను జగద్విదితం చేసి మా కుటుంబాలకు మరియు మా నాన్నగారి పవిత్రమయిన ఆత్మకు ఎంతో సంతోషాన్ని కలుగజేసినందుకు ఈ గ్రంధముద్రణకు అవసరమయ్యే ఖర్చులన్నేమేము భరించి ఈ గ్రంధాన్ని ప్రకటింపజేయ సంకల్పించినాము. ఈ మహద్భాగ్యాన్ని మాకు అందించిన చి|| వేణుగోపాలశర్మ గారికి అనేకానేక ఆశీస్సులు, అభినందనలు తెల్పుతూ ఇకముందు కూడా ఈ చిరంజీవి ఇలాంటి సద్గ్రంధాలు వ్రాసి శ్రీ చెన్నకేశవ స్వామివారి అనుగ్రహంతో పిల్లాపాపలతో సుఖసౌభాగ్యాలతో ఆనంద మయ జీవితంతో వర్ధిల్లాలని ఆ స్వామివారిని ప్రార్థిస్తున్నాను.

ఆశీస్సులతో.....

విళంబి, కార్తీక పౌర్ణమి, **గంగవరం (రామక) నారాయణశర్మ,**

23 - 11 - 2018, బోధన్ - నిజామాబాదు - తెలంగాణ.

మహాదేవ
వేదరత్న, పురాణ సార్వభౌమ
పౌరాణిక వాచస్పతి, పారాశర సరస్వతి
**బ్రహ్మశ్రీ పురాణం మహేశ్వర శర్మ**
వేదశాస్త్ర పండితులు
శృంగేరి ఆస్థాన పౌరాణిక విద్వాంసులు

గణేష్‌నగర్,
కరీంనగర్.
చరవాణి :
9440008854

---

శ్లో॥ వేదశాస్త్రాది మర్మజ్ఞాన్
అనంత శ్రీవిభూషితాన్
తపస్వి ప్రవరాన్నౌమి
శ్రీమత: కరపాత్రిణ: ॥

"అస్మన్ మాతామహం రామం । జీవన్ముక్తం సదాభజే" మానవజన్మ ఎత్తిన తర్వాత దీనికి సార్థకత చేకూర్చే ప్రయత్నాన్ని చేయాలి. మానవజన్మ ఎప్పుడు సార్థకమౌతుందంటే తానెవరో తెలుసుకుని నేను పరమాత్మనని అనుభవపూర్వకమైన జ్ఞానాన్ని తెలిసికొని ఇన్నాళ్లనుండి నేను జీవుడననే భావాన్ని తొలగించుకొనుట, ఆనందస్వరూపుడయిన పరమాత్మను నేను నాలో ఏవిధమైన అనానందములు లేవు నేను నిత్యసచ్చిదానంద ఘనస్వరూపుడను, నాకన్నా ఏదీ వేరుగాలేదు అనెడు అద్వైతస్థితిని పొందుటయే మానవజన్మకు సార్థక్యాన్నిచ్చేది. ఏ ఇతరమైన జన్మలకీవిధమైన అవకాశము లేదు ఇట్టిస్థితి (ఆనందస్థితి) పొందుట అని యుండదు ఏదిపొందబడుతుందో అదిశాశ్వతముకాదు. దీనిని పొందేవున్నాము జీవుడు ఆనందస్వరూపుడే ఐయున్నాడు కానీ వీడు (జీవుడు) నేను "జీవుడను నేను దు:ఖిని" అని అనుకుంటున్నాడు. దీనికి కారణమేమిటి పరమాత్మ (ఆనందస్వరూపుడే అయ్యుండి) నేనుపరమాత్మను కాను అని అనుకొనుటకు గల కారణమేమిటి అంటే "అవిద్య" మాయ. ఎవరు మాయచేత కప్పబడి వున్నారో వారికి పరమాత్మను నేనను భావమేకలుగదు అందులకు ఈ మాయను తొలగించుకునే ప్రయత్నం చేయాలి.

మరి మాయ ఎట్లా తొలుగుతుందంటే మాయను ఎవడుమనపై వేసినాడో వాడుతొలగిస్తే పోతుంది. మనపై మాయను ఎవడువేస్తున్నాడంటే పరమాత్మ అని అనాలి. పరమాత్మా నీవెందుకయ్యా మాపై మాయను ప్రయోగిస్తున్నావు ? అంటే పరమాత్మ అంటాడు అదిలేకుండా నేను జగత్తునే సృష్టించలేను అంటాడు "ప్రకృతిం

సాకవమధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా" ప్రకృతి సాధనముగా జగత్సృష్టి చేసినాను ఆజగత్తులో జీవుడవైన నీవున్నావు అందులకై నీలో ఈ మాయ (ప్రకృతి) ఉన్నది. కారణము కార్యమునందు ఉండుట సహజమేకదా, అందుకే మాయను పరమాత్మ మనపై ప్రయోగించినాడు. లేదా మాయతో మనలను సృష్టించినాడు కావున మనమంతా మాయలో వున్నాము మననావరించి యున్న ఈమాయ ఎంతవరకు తొలగిపోదో అంతవరకీ జీవుడు "దు:ఖిని" జీవుడను అనుకుంటూ దు:ఖాన్ని అనుభవిస్తూనే వుంటాడు. అందుకని ఈ మాయను తొలగించుకొనుటకై మాయను ప్రయోగించిన పరమాత్మనే శరణాగతి పొందాలి

గీతాచార్యుడిదే అన్నాడు "మామేవయే ప్రపద్యన్తే మాయామేతాం తరంతితే" ఎవడు నన్నాశ్రయిస్తాడో వాడే యీమాయనుండి బయటపడుతాడు అనిదఅనర్థము. నాకున్న ఈ మాయ తొలగిపోవాలి అని పరమాత్మను ఏవేలమందిలోనో ఒక్కడు మాయనుండి తొలగిపోతాడు.

శ్లో ॥ మనుష్యాణాం సహస్రేషు । కశ్చిద్యదతి సిద్ధయే
వాతతామపి సిద్ధానాం । కశ్చన్మాం వేత్తి తత్వత: ॥

అని గీతాచార్యుడే పైవిధంగా అన్నాడు. ఇట్టి వేలమంది ఆశ్రయించేవారిలో ఒక్కడు మా తాతగారైన రామయ్యగారు. (మహాకవి బ్రహ్మశ్రీ రామక రామశర్మ) కేవలమాశ్రయించడమే కాకుండా తత్వత: ఆపరమాత్మను మాయను తొలగించుకొని చూచినవాడు మాతాతగారేనని నిర్దుష్టంగా చెప్పవచ్చు. ఇట్టి వ్యక్తులు మాయను తొలిగించుకొని ఆపరమాత్మరీ స్వరూపాన్ని అనుభవపూర్వకంగా "అహం బ్రహ్మోస్మి" అని బ్రహ్మస్థితిని అనుభవిస్తూ సంసారంలో ఉన్నా జీవించి ఉన్నాకానీ వీరని "జీవన్ముక్తులు" అని పిలుస్తారు ఇది అద్వైతులు చెప్పుమాట మాతాతగారు అటువంటి జీవన్ముక్తులు అని అనడంలో ఏమాత్రము అతిశయోక్తి లేదు. సంసారమునకాజీవుడు ఎప్పుడు దూరమౌతాడంటే సంసారములోని దు:ఖాన్ని తెలుసుకున్నప్పుడు. సంసారంలో ప్రతియనుభవమూ నాకు దు:ఖాన్నే ఇస్తుంది ఇందులోని సుఖములన్నీ క్షణికములే నిజమయిన ఆనందము, సంతోషము నిత్యమైనది పరమాత్మానందమే అని సంసారమున ఏవగింపు కలిగి ఈసడించుకొని పరమాత్మనాశ్రయించాలి. అప్పుడు నిజమైన శాశ్వతమైన ఆనందానుభవాన్ని పొందుతాడు అందుకని జీవుడు నైరంతర్య సాధన చేయాలి. ఈ క్రమంలో మాతాతగారు నైరంతర్య సాధన చేసిన యోగిపుంగవులు. సగుణ సాకారమూర్తి ఉపాసన నిర్గుణ

నిరాకారమునకు సాధనమౌతుంది.

శ్రీరామచంద్రుడిని నిరంతరం చింతిస్తూ పరమాత్మోపాసననే చేసినాడని చెప్పుకోవాలి " అహం బ్రహ్మాస్మి" అనే అనుభవవవాక్య జన్యానందాన్ని నిరంతర రామనామము నుచ్చరిస్తూ ఒక దివ్య అనుభూతిని పొందిన మహాముని. తానొక్కడేకాక ఎందరికో ఇట్టి అనుభూతిని కలిగించుట తదనుభవ సాధనములైన భజన స్తోత్రాదులు మొదలైనవాటిలో "ఏకస్వాదు నభుంజీత" అనే వాక్యానుసారము మంచిని తానొక్కడే అనుభవించరాదనే దానిని దృష్టిలోనుంచుకుని ఎందరెందరినో ధర్మోన్ముఖులను చేసినారు. ఎన్నో దృష్టాంతాలు, ఎన్నో అనుభవాలు మా తాతగారి విషయంలో పూర్వార్ధజీవనమైన తరువాత ఉత్తరార్ధమున రచనావ్యాసంగాన్ని కొనసాగించి కవిగా ఖ్యాతిగడించిన మహానుభావుడు. ఇన్నిసద్గుణాలు గలమాతాతగారి  దగ్గర అంతేవాసిగా ఉండి అతనిలో ఒక మహాచైతన్యాన్ని దర్శించి మాతాతగారివద్ద చదివినది కొంతే ఐననూ గురువునకు సమర్పించుకునే నిజమైన కృతజ్ఞతాత్మకమైన "గురుదక్షిణ" ఈ పరిశోధనా గ్రంధరచన " బ్రహ్మశ్రీ రామక రామశర్మగారి రచనలు పరిశీలన--విశ్లేషణ" అనే ఎంఫిల్ పరిశోధన.

భగవద్విషయమున ఉపాసకుడు ఉపాసిస్తూ ఏ ఫలాన్ని పొందుతాడో భగవదుపాసకులను ఉపాసించుటవలన కూడా అంతేఫలాన్ని పొందుతారు ఇందులో ఏమాత్రము సందేహమే లేదు. చి॥ గోపన్న (శేషం వేణుగోపాల శర్మ) మాతాతగారి రచనలను పరిశీలించి అనేక పర్యాయాలు ఆలో చన చేసి ఒకరకంగా ఉపాసన చేస్తున్నాడని చెప్పుకోవచ్చు. వారిజీవితాన్ని మననంచేయుట వారినామాన్ని స్మరించుట మొదలైన కార్యములన్ని ఉపాసనయే. మాకు లభించని ఈ అవకాశాన్ని యీ చిరంజీవి పొంది నాడంటే ఇతడు అదృష్టవంతుడే "నా బంధవిముక్తి చేయగల భారము నీయదే" అని ఎదురుగా ఉన్న చెన్న కేశవుణ్ణడిగితే కేశవుంటాడు నీకున్న అర్హత ఏమిటిరా అని నా అనుగ్రహాన్ని పొందాలంటే ఏదైనా అర్హత వుండాలికదా అని " హరిభక్తప్రియుండను నన్నుచేర్చుకో" అని అంటాడు.

భగవద్విషయమున ఉపాసకుడు ఉపాసిస్తూ ఏ ఫలాన్ని పొందుతాడో భగవదుపాసకులను ఉపాసించుటవలన కూడా అంతేఫలాన్ని పొందుతారు ఇందులో ఏమాత్రము సందేహమే లేదు. చి॥ గోపన్న (శేషం వేణుగోపాల శర్మ) మాతాతగారి రచనలను పరిశీలించి అనేక పర్యాయాలు ఆలో చన చేసి ఒకరకంగా ఉపాసన చేస్తున్నాడని చెప్పుకోవచ్చు. వారిజీవితాన్ని మననంచేయుట వారినామాన్ని స్మరించుట మొదలైన కార్యములన్ని ఉపాసనయే. మాకు లభించని ఈ అవకాశాన్ని యీ చిరంజీవి

పొంది నాడంటే ఇతడు అదృష్టవంతుడే "నా బంధవిముక్తి చేయగల భారము నీయదే" అని ఎదురుగా ఉన్న చెన్న కేశవుణ్ణడిగితే కేశవుంటాడు నీకున్న అర్హత ఏమిటిరా అని నా అనుగ్రహాన్ని పొందాలంటే ఏదైనా అర్హత వుండాలికదా అని " హరిభక్తప్రియుండను నన్నుచేర్చుకో" అని అంటాడు.

నాకున్న అర్హత నీవు భక్తప్రియుడవు నేను హరిభక్తులను ప్రేమించేవాడిని నాకీ అర్హతవున్నది అంతేకాదు కేశవుడవైన నీవేమన్నావు "అనన్యాశ్చింతయం తోమాం" ఎవరనన్యముగా నన్ను చింతిస్తారో వాని యోగక్షేమాలు నేను చూసుకుంటాను అని అన్నావుగా అందుకని "నీకున్ మ్రొక్కెద నిన్నె నమ్మితిసదా నీభారమే" అని వారి అనన్యశరణాగతిని పొందిన విధానాన్ని తెలిపి వారికున్న అర్హతను తెల్పినట్లైనది. భగవంతుడు తన ఎదుటనుండగా ఒకస్నేహితునితో మాట్లాడినట్లు సులభమైనపదాలతో గాంభీర్యార్థ ప్రతి పాదకములు ఐన ఎన్నో పద్యాలను పద్యకావ్యాలను రచించినాడు. ఇదంతా రామానుగ్రహమే అని అన్నాడు వందమార్లు రామాయణాన్ని పారాయణం చేయగా (తదుపాసనా ఫలితముగా వచ్చినకవనము) వచ్చిన కవనదార రామాయణానుగ్రహమే కావచ్చు లేదా శ్రీ రామానుగ్రహమే, గుర్వనుగ్రహమే ఐ వుండవచ్చు.

ఇట్టి ప్రాతస్మరణీయులైన మహామహితాత్ములైన మా మాతామహుల పద్యకావ్యములపై పరిశోధన గావిస్తూ పద్యసాహిత్యంపై కృషిచేస్తున్న కృషీవలుడైన వేణుగోపాలునికి కష్టపడి కృషించిన కృషీవలునికి ఏ విధమైన చక్కటి ఫలము లభిస్తుందో ఆ ఫలాన్ని సచ్చిదానంద ఘన స్వరూపాను భవానంద ఫలాన్ని ఆనంద గుణసాగరుడు అమందానందసందోహబృంద దాత రామచంద్రుడు ఇచ్చి ఉన్నతస్థితిని కలుగజేయు గాక యని అస్మదారాధ్య మూర్తిని గౌరీశున్ని ప్రార్థిస్తున్నాను.

మహాదేవ

విళంబి పుష్య శుద్ధ పంచమి

11 - 01 - 2019

**పురాణం మహేశ్వర శర్మ**

కరీంనగరమ్

**గంగవరం ఆంజనేయశర్మ**
**వేదపండితులు,గీర్వాణాంధ్రో పన్యాసకులు,సా.సం.సంస్థ**
కామారెడ్డి జిల్లా, తెలంగాణ.

---

దత్తజయంతి
22-12-2018

# సన్నుతి

శ్రీరామభక్త పరాయణుడు, నిరంతర రామనామ జపతత్పరులు, నిరాడంబరమైన జీవితాన్ని గడిపినవారు, మిగుల ధర్మనిరతులు ధర్మపరాయణులు ప్రేమమూర్తులు, ఆధ్యాత్మిక చింతనాపరులు అయిన మాతాతగారు శ్రీరామసాక్షాత్కారం పొందిన మహాకవి రామక రామశర్మగారు. అనేకమార్లు శ్రీమద్రామాయణ పారాయణములు చేసి, శ్రీరామయజ్ఞములను నియమనిష్టలతోఆచరించి "స్వయం తీర్త్వా పరాన్ తారయేత్" అనే ఆర్యోక్తి పరమార్థంగా సార్థక్యతను పొంది మాబోటి ఎందరికో జీవనగమ్యాన్ని ప్రసాదించినారు. వారిభక్తికి నిదర్శనంగా అప్రయత్నంగా పోతనవలె సహజ పాండిత్యంతో, శ్రీరామరాఘవ సంస్తవము, శ్రీరామరాఘవ స్తవము, శ్రీమదాంజనేయ స్తుతి, శ్రీ చెన్నకేశవ శతకము, శ్రీరామ నవరాత్రిపూజావిధానము వంటి మహాకావ్యాలు వెలువరించి తెలుగు భక్తి పద్యసాహిత్యానికి సత్తువ చేకూర్చినారు. సద్భక్తులకు పారాయణ గ్రంధాలను సమకూర్చినారు. అద్భుతమైన సమాసబంధాలు శబ్దసంపద, భావనామాధుర్యత, పదలాలిత్యము, సమాజానికి చక్కటి సందేశసొబగులు, ధర్మాచరణ, పరోపకార చింతన, సద్భక్తిభావన, నైతికత, కర్తవ్యనిష్ఠ వంటిసుగుణాల పరంపరలను సమాజంలోని పాఠకభక్తసమాజానికి చాలా చక్కగా అందించినారు, కవిగారైన మాతాతగారు నిరంతరం రామాయణ పారాయణంతోపాటు భాగవత పద్య పఠనమును శ్రావ్యంగా పఠిస్తూవుండేవారు. వీరి శతకపద్యరచన ఎందరినో పాఠకులను ఎంతగానో ఆకట్టుకునేది మా గ్రామం మన్నెంపల్లి లోని శ్రీ చెన్నకేశవస్వామి వారి మందిరములో అనేకసందర్భాలలో వీరి శతక పద్యాలను చాలామంది భక్తులు భక్తితో మధురగానం చేస్తూండేవారు. వీరిపద్యకవిత్వపటిమ చాలాగొప్పది వీరిభక్తికవిత్వాన్ని ఆదర్శంగా తీసుకుని కొంతమందిపద్యకవులుగా మారినారని చెప్పడంలో అతిశయోక్తి యేమాత్రంలేదన్నది వాస్తవం. భక్తులకు నిత్యపారాయణ గ్రంధాలుగా మారిన వీరిపద్యకావ్యాలను వెలుగులోకి తెచ్చే ప్రయత్నంలో భాగంగా శ్రీ వేణుగోపాలశర్మగారు

ఎంఫిల్ రూపంలో పరిశోధనచేసి సఫలీకృతులైనారు. ఈ బృహత్తరమైన కార్యమునకు శ్రీ సీతారామచంద్రుల దివ్యానుగ్రహంతో పాటు రచయిత శ్రీరామోపాసకులు అయిన మా తాగారి బ్రహ్మశ్రీ రామకరామశర్మగారి ఆశీస్సులు ఈ పరిశోధకులకు అంది వీరు ఉత్తరోత్తర విజయాభ్యుదయ పరంపరలనొందాలని ఆకాంక్షిస్తున్నాను.

రాముని సేవను జేసిన
కోమల భక్తుండు కవియు కోరికనిటులన్
రాముని భక్తుడుయైనటి
ధీమతి గోపన్న కిదియె దీవెనయగునూ ॥

పరిమళ భక్తిని జూపెడు
విరులగు పద్దెంపు ముత్యవిలువలనిటులన్
గురువగు రామయ గారికి
మురిపెము సుఖ్యాతినిటుల ముదముగ గూర్చెన్ ॥

**గంగవరం ఆంజనేయశర్మ**
వేదపండితులు, గీర్వాణాంధ్రోపన్యాసకులు,
కామారెడ్డి, తెలంగాణ.

# విన్నపం

బ్రహ్మశ్రీ స్వర్గీయ రామకరామశర్మ గారి దివ్య పాదార విందములకు సాష్టాంగ ప్రణతులర్పిస్తూ 1975 సంవత్సరంలో నాబాల్యం లో నేనువీరివద్ద ప్రత్యక్ష శిష్యరికం చేసి సంస్కృత అమరకోశం వంటివి నేర్చుకుని వారిద్వారా రామాయణ, భారత, భాగవత పద్యాలను వినితరించి వారి రమణీయపద్యధార స్వయంగా అనుభవించి ఆనందించినవారిలో నేనొకడిగా భావిస్తూ వారిపద్యరచనలపై తెలుగు ఎం.ఫిల్ పరిశోధనచేసే సద్భాగ్యం నాకు కలిగినందుకు ఆనందిస్తూ నా ఈ పరిశోధననే వారికి చెల్లించే ఒక చిన్న గురుదక్షిణగా భావిస్తూ నా పరిశోధన పుస్తకరూపంలో పాఠక సమాజంలోకి రావడానికి సహకరించిన కవిగారి పుత్రులు గంగవరం నారాయణ శర్మగారికి, మనుమలు రామన్న, అంజన్న గారలకు నమోవాకములు సమర్పిస్తూ పరిశోధనకు సహకరించిన వారందరికి ధన్యవాదములు తెలుపుకుంటూ పరిశోధనా క్రమాన్ని వివరించదలుచుకుంటున్నాను, కరీంనగరం జిల్లాలో తిమ్మాపూర్ మండలంలో మానకొండూర్ సమీపంలోని మన్నెంపల్లి గ్రామం మాది మాగ్రామంలోనే మూడు బ్రాహ్మణ కుటుంబాలు వసిస్తూవుండేవి గ్రామప్రముఖులుగానూ, పౌరోహితులుగానూ, పౌరాణికులుగాను, జ్యోతిష్య,వాస్తు రంగంలోనూ ప్రసిద్ధవ్యక్తిగా వీరు గుర్తింపు గడించియున్నారు ప్రతినిత్యం బహుకావ్య పఠన, పాఠనాదులవల్ల కవిగారు తెలుగు మధురపద్య కవిగానూ గొప్పగా రాణించారు. వాల్మీకీ రామాయణ పారాయణాదులు అనేకంగా, అప్రతిహతంగా కొనసాగించిన నిష్ఠగల శ్రీరామ భక్తిపరులు శ్రీరామపాద సేవాదురంధరులు వారింటికి రెండిళ్లతరువాత మా ఇల్లు మానాన్నగారు అదే గ్రామంలోని శ్రీ లక్ష్మి చెన్నకేశవ స్వామివారి మందిర ప్రధానార్చకులు కవిగారు ప్రతినిత్యం దేవాలయంకు వస్తూ భజన మొదలగు కార్యక్రమాలకై భక్తులను సమకూరుస్తూ అనేకానేక ధార్మిక కార్యక్రమాలను చేపట్టుతూండేవారు. గ్రామంలోని ఆబాలగోపాలము దాదాపుగా అందరూ విరివిగా పాల్గొంటూండేవారు. కవిగారి మనుమడు డా॥ రామక పాండురంగశర్మ గారు నేను ఒకేపాఠశాలలో సహవిద్యార్థులుగా విద్యనభ్యసిస్తూండే వాళ్లం కావడంతో ప్రతినిత్యం నేనువారింటికి అతనుమాఇంటికి రావడం, పోవడం జరుగుతూ వుండేది ఆవిధంగా నేను బ్రహ్మశ్రీ రామకరామశర్మ గారివద్ద శిష్యునిగా చే రడం జరిగింది కవిగారి కుమారుడు కిషన్‌రావుగారు (పెద్దన్నసార్) నాకు ప్రభుత్వపాఠశాలలో తెలుగుమాతృభాషను బోధించినారు నా మిత్రుడు వేదా భ్యాసనిమిత్తం మెదక్‌జిల్లా శివంపేటకు చేరుకున్నాడు నేను ఉన్నతవిద్యలకై కరీంనగరం చేరుకోవడం జరిగింది గురువులదయవల్ల, భగవంతుని కృప వల్ల మా ఇరువురికీ ఉద్యోగాలు లభించినవి

ఎంఫిల్ చేసి పి.హెచ్.డి చే సే తరుణంలో మిత్రునిసలహాతో " శ్రీరామ సాక్షాత్కారం పొందిన బ్రహ్మశ్రీ రామక రామశర్మగారి రచనలు - పరిశీలన - విశ్లేషణ" అనే అంశంపై ఈ విధంగా పరిశోధనచేసి ఆచార్య నాగార్జున విశ్వవిధ్యాలయం గుంటూరు వారినుండి ఎంఫిల్ పట్టా పొందడం జరిగింది.

కవిగారి పద్యరచనాశైలి బమ్మెర పోతనామాత్యునికి సరితూగువిధంగా కొనసాగిందని చెప్పడంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు. అద్భుతమూ, నిత్యనూతనమూ అయిన కవిగారి భక్తిరస పూరిత పద్యాలు ఆనందదాయకమై పఠితులకు సంతోషాన్ని అందించినవై యున్నాయి. చాలా మంది వీరిపద్య రచనలు చదివి అపరభక్తులుగానూ, ధార్మికులుగానూ, ఆవిర్భవించి మంచిగుర్తింపు నార్జించిన వారైయున్నారు. అలంకార శోభితమై సమాసగర్భితమై,భావనాచమత్కృతితో అద్భుతమైన కల్పనా పఠిమతో వీరి పద్యకావ్యాలు విశేషఖ్యాతుల నార్జించి యున్నాయి, విశేషవృత్తాలు, సర్వ లఘుకందాలు, ప్రశ్నార్థకపద్యాలు, పద్యమాలికలు జాతి, ఉపజాతి పద్యాలతో వీరి పద్యకావ్యాలు పాఠకులందరినీ గొప్పగా ఆకట్టుకున్నాయి.సామాజిక చైతన్యం, నీతులు, రీతులు, నైతికవిలువలు, మొదలగు సామాజికోపయో గితములైన వీరి పద్యరచనలు ఎందరినో అలరించాయి. శ్రీరామనామ వైశిష్ట్యతను, అమేయమైన భక్తిని పాఠకులలో అంకురింపజేసి, పుష్పించి,ఫలింపజేసే విధంగా కవిగారి రచనలు ఉన్నాయనే గొప్ప గుర్తింపును నాటి పాఠకసమాజం వీరికందజేసింది. కవిగారొక కృతిలో........

రాముని నమ్మియుంటి రఘురాముని సత్కృతి రాయనెంచి యా
రాముని బంటు యైన ఘనరక్షకు యంజని పుత్రు వేడి శ్రీ
రాము గుణావళుల్ విరివి రమ్యపు పద్దెములందు రాసి యా
రాముని దివ్య దీవెనల రక్షగ నొందితి స్వామి సత్కృపన్ ॥
మనమున గంటిని రామా
యనుదినమున అన్నిచోట్ల యన్నిట రామా
ఘనదైవ మిలకు రామా
నను వీడిన వదలనెపుడు నిజమిది రామా ॥

ఎంతనమ్మకము కవిగారికి రామునియందు, ఎంతభక్తి కవి గారికి శ్రీరామునియందు, ఎంత విశ్వాసము గలదో వారిరచనలు చూపుతున్నవిపైపద్యాల్లో కవిగారి ధృడత్వము, నిశ్చల, నిర్మల అపారమైన సద్భక్తి భావ నల పరంపరలు శ్రీరాముని తన మనములో నిలుపుకోవడమే గాదు దిశల న్, పగళ్లన్, నిశలన్ యన్నింటా మీదివ్య

రూపాన్నే నే దర్శిస్తూ వున్నాను రామయ్యా అంటూ ఎంతవినమ్రంగా వేడుకుంటూ వున్నారో ఆ దాశరథిని ఈ కవివరేణ్యులు అర్థమౌతోంది. మరో సర్వలఘు కందం దర్శిస్తే కవిగారి భావన ఇలా.....

స.ల.కం.విడువను పదములు రఘువర
దడయను భయమదియు గనను దయనిడనిటురా
యడిగితి దరిశన మిడుమని
తడబడకను యొసగునిపుడు దయగల సురుడా॥

ఇటువంటివి ఎన్నో ఎన్నెన్నో చిత్రవిచిత్ర పద్యగమనములు నాలాటి వర్తమాన పద్యకవులందరికి శ్రీ రామకరామశర్మ గారే అత్యంత ఆదర్శ వంతులు, ఆదరణీయులూనూ అని చెప్పుకోవడంలో తప్పేంలేదని అనిపిస్తూంటుంది. నిజంగా కవిగారి పద్యకవిత్వ నడకను గాని తీక్షణంగా పరిశీలించి చూసినట్లైతే ప్రబంధకవులకు ఏమాత్రం తీసిపోకుండా, పోతనాది సత్కవి రచనలకేమాత్రం తీసిపోకుండా వీరి పద్యరచనలు వాసిగాంచినవి.

చినకేశవ పద దాసుడ
యనవరతము స్వామినామ మమృత గానమ్
కనిపించు వేళవరకును
నిను విడువను కేశవాఖ్య నేమం బిదిరా ॥

ఇటువంటి పద్యరత్నములు వీరిరచనలలో కోకొల్లలు శ్రీరామనవరాత్రి పూజాకల్పము ద్వారా నైష్టికులకు, వైదికులకు, శ్రీరామభక్తులెల్లరకు ఉగాదినుండి రామనవమి వరకు ఏరోజు ఏ అర్చనా, ఏ నివేదనా, పూజాసరణి, కీర్తన, సన్నుతి, ప్రార్థన, రాగం, తాళం, పల్లవి, ఏసర్గ, ఏ శ్లోక స్వాహాకారము వంటివి అనేకరకాలుగా వైదికంగా నవరాత్రి పూజా విధానమును భక్త పాఠకలోకానికి అందించి ధన్యులైనారు.

ఈ విధంగా ఈశ్వరచింతనా తత్వము, శ్రీ రామ నామ వైశిష్ట్యమును, ధార్మికభావనలను, భక్తితత్వమును, తెలుగుసాహిత్యంలో పద్య గమనమును, అనేక కవిత్వగుణములను, సాంప్రదాయ పరంపరలను,దైవ చింతనను, పరోపకారమును, సేవాభావనను, ప్రేమభావనను, నిర్మల భక్తిని మొదలగు అనేకానేక మంచివిషయములను వీరి రచనలద్వారా సమాజానికి అందించి సద్హితమును చేకూర్చడంలో కవిగారు కృతకృత్యులైనారని నా ప రిశోధనకూడా వర్తమానకాల పాఠక సమాజమునకు ఒక మహనీయుని రచనలను పరిచయించిందని భావిస్తూ తెలంగాణం లోని మారుమూల ప్రాంతాలలోని మరుగున పడిన మాణిక్యాలను వెలుగులోకి తేవాలనే సంకల్పంతో

చేబట్టిన నా ఈ పరిశోధనను జనం మెత్తురేని అంతకంటే గొప్ప బహుమానం నాకు మరోటి కాబోదని విన్నవించుకుంటూ భగవంతుని దయవలన అన్నీ శుభాలే జరుగవలెనని ప్రగాడంగా కోరుకుంటూ ఆ కోదండరాముడు, శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామి, శ్రీ మదాంజనేయ స్వామి వారలు నన్ను దీవింతురు గాత అని వాంఛిస్తూ వున్నాను నాకు సహకరించిన వారందరికి నమస్సులు సమర్పిస్తూ సెలవ్......

రాముని సేవను జేసెదు
కోమల సద్గురువుకెపుడు కోరినమింతున్
నేమము తోడుత కొలిచితి
రాముని దీవెనలు కోరి రమ్యత నొప్పన్ ॥

పరిశోధన సద్విజయము
గురువులదగు పాదపద్మ గుర్తుగ నిటులన్
విరిమాలనట్లు వేసితి
గురువందనమిడుచు నేను కోరిక దీరన్ ॥

శ్రీరాముని పదసన్నిధి
నారచనల జేర్చినేను నమతుల నిడుచున్
శ్రీరాముని కృపకొరకై
యారాటమె నిదియు గాన యానందమదే॥

బుధజన విధేయుడు

**శేషం వేణుగోపాలశర్మ**

తెలుగు పండితులు, కరీంనగరం– తెలంగాణ.

9948941516,



# కృతజ్ఞతాంజలులు

- నాకు ఎం. ఫిల్. తెలుగు పరిశోధనకు అవకాశం ఇచ్చిన ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయము గారికి,
- నా పరిశోధనకు పరిశీలకులుగా సాయమిచ్చిన ఆచార్య డా॥ కె.యాదగిరి కె.యు. గారికి,
- నా ఈ పరిశోధనను పరిశీలించి పరిష్కృతం చేసిన వివిధ ఆచార్యవర్యులు నాగార్జున విశ్వవిద్యాలయం గారలకు,
- పరిశోధనలో ముఖాముఖిలో సహకరించిన వారికి,
- దయతో ముందుమాటలు వ్రాసి ఆశీస్సులందించిన వారలందరికి,
- బ్రహ్మశ్రీ రామకరామశర్మ గారి కుటుంబ సభ్యులందరికి,
- ముద్రణకు ఆర్థికంగా సహకరించిన శ్రీగంగవరం నారాయణశర్మ, రామశర్మ, ఆంజనేయశర్మ బోధన్ గారలకు,
- పరిశోధనలో సహకరించిన ఆధారగ్రంధ రచయితలకు,
- నా ఈ పరిశోధన విజయవంతం ఐనందుకు అన్నివిధాలుగా సహకరించిన ప్రత్యక్ష, పరోక్ష హితులందరికి,
- నా ఈ పరిశోధనా గ్రంథమును అందముగా ముద్రించిన విజయగ్రాఫిక్స్ అధినేత శ్రీ చీకోటి రాము గారికి,
- నా గురువులందరికి, నా కుటుంబ సభ్యులందరికి,కృతజ్ఞతలు, ఎల్లవేళలా నాకు తోడ్పాటు నందిస్తున్న నా సహచరి మాధురి కి. మా చిరంజీవులైన చి॥ మాళవిక, మౌక్తికలకు శుభాశీస్సులు.

# విషయానుక్రమణిక

**అధ్యాయం నం. 1 - జీవితం - సాహిత్య నేపథ్యం**



**అధ్యాయం నం. 2 - - సాహిత్య నేపథ్యం**



**అధ్యాయం నం. 3 - రచనల పరిశీలన-విశ్లేషణ**



**అధ్యాయం నం. 4**



**అధ్యాయం నం. 5**



--×--

# ప్రవేశిక

బ్రహ్మశ్రీ రామక రామశర్మ గారు గాయిత్రీ మాత ఉపాసకులు త్రికాల సంధ్యా వందనాతత్పరులు నిరంతర రామనామ సంకీర్తనాపరులు రామాయణ, భాగవత పారాయణా ధురందరులు ఆమూలాగ్రము అనేకపారాయణ, పట్టాభిషేకాది కార్యక్రమాలు నిర్వహించిన ఆధ్యాత్మిక చింతనాపరులు రామాయణ విషేశసర్గలు కంఠతాపట్టినవారు. నాగపాశ విమోచన సర్గ గాయత్రీరామాయణ సర్గ, సీతావివాహసర్గ తారకమంత్రోపదేశాది విశేష సర్గలే కాకుండా సుందరకాండలోని విశేష సర్గలు అన్నియూ సహస్రాధికాలుగా పారాయణాదులు చేయడంవల్ల ధారణ చేయడం జరిగింది.

వారిశిష్యుడిగా స్వయంగా వారిద్వారా అమరకోశాది కావ్యపఠనం విద్యార్థిదశలో వారి పౌత్రుడు రామక పాండురంగశర్మతో పాటు సహవిద్యార్థిగా నే విద్యాభ్యాసం చేయడంమూలానా వారి రచనలపై సమగ్ర పరిశీలన చేయాలనే కుతూహలం, ఉబ లాటం నాలో కల్గింది. నాకు తొలి గురువులుగా వారు లభించడం నా మహద్భాగ్యంగా నే భావిస్తున్నాను. నాలో సాహితీచింతనను పురికొల్పినవారు పరోక్షంగా వారే కావడం నా సుకృతంగా భావిస్తున్నాను. వారిద్వారా ప్రత్యక్షంగా వారి కావ్యాలు నే శ్రోతగా విని యుండడంవల్ల వారి పద్యగాన మాధుర్యం నన్ను సాహిత్య పఠనంవైపు మళ్లించిందని నేననుకుంటున్నాను. స్వయంగా వారి ద్వితీయ పుత్రులు ఐన బ్రహ్మశ్రీ రామక కిషన్‌రావుగారు ( పెద్దన్నగారు ) నాకు 3,4,5, తరగతులలో భాషోపాధ్యాయులుగా విద్యాబోధన చేసినందువల్ల మా గ్రామదేవాలయంలో ధార్మిక కార్యాల్లో స్వయంగా వారు నాచేత శతకపద్యాలు పఠింపజేయడంవల్ల కవిగారి నా చిన్ననాటి ప్రోత్సాహమే నన్నీ పరిశోధనా రంగంలోకి చేర్చిందని నే ప్రగాఢంగా భావిస్తున్నాను.

రామక రామశర్మగారి చెన్నకేశవ శతకం దాని ఆవిష్కరణ కార్యక్రమంలో విద్యార్థిగా నేను పాల్గొన్న అంశం స్మృతిపథంలో నుండి పోలేదు. అప్పుడే నాకనిపించింది పెద్దయ్యాక నేనుకూడా ఇటువంటి రచనావ్యాసంగంలో యుండియుంటే బాగుంటుందని అది యిప్పుడు నెరవేరుతుంది. గురువుగారి రచనలపై పరిశోధన నాకెంతో ఉత్సాహాన్ని, ఆనందాన్ని నింపినమాట వాస్తవం.స్వయంగా కవిగారు నాతో పద్యాలు చదివిస్తూండేవారు తద్వారా వారి ఆధ్యాత్మిక ఆలోచనలు నాలోనిండుకొని భక్తిశతకాలు వ్రాసే విధంగా నన్ను ప్రేరేపించినట్లుగా నేను భావిస్తున్నాను. మాధుర్యాన్ని వెతికి పంచిపెట్టే పనికి భగవంతుడు నన్ను పురికొల్పుతూ ఈ భాధ్యత నాకు ఒప్పగించినట్లు నా కనిపిస్తోంది ఈ వాస్తవం పరిశోధనా రూపంలో ఇలా వెలుగులోకి వస్తూండటం నా అదృష్టంగా నే తలుస్తున్నాను.

కవిగారి నాటి ఆలోచనాపరంపరలే నేటి ఆధునిక సాహితీవేత్తలలోనూ కూడా ఆలోచింపజేసేవిధంగా ఉన్నాయనడంలో అతిశయయోక్తి ఏ మాత్రం లేదు. ప్రతిపద్యం ఓ ఆణిముత్యం ఛంద:పరిజ్ఞానం పెద్దగా లేదని వారే ఓ పద్యంలో చెప్పుకున్నారు. భాగవతఘట్టాలు వీరిని రచనావ్యాసంగంలోకి పురికొల్పాయని వారికుటుంబసభ్యులు తెలియజేయడం జరిగింది. అరవైయవ వడిలో తెలుగు సాహిత్యంలో రచనా వ్యాసంగంలోకి ప్రవేశించుటకై పట్టుదలతో ఛందోలంకారాదులు ఔపాసన పట్టినట్టి ధృఢచిత్తులు వారు. రసవంతములైన, మధురములైన పద్యాలనెన్నింటినో పాఠకులకు అందించన మహా ఋషితుల్యులు యీ కవిగారు పోతనగారి ఒరవడిని దాదాపుగా అన్నిపద్యాల్లో కనిపింపజేసి పునీతులైనారు.

వారిలోని దైవచింతన వారనారోగ్యంతో ఉన్నాకూడా లెక్కజేయకుండా పర్లపల్లి గ్రామంలోని శ్రీచంద్రమౌళీశ్వరస్వామి వారి ఆలయంలో వారుజేసిన సాహితీసేవ భాగవత పద్య పఠనాదులు ఎందరికో సంతోషాన్ని ఆనందాన్ని కలుగజేసాయి. పోతన్నగారి పద్యరామణీయకత వీరిద్వారానే ఆప్రాంతంవారికి తెలియవచ్చింది అంటూ అప్పటివారు,ఇప్పటివారు అంటూంటే అది నమ్మశక్యం కాదేమో అనుకుంటాము కాని, అది వాస్తవ సత్యం. పోతన గారి ఒరవడి దాదాపుగా అన్ని పద్యాల్లో కనిపింపజేసినారు. కమనీయమైన కంద పద్యాలలోనైతేనేమి రమణీయమైన వృత్త పద్యాలలోనైతేనేమి ఆహ్లాదకరమైన ఉపజాతుల్లోనైతేనేమీ ఆనందాంబుధిలో పాఠకులను ముంచివేసిన కవిగారు నిజంగా ధన్యజీవులు వారి ఆధ్యాత్మిక సంపదను ఎందరో ధన్యజీవులు అనుభవించి తన్మయులైనారు. ఇప్పటికి వారు నిర్వహించిన ధార్మిక కార్యక్రమాలను తలచుకొని ఆనందింపని వారులేరు వారు నాగురువుగా లభించడం నేను అది నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను. తెలుగు సాహిత్యంలో మధురాధి మధురమైన కావ్యమేదైన ఉందీ అంటే అది పోతన గారి భాగవతమే. ఆ భాగవతంలోని అనేక ఘట్టాలు ప్రజల జీవితాల్లో అనేక సందర్భాల్లో ఉదాహరణాదులుగా వాడుకుంటు ఉండేవారు అటువంటి విశేష ఘట్టాలను మాకు భావయుక్తంగా వినిపిస్తూ ఉంటే విని తన్మయులం అయిపోయేవాళ్ళం ఆ రోజుల్లో ఇది ముమ్మాటికి వాస్తవం.

ప్రతిష్ఠాది (దైవ) వైదిక కార్యక్రమాల్లో వారు, వారి పిన్నాన్న, పెద్దనాన్న గారలు చేపట్టిన ఎన్నో దేవాలయాలు ఇప్పటికి దేదీప్యమానంగా ప్రకాశిస్తు నిత్య, ధూప, దీప, నైవేద్యాదులు బ్రహ్మోత్సవాది శుభకార్యక్రమాలతో "నిత్య కళ్యాణం పచ్చ తోరణం" గా అలరారుతున్నవి అంటే వారి దీక్షాదక్షతలకు ఇది దృష్టాంతమని చెప్పవచ్చు. వైదిక, పౌరాణిక. పౌరోహిత, జోతిష్య, సాహిత్య రంగాలలో వారు చేసిన విశేష కృషి సేవా

తత్పరత మొదలగు సత్కార్యాల వల్లనే ఈ ఖ్యాతి వచ్చింది. వారు రామసేవా పాద దురందరులు రామదాస పాద రజపుటణువు అని చెప్పుకున్న వారి కమనీయమైన భక్తిని తెలియజేస్తుంది.

వీరి కుటుంబ నేపథ్యం సాహితీ నేపథ్యం మొదటి అధ్యాయంలో, రెండవ అధ్యాయంలో వీరి రచనలు ఆంజనేయ స్తుతి, రామరాఘవ సంస్థవం, రామరాఘవ స్థవము, శ్రీరామ నావ నవరాత్రి పూజా విధానము చెన్నకేశవ స్వామి శతకం, మంగళ హారతులు, భజన గీతాలు మున్నగు రచనలను సమగ్ర పరిశీలన చేయడం జరిగింది. మూడవ అధ్యాయంలో వారి రచనలలోని భక్తి తత్వాన్ని తెలియజేయడం జరిగింది. మహాకవి బ్రహ్మశ్రీ రామక రామశర్మ గారు జీవిత చరమాంకం వరకు శ్రీరామనామ పారాయణాది ఆధ్యాత్మిక చింతనలోనే ఆరితేరి ప్రతినిత్యము ఎందరో ఔత్సాహికులకు సాహితీ మర్మములు, భక్తి తత్వమును, పారాయణాది పూజా పరంపరలను తెలియజేస్తూ పునీతులైనారు. వారి నిరంతర భక్త్యావేశం వేనోళ్ల ఎంతగానో కొనియాడబడింది. కవి గారి ఈ ఆధ్యాత్మిక చింతనాభావ పరంపరలే నాబోటి వారికి పద్యరచనారంగం వైపు ఆలోచనలు రేకెత్తించేలా చేసి నన్నీ గురుతరమైన గొప్పపనికి పూనుకునేలా చేసియున్న దనడంలో ఎటువంటి అతిశయోక్తి లేదన్నది నూటికి నూటిపాళ్లు వాస్తవం. జన్మ జన్మలకు గురువుగారి ఋణం తీర్చుకునే అవకాశం దొరుకుతుందో దొరకదో అనే వేదననాలో లేకుండా చేసిందీ పరిశోధనా కార్యక్రమం మహాకవి బ్రహ్మశ్రీ రామక రామశర్మగారి అమృత తుల్యమైన పద్యరచనలపై నాకు ఎంఫిల్ పట్టా లభించడం వల్ల కవిగారికి వారి కుటుంబసభ్య వర్గానికందరకూ శిరసా, వచసా, మనసా నమామి.

వినమ్రతలతో....

మీ అభిమాని
పరిశోధకుడు.
**శేషం వేణుగోపాలశర్మ**

# కవి గారి జీవితం - వంశం - పుట్టు పూర్వోత్తరాలు

**బాల్యం :-**

కవిగారు బ్రహ్మశ్రీ రామకరామశర్మగారు సూరయ్య-గుండమ్మ దంపతులకు కరీంనగర్ జిల్లాలోని మన్నెంపల్లి గ్రామంలో 1925 సం॥లో నిత్యానుష్ఠానపరులు పౌరోహితులు, పౌరాణికులు అయిన విప్రవంశంలో జన్మించారు. రామకవంశం, కీర్తి, ప్రతిష్ఠలు అందుకున్న వంశం పౌరాణికులుగా అర్చకులుగా, పౌరోహితులుగా, ఆచార్యులుగా, ఉపాధ్యాయులుగా, ఉపన్యాసకులుగా, వైద్యులుగా వివిధ రంగాలలో ఉపాధినందుతూనే సామాజిక సేవలు కొనసాగిస్తున్నారు. భక్తి భావాలు పరిఢవిల్లే విధంగా వీరి రచనలు ఆబాల గోపాలాన్ని ఆనందపరుస్తున్నాయి. నాటికి నేటికి అవి ప్రజల నాలుకలపై నర్తిస్తూనే ఉన్నాయి.

పరిశోధకుడిగా నేను కూడా కవిగారి సాహితీ శక్తికి ప్రభావితం చెందడం జరిగింది. స్వయంగా వారి శిష్యుడుగా ఓ 10 సం॥రాలు సంస్కృతంలోని అమరకోశం అలాగే ఆంధ్రనామ సంగ్రహము రామాయణభారత భాగవత పద్యాలు కొన్ని నేర్చుకొని ఉన్నాను. ఆనాటి ఆ గురుకుల ప్రభావమును నన్నీపనికి పురికొల్పింది. నే వ్రాసిన 10,12 కావ్యాలపై వీరి రచన శైలి ప్రభావాలు ఉన్నాయని చెప్పడంలో అతిశయోక్తి ఎంత మాత్రంలేదు. వీరి సాహితీసేద్య ఫలితాంశంలో కొన్న వీరి మనుమలు కుమారులు, ఆచార్యులు ఉపన్యాసకులుగా డాక్టరేట్లు, మాస్టర్ ఫిలాసిఫీలు పొందియున్నారు.

వీరి బాల్య విద్యాభ్యాసం నాటి రోజుల్లో అనువంశికంగా వచ్చినా పౌరోహితోది విద్యలు అభ్యసించడం జరిగింది. ప్రక్క గ్రామమైన నుస్థులాపురంలో విద్యాభ్యాసం ప్రభుత్వం నైజాం రాజుల వంశపాలనలో ఉంది. ఉర్దూ మీడియంలోనే విద్యరెండు, మూడు సంవత్సరాలకే ఉర్దూ పఠన లేఖనాది కృత్యములు నేర్చుకొని ఆ పాఠశాల విద్యకు స్వస్థి చెప్పి,కుల విద్యవైపే మ్రొగ్గు చూపడం జరిగింది. వారినాన్న గారు పితామహులు దీనికే ప్రోత్సహించారు. ఇంకేమి కవిగారు కుల విద్యారంగంలో గొప్పగా రాణించారు. "పువ్వు పుట్టగానే పరిమళించును" గదా అన్న చందముగా కుల విద్యలో నిగ్గుతేలారు. సంస్కృత పంచకావ్యాలు కొన్ని పురాణాలు, ఇతిహాసాలు క్రమము తప్పకుండా అధ్యయనం చేశారు. ఫలితంగా రామాయణ మహాకావ్యంపై ఆశక్తి పెంచుకున్నారు. వాల్మీకి రామాయణ పారాయణాదులు కొనసాగించండం ప్రారంభించినారు. సహస్రాధికంగా పారాయణాలు పూర్తిచేశారు. రామాయణం హవన, స్వాహాకార

హోమములు ఎన్నో పూర్తిచేశారు. వీరి నిత్యారాధనలో భాగంగా పఠన, పాఠనాదులు ఇలా ఉండేవి. బ్రాహ్మీ ముహూర్తంలో మేల్కోవడము, గొంతెత్తి రాగయుక్తంగా, భాగవత పద్యాలు పఠియించడము హరినామ సంకీర్తన చేయడము, సూర్యోదయం వరకు ఈ పద్య ఘోష రసరమ్యంగా చెవులకింపుగ వినిపింపచేస్తూ అందరిని సమ్మోహన ప పరుస్తుండేవారు.

ఉదయం దేవతార్చన, సుందరకాణ్డ పారాయణం, లింగార్చన వంటి పూజా కార్యక్రమములు పూర్తిచేసుకొని పౌరోహితం చూసుకొని శిష్యులకు పాఠ్యబోధన పూర్తిచేసి తిరిగి సత్కావ్యపఠనం కొనసాగిస్తూఉండేవారు. తిరిగి సాయంకాలం సంధ్యావందనం చేసుకొని భక్తులందరితో కలిసి భజనలు చేసి తీర్థ ప్రసాదములు స్వీకరించి ఇల్లు చేరేవారు. సుందరకాండ హవనాదులు, రామాయణ క్రతువులు ఎన్నియో నిర్వహిస్తూ వుండేవారు. సమయానుకూలముగా ధార్మిక కార్యక్రమాలు చేబట్టుతూ ఉండేవారు.

మహాభాగవతంలోని గజేంద్రమోక్షం, ప్రహ్లాద చరిత్ర, అంబరీష,వామన వృత్తాంతఘట్టాలు ఎన్నింటినో కంఠతా చేసి విద్యార్థులైన శిష్యులకు కంఠస్థం చేయిస్తూండేవారు. జ్యోతిష, పురాణ, వైదిక అంశాలపై చర్చలు, చర్చోపచర్చలు జరుగుతూవుండేవి. అందులో వీరు ప్రధాన ప్రాసంగీకులుగా ఉండేవారు. వీరు చేప్పే అంశాలు శ్రోతలకు చాలా కర్ణపేయంగా ఉంటూ ఉండేవి. అపుడపుడు గ్రామ రాజకీయ విషయాలలో చర్చల్లో పాలు పంచుకుంటూండేవారు. వారి అన్నగారు బ్రహ్మశ్రీ రాధాకృష్ణ శర్మగారు ఆయుర్వేద వైద్యులుగా గ్రామరాజకీయాల్లో ప్రముఖ పాత్ర పోషిస్తూండేవారు. గ్రామస్థులు మహా భక్తులుగా తీర్చిదిద్దబడినారు. ఇప్పటికీ 2011లో కూడా వారిద్వారా బోధనలు విని తరించినవారు కొందరు ఇంక వున్నారు అని చెప్పడంలో సందేహం ఇసుమంతైనా లేరు అన్నది వాస్తవం.

అనేక సందర్భాల్లో, బ్రహ్మోత్సవాది వైదిక కార్యక్రమాల్లో ఆలయ ప్రతిష్ఠాది క్రతువులలో అనేక సమయాల్లో అభినందన ఆశీఃపూర్వక పద్యాలు ఆనందాన్ని పంచేవిగా ఉంటూఉండేవి. వారి పద్యగానపఠిమ శ్రోతలకు ఎంతో సంతోషాన్ని పంచెపెట్టేడిగా వుండేది.

శ్లో॥ శ్రోత్రం శృతేనైవనకుండలేన
దానేనన పాణి : ర్నతుకంకణేన
విభాతికాయ : కరుణాపరాణామ్
పరోపకారేణ న చందనేన ॥ (1)

అనే సుభాషిత శ్లోకం వీరిపట్ల చక్కగ తగియుండేది. వీరు స్వాభావికంగా ధర్మ

చింతనతో ఉండేవారు. ఇతరులకు తనవంతు చేతనైన సహాయం చేస్తూ ఉండేవారు.

విద్యాదానం – మహాదానం" అన్న ఆర్యోక్తి ప్రకారంగా శిష్యకోటికి ఫలాపేక్ష రహితంగా విద్యాదానం చేస్తూండేవారు. మహా సాత్వికునిగా ప్రకాశిస్తూ ఉండేవారు.

శ్రీమాన్ రామక రామశర్మ కవిగారు 1955 సం॥లో మన్నెంపల్లి గ్రామంలో శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామి మందిర ప్రాంగణంలో నవకుండాత్మాక చతుర్వేదయుక్త శ్రీ మహావిష్ణుయాగము చేసినట్లుగా కవిగారి అల్లుడిగారి తమ్ముడి మంగళంపల్లి సత్తయ్య గారు వివరించారు. ఈ యజ్ఞ నిర్వహణకోసం వివిధరంగాల నుండి వేదపండితులను ఆహ్వానించిపాంచాహ్నికదీక్షతో యాగం ప్రారంభించారు. ఆ రోజుల్లో ఏదైనా ధార్మిక కార్యం చేయాలంటే నిధులలేమి ఆర్థికంగా కొరత ఉన్నప్పటికి పెద్దవారు కొందరు శర్మగారూ ఇది మీ వల్ల ఔతుందా అని ప్రశ్నించగా అంతా స్వామి దయ అంటూ చెన్నకేశవ స్వామి వారిపై భారంవేసి ఉదారులైన కొందరు దాతల వస్తు, ద్రవ్య, ధన రూపేణా సాయం పొంది దిగ్విజయంగా పూర్తి చేవారు. మృత్యుంజయశర్మ, ఇంకా ధర్మపురి, మంథని, యాదగిరి, వేములవాడ, పొలాస, భాగ్యనగరం మున్నగు ప్రాంతాలనుండి ఆహ్వానింపబడిన వేదపండితులు, ఋత్విజులు, విష్ణుయాగాన్ని విధివిధానంగా పూర్తిచేశారు. ఈ పరగణాలోనే ఒక గొప్ప మహాయజ్ఞంగా నాడు అందరిచే ప్రశంసలు అందుకున్నది.

ఏదైనా ఒక మంచిపని చేయాలి అని అనుకున్న వెంటనే ఆహరహం శ్రమించీ ఆ పని పూర్తి అయ్యేవరకు విశ్రమించేవారు కారు. అలాగే లక్ష్యసాధన దిశలో ఎన్ని అవాంతరాలు ఎదురైనప్పటికి ఆర్థికంగా ఇబ్బందులు తలెత్తినప్పటికీ గ్రామంలోని స్థితిమంతుల వద్దకు వెళ్ళి విషయం వివరించి కార్య సాఫల్యతచేయించేవారు. వారి ఇలవేల్పు శ్రీరాముడు ఇష్టదైవం కేశవస్వామి. ఆరాధ్యదైవం చంద్రమౌళీశ్వర సామి. నియతి తప్పకుండా వీరిని ఆరాధించి లోక క్షేమాన్ని కాంక్షించి అనేక ధార్మిక కార్యక్రమాలు నిర్మహిస్తూవుండేవారు. ఇప్పటికీ వారి రోజుల్లో స్వయంగా వారేర్పరచిన కట్టుబాట్లు గ్రామ మందిరంలో అమలులో ఉన్నయి. అందరూ అవే ఆచరిస్తూండటం వారిపైన ఉండే గురుతరమైన భక్తి గాఢమైన అభిమానం అని చెప్పవచ్చు.

శ్రావణమాసంలో ప్రతి శనివారం, ప్రతి సోమవారం మందిరంలో స్వామివారికి పల్లకీ సేవా కార్యక్రమాలు నిర్మహించటం జరుగుతూ ఉండేది. పంచ ప్రదక్షణలు వివిధ స్తోత్రాలతో సామూహిక భక్తులతో జరుగుతుండేవి. ఒకప్రదక్షిణం పూర్తికాగానే ధ్వజస్తంభం వద్ద ఓ పది ఇరవై నిమిషాలు ఆగి రామాయణ, భారత, భాగవత, వివిధ శతక పద్యాలు గొంతెత్తి లయాత్మకంగా చదివేవారు. పద్యాలు చదివే శిష్యులను కూడా

తయారు చేశారు. ఆ ప్రభావం నాపై (పరిశోధకుడు) కూడా పడింది. సందర్భానుసారంగా ఆశువుగాకూడా కొన్ని పద్యాలు వారు చదువుతూ ఉండేవారు. గ్రామంలోని 70-80 సం॥ల వయస్సులో ఉన్న వృద్ధులను అడిగి సేకరించిన పద్యాలను కొన్ని ఈ క్రింద ఉదాహరిస్తున్నాను.

చ॥ భజనలు చేయరండి ఘన భక్తులు మీరని స్వామి దీక్ష మీ
సుజనులు స్వీకరించి శుభ సూక్తులు స్తోత్రములాది పద్యముల్
ప్రజలకు జెప్పజేయగను భక్తుల వేదిక దేవళంబు ఈ
నిజమునునమ్మిరండి జనులెప్పుడు మంగళకాంక్ష దీరగన్ ॥(2)

ఉ॥ రాముని నమ్మిరండి రఘు రాముని కొల్వగరండి మీరటన్
స్వామికి అర్చనాదులను సాంతము జేసిన చాలు చాలు ఈ
స్వామికృపాకటాక్షములు సర్వ శుభంబుగు మేలు మేలు ఆ
రాముని వేడరండు కడు రక్షణ పొందుదు స్వామి సేవలో ॥ (3)

ఉ॥ శాంతత పొంద రండు మన స్వామికి సేవల సేయరండువే
దాంతప రీమళంబులగు ధార్మిక సూక్తులనందరండు ఏ
కాంతపు సేవజేసి నిజ కాంతుడు కేశవస్వామి గొల్వ శ్రీ
కాంత సమేతుడైన శుభదక్షుడు కేశవ స్వామి మ్రొక్కగన్. (4)

మ॥ వరదా దాసుల గావ రారయిపుడున్ వాదింతు నీవేళ ఏ
సరదాకోసము గాదు గాదుర హరీ సాక్షాత్తు శ్రీ కేశవా
కరినావేళల నెట్లు సాకితివి మాకారీతి సంరక్షణనన్
సిరియున్, శాంతియు చిత్తశుద్ధి నిడుమా శీఘ్రంబుగా కేశవా॥ (5)

శా॥ గోవిందా జన సేవితా శుభకరా శ్రీపుండ రీకాక్షమామ్
సేవించే మముజూడ రార భగవన్ దీనావనా కేశవా
గావించంగదవయ్య క్షేమ మెపుడున్ జ్ఞానంబు సద్భావనల్
భావంబందున కోర్కెదీర్చు యనఘా పద్మాకరా కేశవా॥ (6)

ఆ॥వె॥ తల్లిదండ్రి సేవ తగు దేవతార్చనా
పాప భీతినెపుడు పరుల హితము
కోరువారు జగతి కోర్కెల నీడేర్చ
కేశవుండడుగలడు కీర్తియుతుడు ॥ (7)

ఆ॥వె॥ తోటివారికీవు పాటి సాయముజేయ
పరుల సేవ నెపుడు ఫలము నిచ్చు
దేశసేవజేయు దేవతార్చనముయున్
రామనామ మెపుడు రక్షసేయు.॥ (8)

కం॥ రాముని సేవే జాలును
రాముని శుభనామ స్మరణ రంగని జపముల్
మీ మన మందిరమందున
కోమల మౌ రామునిల్పి కొలిచిన ఘనమౌ.(9)

కం॥ న్యాయము, ధర్మము, సత్యము
ధ్యేయముగా వెళ్ళునట్టి దీక్షాయుతులన్
మాయా, మర్మము లెరుగని
నీయీ భక్తులను సాకు నీరజ నేత్రా ॥ (10)

తే॥గీ॥ స్వామి సేవకు సంసిద్ధ మంటు జనులు
దేవళంబున అడుగిడి దీప్తియుతుని
క్రమము దప్పక అర్చన లాది పూజ
లన్ని జేసిరి కాపాడ రార వేగ ॥ (11)

గ్రామములోని భక్తులను ఉద్దేశించి భక్తులకు దేవునిపై ఆసక్తిని కులుగజేస్తూ భక్తులారా మీరంతా దేవాలయంలోకి రండి యిదే వేదిక మంచి దీక్షలో యున్న మీకు సూక్తులు వినడానికి ఇది ఓ గొప్ప సందర్భం అంటూ మీరందరూ స్వామి సేవజేయడానికి, స్వామి కరుణా కటాక్షాలు మీపైన తప్పకుండా ఉంటాయి అంటూ వారిలో చైతన్యం కలుగజేసే విషయాన్ని ఈ పద్ధతి ద్వారా కవి చక్కగా నిరూపించాడు. ఎటువంటి సదుద్దేశాలు గలిగిన భక్తి, ఆధ్యాత్మిక సిద్ధాంతాల ద్వారా దైవకటాక్షం లభిస్తుందని అందరికి ఇది సిద్ధిస్తుందని ప్రతి నిత్యం ఎందరినో భక్తి మార్గంవైపు మళ్ళించి వారి ఆధ్యాత్మిక చింతనను బలోపేతం చేసినారు. యిప్పటికి గ్రామస్థులు కొందరికి వారందించిన పద్య సంపద యింకా వారి వారి ముందు తరాలవారికి అందించే విధంగా సిద్ధమై ఉన్నవారిని చూస్తూంటూ కవిగారి దూరదృష్టి, ఆలోచన గాఢమైన భక్తానుబంధం మొదలగు సుగుణాలు మరెపుడు రాకుండా ఉన్నవి. ఆరవై డెబ్బై సంవత్సరముల వయస్సులో ఉన్నవారి అమ్మాయి మరియు ఆమె సహచరులకు ఇప్పటికి అనేక పద్యాలు మంగళహారతులు, భజన పాటలు, యింకా గుర్తు ఉండి వారివారి

దేవాలయ ప్రాంగణంలో చదివి వినిపిస్తూ ఉండటం చేస్తూ ఉంటారు. కరీంనగర్ పట్టణంలోనే వీరాంజనేయ దేవ స్థానము, శివాలయము ఈ రెండు ఆలయాల్లో కవిగారు చాలా కాలం నివాసంగా ఉన్నారు. వీరి కుమార శేఖరుడు అయిన సూరయ్య, సూరమ్మ గారూ కూతురు అల్లుడు అయిన, కమలమ్మ చంద్రమౌళీశ్వర శర్మ గారు ఇప్పటికిని ఆయా ఆలయాల్లో పూజాధికాలు నిర్వహిస్తున్నారు. వారందరికి ఈ ఆధ్యాత్మిక నేపథ్యం కవిగారు అందించిందిగా వారు చెబుతుంటారు.

స్వతహాగా కవిగారు ఛందశ్శాస్త్రాది, అలంకరణాది, వ్యాకరణ గ్రంథాలు పఠించలేనని ఓ పద్యంలో చెప్పుకున్నారు. యాభైయ్యవవడిలో కవిత్వం వ్రాయాలనే సంకల్పం వారిలో గలిగింది. దానికి ఉనికిగా కొంతమంది మిత్రుల ప్రోత్సహాంతో సాధారణ ఛందోలంకారాది, భాషావ్యాకరణాది శాస్త్రాంశాలు నేర్చుకొని పద్యరచనకు పూనుకొన్నారు. అలా ప్రారంభమైన వారి కవితాసేద్యం  ఓ ఐదారు పుస్తకాలుగా వెలువడి భజన, పాటలుగా, స్తోత్ర, రత్నాలుగా పాఠకలోకానికి అందుబాటులోకి వచ్చాయి.

ముద్రణా  యంత్రాలు అరకొరగా ఉండే ఆ రోజుల్లో ఆధునిక సాంకేతిక ప్రగతి పెంపొందని ఆ రోజులలో కవిగారు ఎంతో శ్రమకు ఓర్చి పుస్తకాలు ముద్రింపజేసి వలయు ఔత్సాహకులకు పారాయణం చేసుకొనే వారికి ఉచితంగా అందివ్వడం ఆ విషయాన్ని పుస్తకంలోనే ముద్రించడం ఆయా పుస్తకాల్లో ముందు మాటలు వ్రాసిన వారినుండి ఈ విషయాలు విని ఆశ్చర్యపోవడం జరిగింది. ఎంతో వ్యయ ప్రయాసలు వారు అనుభవించి ఆధ్యాత్మిక ప్రచారంలో భాగంగా ఇలాంటి స్వచ్ఛంద కార్యక్రమాలు చేపట్టారు. కవిగారి భక్తి చింతనకు ఆదర్శమిది.

దైవ భక్తి పరాయణులైన కవిగారు ఆధ్యాత్మిక భావాలను అందరిలో కలిగింపజేసే ఉద్దేశ్యంలో చెడును దృంచి మంచిని పెంచే సదాశయంలో అనేకములైన శ్రీమద్రా మాయణ స్వాహాకారాది యాగములనెన్నిటినో నిర్వహించినట్లు ప్రస్తుతము ఆ ప్రాంతాలలో వున్నటువంటి వృక్షాలు తెలియజేస్తుంటాయి. పూర్వకాలంలో అనావృష్టి బాధలు ఏర్పడినపుడు కర్షకుల దుఃఖాన్ని తొలగ ద్రోయడానికి అనేక ధార్మిక కార్యక్రమాలు చేపట్టేవారు. వాటిలో కొన్ని భాగవత సప్తాహాలు, రామాయణ, భాగవత ప్రవచనాదులు ఏర్పాటు చేస్తూండేవారు. విషయనిపుణులైన పండిత ప్రకాండులను ఆహ్వానించి ధార్మిక ప్రవచనములు ఎన్నింటినో ఏర్పరచేవారు గ్రామస్తులు అందరు ఈ ధార్మిక కార్యక్రమాల్లో విధిగా విరివిరిగా పాల్గొని విజయవంతం చేసేవారు ఆనందానుభూతులకు లోనవుతూ వుండేవారు.

అలాగే దీనిలో అందరిని భాగస్వాములను చేయనెంచి స్వామివారి మందిరంలో అఖండ దీపారాధనలు ఏర్పాటు చేసేవారు. మండల దీక్షగా దాదాపు 40 రోజులుగా దీపము అఖండముగా వెలిగే ఉద్దేశ్యంతో అన్ని వర్గాల వారి నుండి స్వయంగా తైలం సేకరించి వారి నేతృత్వంలో ఈ దీపారాధనా కార్యక్రమాలను చేపట్టేవారు. అలాగే ఆఖండ హరానామస్మరణ, సప్తాహాలు చేస్తూండేవారు. ద్వాదశాక్షరి "ఓం నమో భగవతే వాసుదేవాయ", అష్టాక్షరీ "ఓం నమో నారాయణాయ" అలాగే పంచాక్షరీ "ఓం నమః శివాయ" వంటి సాముహిక కార్యక్రమాల్లో గ్రామస్తులందరిని భాగస్వాములుగా చేస్తుండేవారు.

రామకోటి ప్రతులు అందరిచేత వ్రాయిస్తుండేవారు. ఉత్సాహంగా అందరు పొల్గొనేవారు. చిరుతల రామాయణం, యక్షగానములు, హరికథలు, వంటి కళలకు ప్రోత్సాహాన్ని అందిస్తూండేవారు. అంతేకాకుండా వినోదం పొందడానికి నేటి సాంకేతిక పరమైన అంశములు ఆ రోజుల్లో అందుబాటులో ఉండేవి కావు. వీటిల్లోనే ఇటువంటి ధార్మిక కార్యక్రమాల్లోనే వారందరూ ఆనందాన్ని పొందుతుండేవారు. ఉదయంనుండి సాయంత్రం వరకు ఆరుకాలాలు శ్రమించి కర్షకులైన వారందరూ హరికథల ద్వారా వినోదాన్ని అలాగే ఆధ్యాత్మిక శక్తిని పొందుతుండేవారు. కవిగారు ఇచ్చిన ప్రోత్సాహంతో ఆయా కళలను వృద్ధి చేసుకొనేవారు ఎందరో నేటికిని వారి వారి కళలను అభినయ పూర్వకంగా వినిపిస్తూ దర్శింపజేస్తున్నారు.

అష్టాక్షరీ "ఓం నమో నారాయణాయ" అలాగే పంచాక్షరీ "ఓం నమఃశ్శివాయ" వంటి సాముహిక కార్యక్రమాల్లో గ్రామస్తులందరిని భాగస్వాములుగా చేస్తుండేవారు.

రామకోటి ప్రతులు అందరిచేత వ్రాయిస్తుండేవారు. ఉత్సాహంగా అందరు పొల్గొనేవారు. చిరుతల రామాయణం, యక్షగానములు, హరికథలు, వంటి కళలకు ప్రోత్సాహాన్ని అందిస్తూండేవారు. అంతేకాకుండా వినోదం పొందడానికి నేటి సాంకేతిక పరమైన అంశములు ఆ రోజుల్లో అందుబాటులో ఉండేవి కావు. వీటిల్లోనే ఇటువంటి ధార్మిక కార్యక్రమాల్లోనే వారందరూ ఆనందాన్ని పొందుతుండేవారు. ఉదయంనుండి సాయంత్రం వరకు ఆరుకాలాలు శ్రమించి కర్షకులైన వారందరూ హరికథల ద్వారా వినోదాన్ని అలాగే ఆధ్యాత్మిక శక్తిని పొందుతుండేవారు. కవిగారు ఇచ్చిన ప్రోత్సాహంతో ఆయా కళలను వృద్ధి చేసుకొనేవారు ఎందరో నేటికిని వారి వారి కళలను అభినయపూర్వకంగా వినిపిస్తూ దర్శింపజేస్తున్నారు.

సద్గుణములు, సద్భావములు, అహింసవంటి మంచి మార్గాలను అందరికీ సూచిస్తూండే వారు. అందులో భాగంగా అనేకానేక ధార్మిక సమావేశాలు ఏర్పాటు

చేసి అందులో అందరిని భాగస్వాములను చేస్తూండేవారు. తత్ఫలితంగా పామరులు కూడా రాగయుక్తంగా పద్య పఠనం చేయడమారంభించినారు. "లక్షాధికారైన అవణమన్నమెకాని" వంటి ధర్మపురి లక్ష్మినరసింహా శతకాల, ఠంఠంఠమ్మని భీషణధ్వనులు వంటి దాశరథీ శతక పద్యాలు అందరికి జిహ్వాగ్రాలపై నర్తిస్తూండేవి, అలవైకుంఠ పురంబులో, ఎవ్వనిచేజనించు వంటి భాగవత పద్యాలు యిప్పటికినీ వారిచే పఠింప జేయబడుతున్నాయి. ఆయా సందర్భానుసారంగా దేవాలయ బ్రహ్మో త్సవాది కార్యక్రమాల్లో శ్రావణమాస శని, సోమవారాల్లో రాగయుక్తంగా పద్యాలాలపిస్తూనే ఉంటారు. ఆధ్యాత్మిక అంశాలుఅందరిలో వ్యాపింపజేసిన కవిగారు ధన్యజీవిగా కీర్తించబడినారు.

కవిగారు తమ ఆశయానుగుణంగా తమ కుటుంబాన్ని తీర్చిదిద్దినారు. వీరికి కుమారులు, నల్వురు, కుమార్తెఒక్కరు. తృతీయకుమారుని వేదాభాస్యము చేయించి ఆగమాదులు నేర్పించి యజ్ఞాచార్యునిగా తీర్చదిద్దినారు. వారి పేరు బ్రహ్మశ్రీరామక నారాయణ శర్మగారు. ప్రస్తుతం వీరు నిజామాబాద్ జిల్లాలో బోధన్ నగరంలో రామాలయంలో స్థిరపడ్డారు. రెండవ కుమారుడు సూర్యనారాయణశర్మ గారు వీరు కూడా కరీంనగరంలోని వీరాంజనేయ స్వామి దేవస్థానంలో ప్రధానార్చకునిగా సేవలు కొనసాగిస్తునే ఉన్నారు. మరో అబ్బాయి కృష్ణమూర్తి గారు వీరు విశ్రాంత ఆంధ్రభాషోపాధ్యాయులుగా ఉన్నారు. దాదాపు 35 సం॥లు ఉపాధ్యాయ వృత్తిలో పనిచేసి ప్రస్తుతము పౌరోహితాది కార్యక్రమాలు చేస్తూ కరీంనగరంలోనే ఉన్నారు.

వీరి పౌత్రులు రామశర్మ, ఆంజనేయశర్మ, పాండురంగ శర్మ వీరు వేదాభ్యాసం చేసినారు శివంపేటలో బ్రహ్మశ్రీ మాణిక్య సోమయాజుల శర్మగారి వద్ద వేదాభ్యాసం పూర్తిచేసి శాస్త్రిగారి వద్ద సంస్కృతకావ్యాదులు పూర్తి చేసుకొని వేములవాడ శ్రీ రాజరాజేశ్వర సంస్కృత కళాశాలలో .విద్యాభ్యాసం ముగించుకుని తిరుమల తిరుపతి దేవస్థానం వారి సంస్కృత విద్యాపీఠంలో శిక్షాశాస్త్రి (బి.ఈ.డి) పూర్తిచేసుకుని ప్రభుత్వోపన్యాసకులుగా భాగ్యనగరసమీపంలో పనిచేస్తున్నారు. కొందరు వివిధరంగాలలో ఉద్యోగాలు చేస్తూవున్నారు. మరికొందరు విదేశాల్లో వుద్యోగాలు చేస్తూవున్నారు. వీరి కుమార్తె పిల్లలు ముప్వురుపెద్దకుమారుడు పురాణం మహేశ్వర శర్మ వేద పండితులుగా, పౌరాణికులుగా, పూర్వోత్తర మీమాంసాది శాస్త్రాధ్యాయులుగా, యజ్ఞాచార్యులుగా అనేక వైదిక, ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాదులు కొనసా గిస్తూ వున్నారు. వీరు సంస్కృతాంధ్ర, కన్నడ భాషాపాండిత్యము సాధించినారు. మొత్తానికి కవిగారి కుటుంబంలోని వారందరు మంచి మంచి ఉన్నత విభాగాల్లో, వివిధుద్యోగాల్లో స్థిరపడియుండడం ముదావహం.

గ్రామంలోని ఆంజనేయ స్వామివారి దేవాలయం శిథిలావస్థలో వుండగా దానిని

బాగు పరిచేనిమిత్తం అది ఒక గొప్పకార్యక్రమంలా భావించి ఆపనిని వారి భుజస్కంధాలపై వేసుకుని అట్టి దేవాలయమును జీర్ణోద్ధరణ గావించి పున:ప్రతిష్ఠాదులను చేసి శతరుద్రీయాదులను గావించి సహస్ర కలిశాభిషేకాదులలో గ్రామస్థులను భాగస్వాములుగా చేసి వివిధ అనువాకాలతో, పంచోపనిషత్ మహామంత్రాదులతో అభిషేకాలు చేయించి సామూహిక హనుమద్వ్రతాలను చేయించి గ్రామస్తులందరిలో ఆధ్యాత్మికానందాలను నింపినారు. అందరి అభిమానాన్ని చూరగొన్నారు. ఆనాటి ఆ ఆనందంలో పాలుపంచుకొన్నవారు నేటికినీ ఒకరిద్దరు ఆగ్రామంలో వుండడం ఒకవిశేషం. పరిశోధకుడిగా(వేణుగోపాల శర్మ) నేనువెళ్లి వారివద్దనుండి కొంతసమాచారం సేకరించినాను.

సామూహిక సత్యనారాయణ వ్రతాదులు కార్తీక పౌర్ణమి వంటి శుభదినాలలో గ్రామస్తులందరిచేత అందరినీ భాగస్వాములుగా చేసి గ్రామంలోని శ్రీ చెన్నకేశవస్వామి మందిరంలో ఆలయాన్ని సర్వాంగసుందరంగా తీర్చిదిద్ది వీరినేతృత్వంలో శ్రీ రమాసత్య నారాయణ వ్రతాలను నిర్వహింప బడుతూవుండేవి. అన్నివర్గాలవారు సంతోషంతో వుండేవారు. అన్న సంతర్ప ణాది కార్యక్రమాల్లో అందరూ విధిగా పాల్గొంటూవుండేవారు. మఖ్యంగా స్వామివారి బ్రహ్మోత్సవాలలో విశేషించి శకటోత్సవాలు, రథోత్సవాలు వంటివి ఆబాల గోపాలానికి నేత్రానందాన్ని కలిగిస్తూ వుండేవి. కవిగారు గ్రామంలోని యువతీ యువకులందరినీ చేరదీసి వారికి హనుమత్సేన, కేశవసేనవంటి బృందాలుగా తయారుచేసి మంచిశిక్షణ యిచ్చి ఉత్సవాలను కన్నులపండువగా నిర్వహిస్తూండేవారు. గ్రామ తిరునాళ్లలో ప్రజలందరూ భాగస్వాములవుతూ వుండేవారు. ప్రతివైశాఖ శుద్ధ ఏకాదశి రోజున స్వామి వారికళ్యాణం భక్తులే కన్యాదాతలుగా ఆనందవైభవాలతో జరుపుతూండేవారు. జనులందరు ఆనంద పరవశు లవుతూండేవారు.

కవిగారి బ్రహ్మశ్రీ రామకరామశర్మ గారి విరచితమైన చెన్న కేశవస్వామి శతకావిష్కరణ మహోత్సవ సమావేశంలో నేను (పరిశోధకుడు) విద్యార్థిగా వున్నరోజులలో మహాద్భుతంగా జరిగినట్టుగా నాకు జ్ఞాపకం వుంది బ్రహ్మశ్రీ పార్వెళ్ల గోపాలకృష్ణావధాని గారు, బొమ్మెనపల్లి విశ్వనాథ శాస్త్రిగారు, ధర్మపురి రొట్టె చంద్రశేఖర శాస్త్రిగారు, అష్టావధాని తిగుళ్ల శ్రీహరి శర్మగారు వంటి కవి,పండిత బుధశ్రేష్టులు పాల్గొని శతకావిష్కరణ కార్యక్రమాన్ని దిగ్విజయం చేశారు. ఆ సందర్భంలో కవిగారు శ్రీ చెన్నకేశవ స్వామివారిని అనేకవిధాలుగా స్తుతించారు.

కవిగారీ శతకంలో లోకులసంక్షేమాన్ని కాంక్షిస్తూ వేడుకోవడం జనుల అభివృద్ధిని, గ్రామంలో రైతులందరికీ పాడిపంటలు వృద్ధికావాలని వివిధ పద్యాలలో

కేశవుణ్ణి వేడుకోవడం వంటి కవిగారి సుగుణ గుణసంపద అందరిమెప్పును అందుకోగలిగింది. ప్రజలకష్టనష్టాలను పారద్రోలమని కోరుకోవడం వారి పరోపకారతను తెలియజేస్తుంది. ఏది ఏమైనా గ్రామం లోని అన్నివర్గాల వారికి భక్తిభావనను అందించగలిగారీ కవిపుంగవులు. వారి దైనందిన ఆచార, సాంప్రదాయాదులు కొందరి జీవితాలపై ప్రభావం చూపిందనడంలో అతిశయోక్తి లేదు.వీరికి గోసేవావ్రతం ఆచరించడం అలవాటుగా వుండేది. ప్రతి నిత్యం గోవును పూజించడం, గోమాతాయైనమః అంటూ గోప్రదక్షిణలు చేయడం వంటివి ఇతరులు ఆదర్శంగా స్వీకరించి అందరి ఇళ్లలో గోపూజలు చేస్తూండడం పరిపాటిగా మారింది. దైవచింతన, దైవదర్శనం స్తోత్ర, పారాయణం, భజనలు, కీర్తనలు గ్రామజనులందరికీ అలవాటుగా మార్చి ఆధ్యాత్మికానందనమును వారికందించి, వారి వారి మనోచింతనలు దూరం చేసినారీ కవీశులు. భక్తి అనే సంద్రంలో అందరినీ విధిగా ముంచి తేల్చుతూవుండేవారు ఈ భక్తశిఖామణులు.

కవిగారి సుగుణం మరెందరినో సుగుణోపేతులను చేయగల్గడం ఆనందకరమైన అంశంగా భావించవచ్చు. మహిళామూర్తులకు ఎన్నోరకములైన మంగళహారతులు, భజనలు, కీర్తనలు వంటివి నేర్పించే వారు. స్వామివారి సేవాకార్యక్రమంలో భాగంగా వారిచే మూడు, ఐదు ఏడు, తొమ్మిది అంటూ భక్తిరసపూరితములైన మంగళహారతులు చదివిస్తూ వారిని ప్రోత్సహిస్తూండేవారు. వారందరికి రాగయుక్తంగా, లయాత్మకంగా భక్తిభావంతో చదివించడం నేర్పించారీ కవీశులు. తత్ఫలితంగా అందరికీ ఎన్నో మంగళహారతులు వచ్చియున్నాయి.

ఉదా:-

పల్లవి : కేశవా, మాధవా పాహిమాం
మాధవా, మధుసూధనా పాహిమాం॥ (కేశవా...)

చరణం : పురుషోత్తమామంగళ చరణా
సుదర్శనా హే పాంచజన్యా
నారాయణా హే నందకిషోరా
నమామి తే లక్ష్మీ వల్లభా॥ (కేశవా...) (12)

గ్రామంలోని ఆలయ అర్చకుడు శ్రీమాన్ నరహరి ఆచార్యుల కుమారుడైన నరసింహాచార్యుల ఉపనయనం కవిగారే స్వయంగా చేసినారు కవిగారు నూతన వటుడిని అభినందిస్తూ చెప్పిన పద్యాలు అర్చకులు శేషం నరహరి ఆచార్యులు గారు చెప్పగా వాటినిక్కడ ఉదహరిస్తున్నాను.

ఉ॥ వేదాభ్యాసము జక్కజేయు మిపుడున్ వెల్గొందు వేదంబులన్
వేదాంతాదులు నేర్వరమ్ము యిటకున్ విశ్రాంతి లేకుండగన్
విద్యాభ్యాసము జేసి జ్ఞానమదియున్ వేవేల సాధించు, నీ
విద్యాదేవత నిన్ను గాచునెపుడున్ విశ్వాన వర్థిల్లగా ॥ (13)

కం॥ ఆచార్యుని సద్బోధలు
నాచారముగాగ నెంచి యానందముతో
నాచార్యున కెదిరింపక
మాచారము వీడకయ్య మంగళమగునూ॥ (14)

శా॥ సంధ్యావందన మాచరింపు మెపుడున్ సత్శీలసంపన్న,నీ
సంధ్యావందన మాచరించి వటుడా సద్భావనల్ నేర్చి,నా
వింధ్యాద్రిన్ చరియించు తాపసువలెన్ వెల్గొందు సద్దీక్షలో
సంధ్యావందన మానబోకు సతతం సమృద్ధి సంతృప్తగున్॥ (15)

మ॥ వినుమో ఛాత్రుడ శ్రేష్ఠమౌ ప్రణవ విద్యారంభ వేళన్సదా
గొనుమీ మంత్రము దీక్షగా గొలిచి గూడార్థాది సద్భావనల్
మనగాజాలును సద్యశంబు పుడమిన్ మంత్రాక్షరాల్ దీప్తమౌ
ఘనమౌ శ్రోత్రియధర్మమున్ వెల్గ కాంతించుమో బాలకా॥ (16)

చం॥ ఫలితము వేదవిద్యలకు భావము నమృత సద్విధానమున్
గలుగును నూత్నతేజమది గ్రన్నన నందుము సద్వివేకమున్
జెలగిన జాలు నెప్పటికి చింతలు దీరును విద్యలందగా
నిలుచును ఖ్యాతి నెల్లెడల నిష్టగ యున్నను లోకమొప్పుగా॥ (17)

ఆ॥వె॥ సాధుభావమంద సద్విద్యతో నొందు
గడుప జాలు నటుల గలుగు ఖ్యాతి
వేద విద్య లెల్ల వేవేలు జదివినా
వినయధనము లేక వెలతి గలుగు ॥ (18)

తే॥గీ॥ తల్లిదండ్రులు గురువులు దైవసములు
నెంచి జూచిన నదిజాలు నింపు గలుగు
విద్యలందెడు వేళల వినయ మెపుడు
యశము జేకూర్చు నోబాల యవని నీకు॥ (19)

ఆ॥వె॥ దివ్యమైన యట్టి దేవతార్చన జేయు
నవ్య జగతి లోన నందు ఘనత
విద్యలోన నెపుడు విలువైన జ్ఞానంబు
నందు నీవు ఛాత్ర మధిక శక్తి ॥ (20)

ఆయా సందర్భాలలో పెళ్లిళ్లవంటి శుభకార్యాలలో అవసరానుగుణంగా, సందర్భానుసారంగా అభినందనలు తెలియజేసిన పద్యాలెన్నో వున్నాయి. వారి చక్కనైన అలంకారయుత పద్యాలు భావయుక్తమై పద్యాల్లోని మర్మాలు సుతిమెత్తని హితోపదేశములు జీవితానుకూలమైన అనేక సూచితాంశాలు, సందేశాలు వారివారి జీవితాల్లో ఒరవడి దిద్దిన సంఘటనలు ఎన్నో వున్నాయి. దైవపరమైన చింతనలు గలుగజేసే ప్రేరణాత్మకములైన పద్యాల నెన్నింటనో అందించినారు. అవి యిప్పటికినీ గుర్తువున్న వాళ్లు కొందరింకా వున్నారు. ”కవిత్వ, పటుత్వ, మహత్వ సంపదల్ ” అనేవి కవిగారికి దైవకటాక్షం వల్ల మాత్రమే అబ్బినవి అని స్వయంగా వారే అనేక సందర్భాలలో విబుధుల గోష్ఠులలో చెప్పేవారు.

సూక్తులు,సామెతలు, నానుడులు, పలుకుబడులు వంటివి ఎన్నో సందర్భాలలో వారి రచనలలో చోటుచేసుకుంటూ వుండేవి. నిత్యం సంభాషించే సమయాల్లో ఉపయోగిస్తూండే యీ మాటలనే కావ్యాల్లో ఉపయోగించి అందరిప్రశంసలు అందుకునేవారు సంస్కృతభాషలో అమరకోశాది నిఘంటువులు నాబోటివారికి (పరిశోధకుడు వేణుగోపాలశర్మ) కంఠస్థం చేయించే పనిలో వారెంతో వాత్సల్య, ప్రేమాభిమానాదులు చూపిస్తూండేవారు. సాంకేతికత అభివృద్ధి అంతగాలేని ఆరోజుల్లో దీపాలముందు కూర్చొని విద్యాభ్యాసం చేస్తూండేవారము ఆశ్లోకాల్లోని శ్రావ్యత, లయాత్మకత యిప్పటికీ చెవుల్లో మార్మ్రోగుతూ వుంటుంది. విష్ణుసహస్ర నామ పారాయణ వ్యాప్తి అంతగాలేని ఆరోజుల్లోనే అనేకస్తోత్రములు, కీర్తనలు, హనుమాన్ చాలీసా వంటివి చాలామందితో సామూహిక పారాయణాదులు చేయించి అందరిలో ధార్మికభావనలు నింపివుంచారు. అందరిలో భక్తి పారవశ్యతను కవిగారు పెంచగలిగారు ఆధ్యాత్మికా భావపరిమళాదులను అందరిలో పాదుకొల్ప గలిగినారు. జనులందరూ ఆనందాన్ని పంచుకుం టూండేవారు. స్వయంగా కవిగారేనిరంతర రామనామ పారాయణం చేస్తూండేవారు.

కవిగారి కవితా నేపథ్యం ఇది మనిషిలో అంతర్లీనంగా దాగియున్న ప్రతిభా వ్యుత్పత్తులు వ్యాప్తం అయినప్పుడు అతని సృజనాత్మక శక్తికి సార్ధకత చేకూరుతుంది. సమాజంలో సమతాభావనం, సౌజన్యశీలం పెంపొందించుకోడానికి అనువైన

వాతావరణం ఏర్పడుతుంది పరస్పరావగాహన కలుగు తుంది నిర్మాణాత్మక దృక్పతాలకు ప్రాచుర్యం లభిస్తుంటుంది. సమైక్యభావాలు బలపడతాయి. కవిగారు బహు కవిగారకావ్య పాఠకులు అనేక పద్యకావ్య పఠనం వల్ల వీరిలోకూడా పద్యరచనాభిమానం మొదలై వృద్ధియై కవిగారి లేఖిని ద్వారా ఎన్నోభక్తి కావ్యాలు వెలువడ్డాయి.

రామస్తుతిని, ఆంజనేయస్తుతిని, కేశవస్తుతిని అనేక జాతి, ఉపజాతి పద్యాల్లో చేయడం అందరి ఆమోదం పొందడానికి దోహదపడింది. లక్షణ సమన్వితంగా పొందుపరచబడిన శతకపద్యాల ద్వారా కవిగారి కీర్తి వేనోళ్లుగా కొనియాడబడింది. సమాజంలో పెరిగిన అసమానతలు, అవకతవకలు, అధర్మాలు, అక్రమాలు, అన్యాయాలు, నాస్తికత్వం కవిగారి హృదయాన్ని కలిచివేశాయి తదనుగుణంగానే కవికలంద్వారా తనలోకలిగిన స్పందనను కవిగారి ఇష్టదైవం ముందు కవితారూపంలో ఏకరువుపెట్టారు. రామభక్తిని చాటే పద్యాలు కోకొల్లలుగా రచించినారు యీ కవీశులు రామపాద రజపుటణువుగా యీరామక రామశర్మ సార్ధకనామ ధేయులైనారు.

ఉదయంనుండి సాయంత్రంవరకు శ్రమచేసిన శ్రమజీవులు స్వేదం తో తడిసిన శరీరంతో ప్రశాంతత నొందడానికి కవిగారు వారికి పురాణ పఠనం వినిపించి స్వాంతన చేకూరుస్తూండేవారు. దివ్యమైన పురాణ పఠనం విని వారు వారి శ్రమను మరచిఆధ్యాత్మికా నందాన్ని పొందేవారు. గ్రామస్తు లందరికి కవిగారు అపర రామదాసులా రామనామసంకీర్తన చేయించే ఒక గురువులాగా ప్రముఖ ఆధ్యాత్మికవేత్తగా కనిపిస్తూ వుండేవారు. అపర రామభక్తునిలా ప్రకాశించారు. వారకి జయోస్తు.

అన్నివర్గాలవారికి అన్నికుల వృత్తులవారికి వివిధరకాల ఉపాధి వుండేవిధంగా గ్రామంలో నిర్వహింపబడే దేవాలయ ఉ్సవాలలో వివిధ కార్యక్రమాలు రూపొందిస్తూ వుండేవారు భాగవత సప్తాహాలు, రామ యాగాలు, శతఘటాభిషేకాలు, సిందూరార్చన వంటికార్యక్రమాలలో జనులందరిని భాగస్వామ్యత కలిపించి అన్నసంతర్పణ వంటివి ఏర్పరిచి భక్తిసామ్రాజ్యాన్ని నెలకొల్పుతూ వుండేవారు. సామూహిక ఉపనయనములు, పేదవారికి సామూహిక వివాహాదులు ఏర్పరుస్తూ, అందరిభాగస్వామ్యంతో సామూహిక కుంకుమార్చనలు, సామూహిక పారాయణములు వంటివి ఏర్పరచిగ్రామంలోని పెద్దలందరి అభిమానమును చూరగొనేవారు.

కవిగారి రచనలు : శ్రీరామనవరాత్రి పూజా కల్పము – 1960, ద్వితీయముద్రణ – 1973, శ్రీ రామరాఘవ సంస్థవము,–1974, శ్రీరామ రాఘవ స్తవము – 1975, శ్రీ చెన్నకేశవ స్వామి శతకము – 1980, వివిధ మంగళహారతులు, భజనలు, కీర్తనలు, హరికథలు వంటివి రచించారు ఐదారు కృతులు ముద్రింపబడినవి పాఠకాదరణ,

పండితప్రశంసలకు నోచు కుని యున్నవి. అరవై ఏళ్లవయస్సులో వీరీ రచనలు గావించారు పోతన గారి భాగవతం దాని ప్రభావం వీరి రచనలపై ఎంతగానో పడియున్నదని వీరిపద్యాల శైలి వల్ల చెప్పవచ్చు.

లోకమంతా క్షేమంగా వుండాలని, లోకులంతా సుభిక్షంగా వుండా లని వీరితపన దానికనుగుణంగానే వీరి పద్యకృతులలో జనులందరికి ఈతి బాధలు లేకుండాచేయాలని వీరిరచనలలో ఆకావ్య నాయకులను వీరుకోరుకుంటూ వుండేవారు సకాలంలో వర్షాలు కురువాలని వర్షాధారిత వ్యవసాయం వృద్ధి కావాలని పంటలు సమృద్ధిగా పండాలనీ దేశం సస్య శ్యామలంగా, పైరుపంటలతో అలరారుతూ వుండాలనే వీరి ప్రగాఢమైన వాంఛలను వీరికృతులలో కనిపింప జేస్తూవుండేవారు.

## కవిగారి మోక్షాకాంక్ష

వలసిన యోగ్యతలు నాకున్నాయని మీకు అనిపిస్తే నాలోపపనియతి గల నిష్ఠను మీరు అనుమతిస్తే మనసా, వాచా, కర్మణా మీ నామస్మరణ చేసినమాట నిజమయేని మీరు నమ్మినట్లయితే తప్పకుండా మీరు నాకు మోక్షాన్ని ప్రసాదించి ఈశ్వరా,కేశవా, నాకు మోక్షమీయ సమర్థత మీకు మాత్రమే ఉంది. అని ఎంత నిక్కచ్చిగా చెప్పినారో చూస్తే కవిగారు నిజంగా గొప్ప భక్తులని విశ్వసించవచ్చు.

స్వామీ నాకు దర్శన  భాగ్యము కలుగజేసి నన్ను కృతార్థుడిని చేయమంటూ మిమ్మే నమ్మియున్నాను. మీకు నమస్కరిస్తున్నాను. నా భారము మీదే అంటూ నిర్మోహమాటముగా స్వామివారిపైన తమరక్షణ భారాన్ని ఉంచుతూ వేడుకోవడం కడు ప్రశంసనీయము. ఈ పద్ధతిలో కవిగారి పద్యములోని ఆత్మ నివేదన ఎలా వుందో గమనిద్దాం.

శా॥ నాకీ దేహము బోకముందు యిపుడే నాకీవు కన్పించరా
నాకీ కాలమెరుంగ రాదు యెపుడున్ న్నావెంటనే యుండరా
సాకేతాధిప జేర్చుకొమ్ము ననునీ సచ్చిత్ప్రకాశంబుతో
నీకున్ మ్రొక్కెద నిన్నె నమ్మితి సదా నీ భారమే కేశవా ॥ (21)

స్వామీ నీసేవానిమిత్తము నాకీ జన్మనిచ్చావు. ఆ జన్మలో దేవాలయం మూయకముందే నాకు కన్పించి నన్నాదుకోవయ్యా నా భారం నీదే కేశవా ! అంటూ ప్రణుతిస్తూవున్నాడు కవీశ్వరుడు. ఓ స్వామీ యెపుడు నావెంటనే వుంటూ నన్ను రక్షిస్తూ నాకు తోడునీడలా కొండంత అండగా మీరు నా వెంట వుండి నాకు మనోధైర్యం

నింపి నాకు మోక్షప్రసాదం గావించే బాధ్యత మీదేనయ్యా అంటూ ఆత్మనివేదన వెలిబుచ్చారు. సాకేతా అంటూ దేవునితో ముచ్చటించడం అభినందనీయం.

ఓ సచ్చిదానంద స్వామీ ! ఓ పరమాత్మా ! ఓ కేశవా ! నీ గుణగణాలు లెక్కించడానికి నేనెంతటి వాడిని స్వామీ ! నీవా అనంతుడివి ఆది మధ్యాంతరహితుడివి నిన్నేమని కీర్తించేది స్వామీ అంటూ నివేదించిన ఈ ఆత్మ నివేదనను వినిపించిన పద్యాన్ని వీక్షిద్దాం.

ఉ॥ అంతములేని వాడ అనంతుడవంతటనున్న వాడ శ్రీ
కాంతుడ అప్రమేయుడవు అకారణ శేషుడవా
స్వాంతము లేని వాడ అనిశంబును మమ్ములనేలువాడ వి
శ్రాంత మెరుంగవాడవు చిదాత్మవు మన్నెముపల్లి కేశవా॥ (37)

కేశవా నీవు అనంతుడవు నాంతం, నమధ్యం.... అని భగవద్గీతలో ఉచ్చరించిన విశ్వకేశవ సందర్శన శ్లోకం స్ఫురణకు వచ్చే విధంగా స్వామిని స్తుతిస్తున్న తరుణాన్ని వీక్షిస్తే అంతట ఉండే వాడవీవేనయ్య. సర్వం నీవుయై సర్వాంతర్యామియై లోకాలను లోకాలను కాపాడుతున్నావు.

దేవతలచే శ్లాఘించబడిన ఓ స్వామి, శ్రీకాంతా, అప్రమేయా, పురుషోత్తమా మా మన్నెంపల్లి కోవెలలో మీరు మాకు దివ్యసాక్షాత్కారం అందించడానికి వెలిసిన వారని విశ్వసిస్తున్నాము. మిక్కిలి భక్తి రసానందంలో మునిగిపోయాము అంటూ వేడుకుంటున్నా కవిగారి నిష్కల్మష భక్తి అనన్య సామాన్యము, అనితర సాధ్యము. కలియుగ భక్త పోతనల గ్రామస్తులందరిచేత ప్రశంసలు అందుకుంటున్న బ్రహ్మశ్రీ రామకరామశర్మ గారు సర్వదా శతధా సహస్రధా అభినందనీయులే.

కం॥ రాముని యందున భక్తిని
రామక శ్రీరామశర్మ రమణీయముగా
కోమలమౌ సద్భక్తిని
రాముని నిట వేడుకుంటు రాసిరి పద్యాల్ ॥

కం॥ కవిగారికి నమతులు యివె
రవియై సద్భక్తి యుక్త రమ్యపు పద్యాల్
కవనంబను జన్నము తో
ప్రవిమల సత్కావ్య తతిని ప్రచురణ జేసెన్ ॥

--××--

# శతకమావిర్భావము

క్రీ.శ. 12 వ శతాబ్దంనుండి తెలుగుభాషలో శతకరచన కొనసాగుతూనేవుంది. భగవదనుగ్రహ ప్రాప్తికొరకు శతకపద్యకవితా సృజనాభ్యాసము గావింపబడుతూనేవుంది. శతకమనే పేరే వందపద్యాలతో కూడి యున్న గ్రంధమని తెలియవస్తున్నది భగవత్ స్తోత్రరాజములలో శతనామాలు, సహస్రనామాలు, అష్టోత్తరములుండుట పరిపాటియైనది. కావున శతకములు కూడా అష్టోత్తరశతపద్యములు అనగా 108 పద్యములకు తక్కువ కాకుండా సిద్ధమవుతూవున్నాయి. వందకు తక్కువకూడా కొన్నింటిలో వేరేరూపాలలో ఆవిష్కృ తములైనవి వానిలో పంచరత్నములని, నవరత్నములని తారావళులని అక్షరమాలలు అనునవి ముఖ్యములైనవి.గ్రహములు తొమ్మిది, రాసులు పన్నెండు, నక్షత్రాలు ఇరువదియేడు, ఈ సంఖ్యలసంబంధమును బట్టికూడా శతకములు 108 పద్యములతోపూర్తి కావచ్చినవి తెలుగులోనే కాక గీర్వాణ, ప్రాకృతాదులలో త్రిశతులు పంచశతులు, సహస్రములు వంటి రచనలుకూడా వున్నట్లు సాహితీ చరిత్రలో మనకు తెలియవస్తున్నది. శతకస్తుతి అనునది మనకు మహాభారత కాలంనుండే వున్నట్లుగా కొన్ని ఆధారాలు కనిపిస్తూవున్నాయి.

సాధారణముగా భక్తిశతకములు భగవంతుని స్తుతి, గానాల ప్రాధాన్యాన్ని సంతరించుకొని ఉంటాయి. ఇటువంటి స్తోత్రాదులు ఋగ్వేదకాలంనుండే కనిపి స్తూవున్నాయి ఇంద్ర, అగ్ని, రవి, వరుణ, ఉషస్సూక్తములు స్తోత్ర సముచ్ఛయములని చెప్పవచ్చు. సంస్కృతభాషలో మయూరుని సూర్యశతకము, భర్తృహరి సుభాషిత త్రిషతి, శ్రీ ఆదిశంకరాచార్యుల వారి శివానందలహరి వంటివి గీర్వాణ సాహిత్యం లో శతకములవలె భాసిస్తూ వున్నాయి. ప్రాకృతభాషలో హాలుని గాథాసప్తశతి, ఏడుశతకముల సమాహారమని చెప్పవచ్చు.

సంస్కృతంలో శతకములు మకుట నియమంతో ఏర్పడియుండలేదు కాని తెలుగుశతకములలో మకుటనియమం తప్పనిసరి యైనది సాధారణంగా తెలుగులో శకములన్నీ ఒకే ఛందంలో రాయబడడం ఒక లక్షణం గీర్వాణమందు ఇట్టి నియమం ఏర్పడి యుండలేదు శతకంలో పద్యములు స్వతంత్రభావములతో వుండి యుంటాయి వాటిలో కథానుగుణ్యత వుండదు. ఒకరకంగా వాటిని ముక్తకములని అంటారు. శతకములన్ని రచయిత ఆత్మభావనలు ప్రకటించేవిగా వుంటాయి. దాదాపుగా పద్యములన్నీ ఆత్మాశ్రయ కవితా జాతికి చెందియుంటాయి.

శతకములు ఎంచుకున్న కవితావస్తువుకు అనుగుణంగా స్వతంత్రభావనలతో నిండియుంటాయి. దేవతారూపములైన వాటిలో ఎక్కువగా దేవతా గుణ,గణ వర్ణనలు,

వారిమహిమా వర్ణనలు, వుంటాయి. దేవతా మాహాత్మ్యములు సాధుపాఠక హృదయాలలో శతక పద్యం చేరి నంత వేగంగా మరోకావ్యం వెళ్లలేదేమో అనడం అతిశయోక్తి కాదు ప్రబంధయుగంలో భక్తి పరాకాష్టకు నిదర్శనమైన ధూర్జటిగారి శ్రీకాళహస్తి మాహాత్మ్య శతకములు తదనంతరకాలంలో పాల్కురికి, బసవేశ్వరుడు మొదలుగాగల శతకరాజములు అనువదింపబడిన భర్తృహరి సుభాషిత త్రిషతి, భాస్కరా, నృసింహ, శ్రీకాకుళాంధ్రదేవ, దాశరథీ, సుమతి, వేమన, వంటి నీతిశతకాలు కుమార, కుమారీ వంటి అత్యాధునిక శతకాలు సాధించిన విజయాలు సామాజికచైతన్యా నికి ఎంతగానో దోహదం చేసాయని చెప్పవచ్చు. పాఠక హృదయాలలో ఇప్పుడూ,ఎప్పుడూ నిలిచివుండే పద్యాలు నేటికిని అక్షరాస్యులకూ, నిరక్షరాస్యులకూ కూడా ఆనందాన్ని, భక్తిని, నీతినీ, రీతిని యీ శతకాలు పంచిపెట్టినవని భావించ వచ్చు సమాజంలో శతకపద్యానికి అంతపట్టు వున్నది.

తెలుగు సాహిత్యంలో పూర్వకవులు మహాకావ్య రచనలకు ముందు భగవంతుని అనుగ్రహం కొరకు ఐతేనేమి, కవితా సృనాభ్యాసమున కొరకైతేనేమి తొలుత శతకములనే చరనలుగా సృజించ బూనుకునేవారు, శతకపద్యములలో స్వతంత్ర భావముకలిగి ముక్తక లక్షణములతో నొప్పియున్నందున ఆర్తి, ఆవేదన, ఆవేశ పూరితములైన, ఆత్మ నివేదనాత్మకములైన శతకములు ప్రారంభ రచనలుగా పూనుకునేవారు. ఈ రూపంలో శతకరచనలు మొదలైనవని చెప్పవచ్చు.

శతక అక్షణములతో కొన్నింటిని నన్నయ భట్టారకులు తమ మహాభారత ఆదిపర్వంలోని ప్రథమాశ్వాసంలో "ఉదంకోపాఖ్యానంలో" 103, 104, 107, 108, పద్యాలలో మకుటనియమాన్విత చంపకోత్సల మాలలలో శతకపద్య సోయగాన్ని భాసింపజేశారు.

చం॥ బహువన పాదపాబ్ధికుల పర్వతపూర్ణ సరస్సరస్వతీ
సహిత మహా మహీభర మజస్సహస్ర ఫణాళిదాల్చి, దు
స్సహతర మూర్తికిన్ జలధి సాయికి బాయక శయ్యయైన, య
య్యహిపతి దుష్కృతాంతకుడనంతుడు మాకు ప్రసన్నుడయ్యెడున్॥ (22)

చం॥ అరిది తపోవిభూతి నమరారుల బాధలు నొందకుండగా
నురగుల నెల్లగాచిన మహోరగ నాయకుడా నమత్సురా
సురమకుటాగ్ర రత్న రుచి శోభిత పాదున కద్రినందనే
శ్వరునకు భూషణం బయిన వాసుకి మాకు ప్రసన్నుడయ్యెడున్॥ (23)

ఉ॥ దేవ మనుష్య లోకములు దిమ్మరుచున్ విపులప్రతాప, సం
భావిత శక్తి శౌర్యులు నపార విషోత్కట కోప నిస్ఫుర
త్పావక తాపతాఖిల విపక్షులునైన మహానుభావు లై
రావత కోటి ఘోర ఫణిరాజులు మాకు ప్రసన్నులైయ్యెడున్॥ (24)

ఉ॥ గోత్ర మహా మహీధర నికుంజములన్ విపినంబులంగురు
క్షేత్రమునన్ బ్రకామగతి ఖేలననొప్పి సహాశ్వసేనుడై
ధాత్రి పరిభ్రమించు బలదర్ప పరాక్రమ దక్షు దీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుడు శూరుడు మాకు ప్రసన్నుడయ్యెడున్॥(25)

పై పద్యాలలో నన్నయగారు శతకపద్య భావన కలిగింప జేశారు.తదనంతర కాలంలో 13 వ శతాబ్దంలో విశ్వేశ్వర పండితులు శృంగార రసపూరితములైన రామావళి శతకమును వ్రాసినారు అటుపిదప యధావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకము అనంతరము 19 వ శతాబ్దంలో ఆదిభట్ల నారాయణదాసు హరికథా పితామహులు సంస్కృతంలో ”కాళీ” శతకం వ్రాశారు. సంస్కృతంలో శతకములు, స్తోత్రగ్రంధములు, చోరపంచాశిక, భామినీ విలాసం వంటివి ముక్తకములుగాను పేరొందియున్నాయి. మయూరశతకంలో శతకనామం ప్రస్ఫుటించే విధంగా 100 శ్లోకాలుండడం పరిపాటియైంది. కాని బాణమహాకవి చండీశతకంలో 48 శ్లోకము లున్నవి మరియు భర్తృహరి గారి శతకత్రయంలో 109 వంతున శ్లోకసంఖ్యలు ఉన్నవి. సంస్కృత సాహిత్యంలో వందలు వేలుగా ముక్తక శ్లోకములున్న స్తోత్ర జాలముల సంఖ్య ఎంతగానో వుండియున్నదనుటలో సందేహం లేదు.

తెలుగులో సాహిత్య రచన ప్రారంభదశనుండే శతకరచనలు కనిపిస్తూ వుంటాయి. పాల్కురికి వృషాధిపశతకం, యధావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకం, పండితారాధ్యుల శివతత్వసారము ఇవన్నియు ప్రారంభస్థాయినుండి శత కాలుగానే పేరొందియున్నవి. తెలుగులో శతకవాఙ్మయంలో ఆదికవి పాల్కురికి సోమన అని చరిత్రకారులు నిర్వచించినారు.

తెలుగు శతకాల్లో పద్యసంఖ్య, మకుటనియమం, ఏకవృత్తం వంటి లక్షణాలు ఎక్కువగా పాటింపబడినవి. శతకం ఆత్మాశ్రయ భావానికి సంబంధించినది. పాఠకులకు సులభంగా శతకములు అందులోని పద్యాలు అవగతమవుతూ వుంటాయి. ఏ పద్యానికి ఆ పద్యం స్వతంత్ర భావప్రకటనా శక్తిని కలిగియుంటాయి అందువల్ల పాఠకులకు ఆ పద్యాలోని భావాలు అర్థమై ఆనందానుభూతులకు లోనవుతూవుంటారు. రసప్రాధాన్యంలో, భావస్ఫూర్తిలో శతకములు సిద్ధపరుచ బడియుంటాయి.

మహాకావ్యంలో కవి కథాపోషణ,పాత్ర ఔచిత్యం, మంగళాదీని, మంగమధ్యాని, మంగళాంతాని, అనే లాక్షణిక సిద్ధాంతాలను శతకకారులు విధిగా పాటించడం చేస్తున్నారు.

శతమంటే నూరు దీనికి 'క' ప్రత్యయం చేర్చడంచేత "శతక" మనేపదం ఆవిర్భవింపబడింది. శతకమంటే కచ్చితంగా వంద అని అర్థం కాదు వందా ఎనిమిదికి పైబడి అనిఅర్థం. వైదిక వాఙ్మయంలో శత శబ్దం అనేక స్తోత్రాలలో ఋక్కులలో చెప్పబడింది. "శతమానం భవతి" మొదలగు వైదికమంత్రాలలో శతఘ్ని, శతగ్రంధి, శతభిష, శతరథి, శతకోటి అలాగే పశ్యేమ శరదశ్శతం, జీవేమ శరదశ్శతం, నందామ శరదశ్శతం, మోదామ శరదశ్శతం, భవామ శరద శ్శతం వంటి మంత్రభాగాలు ఋషిప్రోక్తంగా ఈ రూపంలో మనవాఙ్మయంలో ఉపదేశించబడియున్నవి.

శతకసాహిత్య క్రమము

(27)సంస్కృతంలో శతకాలను ముక్తకములు అని అంటారు. ప్రాకృతంలోని గాధాసప్త శతిలో 700 కథలు పద్య రూపంలో లిఖించబడియున్నవి. క్రీ.శ. 1116లో గోవర్ధనాచార్యులు సంస్కృతంలో ఆర్యా సప్త శతి, ఆర్యా ఛందస్సులోనే 700 శ్లోకాలు రచించినారు. ఇవి శృంగారానికి సంబంధించినవి. క్రీ.శ. 1650లో వెంకటాధ్వరి గారు వ్రాసిన లక్ష్మీ సహస్రం అనే ముక్తక కావ్యంలో 1000 శ్లోకాలు వ్రాసినారు. లక్ష్మి విష్ణ స్తోత్రాలు భక్తి భావ పూర్వకంగా చేర్చినారు. ఇలా సంస్కృత సాహిత్యంలో వేల కొలది శ్లోకాలున్న కృతులున్నవి. ఇవి అన్నియు ముక్తకాలేయై శోభిల్లినవి. ఇవే కాకుండా సంస్కృత సాహిత్యంలో శతకం పేరుతో కొన్ని ముక్తక కావ్యాలు ఆవిర్భవించబడినవి. అందులో క్రీ.శ. 606-648లో బాణుడు రాసిన చండీ, మయూరుని సూర్య శతకం పేర్కొనదగినవి.

అనంతరం భర్తృహరి గారి ముక్తక కృతులకు "సుభాషిత త్రిశతి" అని పేరు ఇవ్వడం జరిగినది. అవి నీతి, శృంగార, వైరాగ్య శతకములు అని వ్యవహరించబడినవి. నీతి బోదకాలు 100 శ్లోకాలు అలాగే, శృంగార, వైరాగ్యాలు తెలియజెప్పె ఒక్కొక్క శతకంలో 100 శ్లోకాలు రాసినారు. మరియు అమరుడు రచించిన ముక్తక కావ్యము అమరుక శతకము పేరిట వెల్లడి అయినది. ఇది పూర్తిగా శృంగార భరితమైనదిగా చెప్పబడినది. ఇందులో 115 శ్లోకాలు రచించబడి యున్నవి. భల్లాట కవిగారి శతకంలో క్రీ.శ. 9వ శతాబ్దంలో లిఖించబడినది. ఇందులో శృంగార యుక్తంగా అనేక శ్లోకాలు వ్రాయబడినవి. ఇదే శతాబ్దంలో ఆనంద వర్దనుడు దేవి శతకంలో దేవీస్తుతి రూపంగా 100 శ్లోకాలు రచించినారు.

క్రీ.శ. 16వ శతాబ్దంలో అప్పయ్య దీక్షితుల వారి వైరాగ్య శతకంలో 100 శ్లోకాలు ఉన్నవి. క్రీ.శ. 17వ శతాబ్దంలో జగన్నాథ పండిత రాయలు భామినీ విలాస శతకంగా ముక్తక శతకం రూపంలో ప్రసిద్ధి చెందింది. ఇది నాలుగు విభాగాలుగా విభజింపబడి ఉన్నది. మొదటి విభాగంలో 129 శ్లోకాలు రెండవ విభాగంలో 184 శ్లోకాలు, మూడవ విభాగంలో 29 శ్లోకాలు, నాల్గవ విభాగంలో 46 శ్లోకాలు ఉన్నవి. ఒకే వృత్తంలో కాకుండా వివిధ వృత్తాలలో పయోగించబడినవి. భామిని విలాస శతకంలో క్రమంగా నీతి, శృంగార, వైరాగ్యాలు వర్ణించబడి భర్తృహరి శతకాల వలె భాసింపబడినవి.

## 2. భక్తి శతకములు :

తెలుగుభాషలో భగవంతుని స్తుతి పూర్వకంగా కొలుస్తూ వర్ణనాత్మకంగా వెలార్చిన శతకములు ఎన్నియో భక్తిశతకములుగా ఆధ్యాత్మిక సంపదగా పేరొందినవి. పాల్కురికి వారి వవృషాధిప శతకము భక్తి శతకాలలో మకుటాయమానంగా పేర్కొనదగింది. 1242 వ సంవత్సరంలో యధావాక్కుల అన్నమయ్య సిద్ధేశ్వర శతకం దేవకీ నందన శతకం, 16 వ శతాబ్దంలో వెల్లంకి తాతంబట్టుగారి నారాయణ శతకం, అయ్యలరాజు రామభద్రుని తాతగారి ఒంటిమిట్ట శతకం, ధూర్జటిగారి శ్రీకాళహస్తీశ్వర శతకం మృదుమధుర శబ్ద ప్రయోగాలకాలవాలమై తెలుగు శతక వాఙ్మయానికి అలంకార ప్రాయంగా నిలిచియున్నవి. అనంతరం 17 వ శతాబ్దంలో అబుల్‌హసన్ తానీషా గారి ఆస్థానకవి అయిన కంచర్ల గోపన్న ( రామదాసు ) గారి దాశరథీ శతకం మిక్కిలి ఉత్తమమైన భక్తిశతకరాజంగా పాఠకలోకంలో చిరస్థాయిగా నిలిచిపోయి శతకసాహిత్యమును శిఖరోపమాన స్థాయికి చేర్చినవి. ఇందలి అర్థశబ్దాలంకారాల చమత్కృతి భక్తిభావము, వైరాగ్యసంపద, ధారాశుద్ధి, అనన్యసామాన్య కృషితో భక్తిరాజముగా కీర్తినొందినది. నృసింహకవిగారి కృష్ణశతకము, కందపద్య రసగుళికలు పాఠశాల విద్యార్థులకు నిత్యపఠనీయ గ్రంధముగా అలరారి యున్నది.రావూరి సంజీవకవి వీరగోపాలముకుంద శతకము మరియు శేషప్ప కవిగారి నరసింహ శతకములు ధర్మపురి శతకములుగా మిక్కిలి ప్రసిద్ధి చెంది ' భూషణవికాస శ్రీధర్మపురనివాస దుష్టసంహార నరసింహ దురితదూర ' అన్న ద్విపాదమకుటంతో సమాజంలోని ప్రతి ఒక్కరి దైనందిన జీవితంలో అనేకానేక సంఘటనలకు ఉదాహరణాలుగా చెప్పబడి ప్రజల నాలుకలపై స్థిరమై నిలిచినవి.

అనంతరము లక్ష్మీశతకము కందపద్యసంపుటి ఇది లక్ష్మీపరంగా దేవతాపరంగా తొలిశతకంగా కీర్తినందినది. కృతికర్త పరవస్తు మునినాథకవి శబ్దాలంకారజనితమై

ద్రాక్షాపాకయుక్తమై నిర్దుష్టముగా పాఠకలోకంలో ఎంతగానో గుర్తింపు నొందినది. ఇంకనూ తిరువాయిపాటి వెంకటకవి యాదగిరీశునిపై 'యాదగిరీంద్ర మ్రొక్కెదన్ " అనేమకుటంతో యాదగిరీంద్ర శతకం దిట్టకవి నారాయణ కవి రామచంద్ర శతకం మహిశాసుర మర్దిని శతకం తిరుపతి వేంకటేశ్వరుల కామేశ్వరీ శతకం, కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి విశ్వేశ్వర శతకం, వడ్డాది సుబ్బారాయకవి గారి భక్త చింతామణి శతకం, మాతృశతకం వంటివి ప్రసిద్ధములైన భక్తి శతకములుగా శతక వాఙ్మయానికి పుష్టిని చేకూర్చినాయి.

## 3. వ్యాజస్తుతి శతకము :

"వ్యాజస్తుతి ర్ముఖేనిందా స్తుతిర్వారూఢిరవ్యదా" అని వ్యాజస్తుత్యలంకారమును కావ్య ప్రకాశమున ముమ్మటుడు నిర్వచించాడు. ఇందులో స్తుతిలో నింద కాని నిందలో స్తుతిగాని అంతర్గతమై యుంటుంది. వ్యాజస్తుతి తొలిశతకము 18 శతాబ్దంలో గోగులపాటి కూర్మకవి రచించిన సింహాద్రి నారసింహా శతకము సింహాద్రి క్షేత్రములో గల స్వామిపై "వైరివరరంహ సింహాద్రి నారిసింహా" అనే మకుటంలో సీసపద్యాలలో వ్రాసినారు. భల్లాపేరయ్య గారు భద్రగిరి శతకమును 1790లో కాసుల పురుషోత్తమ కవిగారు ద్విపాదమకుటంతో "చిత్ర చిత్ర ప్రభావ దాక్షిణ్యభావ హత విమత జీవ శ్రీకాకుళాంధ్రదేవ!" అనే మకుటంతో శ్రీకాకుళాంధ్రదేవ శతకం వ్రాసినాడు.

ఇంకను మానసబోధ శతకము, హంసలదీవి వేణుగోపాల శతకము, మనసా హరి పాదములాశ్రయించవే! అనే మకుటంతో వ్రాసినాడు. వేంకటాచల విహారశతకము మిట్టపల్లి నృసింహా శతకము వంటివి వ్యాజస్తుతి శతకాలుగా పేరుగాంచినవి.

## 4. తత్త్వ శతకము :

ఉపనిషదాదులయందు నిర్మింపబడిన తత్త్వ విషయములు పండితజనైక వేద్యములై సామాన్యులకు సైతము గూడార్థములు అర్థమయ్యే రీతిలో తేటతెలుగు మాటలలో శతకరూపంలో వెలువడినాయి. అతి క్లిష్టమైన విషయములను అరటిపండు ఒలచిపెట్టినట్లు పద్యాల్లో వివరించినారు. ఉదా॥ శ్రీకాళహస్తీశ్వరా, దాశరథీ, ధర్మపురి నరసింశతకము లిందకు తార్కాణములు. ఇందులో ---

జగన్మిథ్యాతత్త్వమును ఆత్మనిత్యమును వివరించుచు భక్తిపూరితములుగా ఇంకను అనేక శతకములు వెలయించినారు.

ఇందులో తోట వెంకటనర్సింహ కవిగారి రామరాఘవ శతకము, నారాయణ శతకమును గేయరూపకంగా ఆలపించే విధంగా నిర్మించడడి యున్నవి. పరమానందయ్య

యతీంద్రుడు శివముకుంద శతకము, సంపంగిమన్నారు శతకము, దత్తాత్రేయ శతకమును తాత్విక భావంతో రచించడినవి. ఇందులో హరిహరాద్వైతము నిరూపింపబడినది. సగుణ, నిర్గుణ, స్వరూప, మాయ, ప్రకృతి మున్నగు విషయాలు సమయానుకూలముగా, సందర్భాను సారముగా నిరూపింపబడినవి. యోగాభ్యాసము మోక్షసాధనకు ముఖ్య సాధనమని నిరూపించినారు. తాడేపల్లి వారు 18వ శతాబ్దములో మానసబోధ శతకము, చిత్తబోధ శతకము రచించినారు. ఇవి రెండు భక్తి, వైరాగ్య, భావ బంధురములై యున్నవి.

"మనసా ! హరి పాదము లాశ్రయించవే !" అన్న మకుటంతో రచించబడిన మానస బోధ శతకము సమాజ చైతన్యమునకు ఎంతగానో దోహదపడింది. వేమన గారి శతకపద్యము లన్ని ఆత్మబోధాత్మకములై నిరూపించబడినవి. వీరి పద్యాలలో సమాజ చైతన్యము, అవినీతి ప్రక్షాళన, తత్త్వబోధ, తత్త్వచింతన వంటివి చోటు చేసుకున్నాయి. ఆంగ్లేయులు సైతము మోజుపడి ఆంగ్లములో తర్జుమా చేయించుకొని మహదానందమును పొందిన ఘట్టాలు కోకొల్లలు సర్ సి..పి. బ్రౌణ్ వంటి పండిత ప్రకాండులు వేమన శతకాన్ని వేనోళ్ళ కొనియాడినారు.

"ప్రాఙ్నన్నయ యుగంలో శతకలక్షణాలు కలిగిన సాహిత్యము"

నన్నయ్యకు పూర్వము శతక లక్షణాలు కలిగిన కొన్ని కావ్యాలు సంస్కృతంలో ఆవిష్కరించ బడినాయి. మయూరశతకము, సుభాషిత త్రిశతి వంటివే కాకుండా వైధిక వాఙ్మయంలోని సూక్తులు స్తోత్రాలు ఎన్నియో ఆవిర్భవించబడినవి. 11వ శతాబ్ధంలో నన్నయ్యగారి మహాభారతంలో ఆది పర్వంలోని నాగస్తుతిలో మకుటనియమంతో శతకలక్షణాలతో కొన్ని పద్యాలు రచించబడినవి. అనంతరము 12వ శతాబ్దము నుండి సర్వలక్షణ సమన్వితమైన శతకములు ఆవిర్భవింపబడినవి. గాథాసప్తశతి వంటి కావ్యాలు త్రిశతులు సప్తశతులు, పంచశతులు ఎన్నియో రూపుదిద్దుకోబడి శతకవాఙ్మయానికి నూతనోత్తేజాన్ని ఆపాదించినవి.

శతక ప్రయోజనాలు వేరువేరుగా అన్ని వర్గాల వారికి చేకూర్చుతుంటాయి. ముఖ్యంగా ఆధ్యాత్మికానందాన్ని హృదయకుహరాల్లోకి చేరవేసే ప్రయత్నంలో భాగంగా శతకం సఫలీకృతమైంది. నేటికి ప్రజల నాలుకలపై శతక పద్యము చరిస్తూ చిరకాల యశస్సును ఆపాదించుకొన్నది. భర్తృహరి, సుమతీ, భాస్కరా!, వేమన ధర్మపురినారసింహ, శ్రీకాళహస్తీశ్వరా !, దాశరథీ శతకం ఇత్యాదులు ఆ కోవలోకి చెందినవే మానవజీవితంలో నిత్యోదాహరణాలైనవి ఎన్నో అంశాలు యీశతకాలలో నిక్షిప్తమైయున్నవి.

# కరీంనగర్ జిల్లా (సబ్బినాడు) శతకాలు

కరీంనగర్ జిల్లా సబ్బినాడులో తొలి తెలుగు పద్యకవిత వేములవాడ జినవల్లభుని కంద పద్యాలతో ప్రారంభమైంది. క్రీ.శ. 946లో అనంతరము 18వ శతాబ్దికి పూర్వము శేషప్పకవిగారి శతకములు, నారసింహ, నృహరి, నృకేసరి అలాగే కాకుత్సం నరసింహం గారి శ్రీ కృష్ణశతకము 1820లో వెలువడింది. 1896లో పరవస్తు మునినాథకవి కేశవ పట్టణం నుండి లక్ష్మీ శతకము తొలి దేవతా శతకంగ వెలయించినారు. పరవస్తు శతకము కూడ రూపుదిద్దుకుంది. మంథనిలో వెంకటరాజన్న అవధానిగారి లక్ష్మీశతకం, 1993లో జైశెట్టి రాజయ్య జగిత్యాల వారి శ్రీ వేములవాడ రాజరాజేశ్వర శతకం, అంబాల గ్రామస్తులు శ్రీ ముడుంబై రామానుజాచార్యులు గారి శ్రీ వేంకటేశ్వర శతకము, ఐల్నేని గోపాలరావు సిరిసిల్ల గారి మిట్టపెల్లి శ్రీరామ శతకము రఘురామ శతకము, పదిర లక్ష్మణశాస్త్రిగారి శ్రీరామ శతకము, చక్రపురి అచ్చుతరాజు సిరిసిల్ల గారి సిరిశాల శతకము, బండలింగాపురం గోల్కొండ కవుల సంచిక ద్వారా బంధ గర్భ పద్యశతకాలు అనంతశతకము, మఖ్తానారాయణపురం గారి చిలకమర్రి వేంకట నృసింహాచార్యులు అచ్చతెలుగులో వేణుగోపాల శతకమును రచించినారు. బుట్టారెడ్డిగూడెం రాధాకిషన్‌రావు గారు రంగనాయక శతకము, రాఘవపట్టణం రామసింహకవి గారు విశ్వకర్మ శతకము, చెల్పూరు గ్రామవాసి పరమారాధ్యుల రాజయ్య గారి చంద్రశేఖర శతకము 1926లో శ్రీమహాంకాళి శతకములు వెలుగులోనికి వచ్చినవి.

డసమాజమును ఎత్తి చూపిన చైతన్య శక్తి పపుజముల. ఈ శతకసాహిత్యం అనడంలో అతియోక్తి ఎంతమాత్రం లేదు. నాటి సాంఘిక దురాచారాలు, అసమత్యులత, అసమానతల పోకడలు అన్నింటిని మాన్పించి లోకానికి రీతిని, నీతిని అందించిన శతకములు లెక్కకు మించి యున్నాయి. ఒక భాస్కర శతకము, నారసంహ శతకము, శ్రీకాకుళాంధ్ర శతకము, శ్రీకాళహస్తీశ్వర శతకము వంటివి ఎన్నియో సమాజానికి చైతన్యాన్ని అందించిన శతకరాజములుగా శతక సాహిత్యంలో పెనవేసుకొని యున్నవి.

జీవితానుభవానికి సరిపోయే అనేకానేక సంఘటనలు ఉదహరించిన శతకములు కోకొల్లలు లక్షాధికారైన లవణ మన్నమే గాని... అనే పద్యాలు జీవిత అనుభవ ఉదహరణలుగా తీసికొనని వారుండరు. ఎందరి జీవితాలలో ఎన్నోమార్పులు కలుగజేసి సమాజగమనాన్ని మార్చివేసిన శతకములు కొని సముతీ, వేమన, భాస్కర వంటి శతక పద్యాలు పామరులకు సైతము కంఠతా అయివున్నవి. అనేక సందర్భాల్లో కనకపు సింహాసనము, చెప్పులోరాయి.... వంటివి మానవ జీవితంలో మమేకము కాబడి ప్రజలనాలుకలపై చిరస్థాయిగా నిల్చిన సాహిత్య ప్రక్రియ ఏదైనా ఉంది అంటే

శతకపద్యమే అయివుంటుంది. భక్తి శతకాలలో ఆధ్యాత్మికానందాన్ని, పారమార్థికానందాన్ని, భక్తిని, ముక్తిని పెంచిపోషించి, సామాన్యజనం నుండి పండిత పామరులను కదిలించివేసింది. ఈ ప్రాచీన శతక మూలాలే. “దాచిన చుట్టమా శబరి”... వంటి రాముని పద్యాలు భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ వంటి శతకపద్యములు ప్రతినిత్యం భక్తులు జిహ్వాగ్రాలపై తాండవం చేయని రోజు ఏదీ ఉండేది కాదన్నది అక్షరసత్యము.

1. కం. జగతికి నూతన తేజము
ప్రగతిని అందించి కొంత పాత్రంబగు నీ
బిగువౌ శతకములన్నియు
తగురీతిని శక్తి నింపి దరులై నిల్చెన్.॥ (26)

2. కం. కరినగరున, ధర్మపురీ
సిరులోసగెడు నారసింహు శ్రీపతిపై నో
మురిపెము దీరగ శతకము
నరసింహుని పేరవెలసి నాట్యము జేసెన్.॥ (27)

3. కం. వేములవాడను వెలసిన
కామిత వరదాయకుండు గంగాధరుడున్
లేములు బాపెడు శాశ్వత
నోములపంటయ్యి తాను నొప్పుగ వెలసెన్.॥ (28)

4. కం. శతకము పేర్మిని గూర్చును
శతకము తగు రీతి నీతి శక్తిని నింపున్
శతకము హితమును గూర్చును
శతకంబే జగతి నడిపి చైత్యము నింపున్.॥ (29)

## తెలుగులో శాసన సాహిత్యం :

వేములవాడ చాళుక్యులు ఆంధ్ర శాతవాహన చక్రవర్తులు, కళ్యాణి చాళుక్యులు, కాకతీయ ప్రభువులు, ఇంకా వారి సామంతులు, మంత్రి దండనాయకులు, వారి వారి శాసనాలు, వినయాదిత్యుడి యుద్ధమల్లుని శాసనం క్రీ.శ. 750-775 రెండవ అరి కేసరి కాలంలో లేంబాళ శాసనాల్లో కొన్ని కంద పద్యాలు తెలుగులోకి వచ్చాయి. తొలి తెలుగు కంద పద్యం ఈ జిన వల్లభుని శాసనం గాని చరిత్రకారులు గుర్తించినారు.

(34)కందం పుట్టుక కరీంనగర్ జిల్లాలోని అదీ నన్నయ్య గారి మహాభారత రచన వందేళ్ళ ముందుగానే అనేది నిర్వివాదాంశం. నన్నయ గారి భారత ఆంధ్రీకరణ 1051 తరువాత కన్నడ భారతంలో 1041లో 980లో తొలి కందం వెలువడింది. దీనిని బట్టి ఆది కవి తెలంగాణ కవి అనియే భావించాలి. క్రీ.శ. 5,6 శతాబ్దాలలోనే తెలుగు ప్రారంభమైందనడానికి నిదర్శనం. 8 వ శతాబ్దిలోని జినవల్లభుని కురిక్యాల శాసనం కన్నడ ఆదికవి పంపమహాకవి ఆయన సోదరుడే జినవల్లభుడు వారి పద్యాలే ఈ కురిక్యాల కరీంనగర శాసనం 8 వ శతాబ్దం

కం. జిన భవనండు లెత్తించుట
జిన పూజలేయిచుంటి జినమునులకు న
తినయన్న దానంబీవుట
జిన వల్లభు బోలగలదె జిన ధర్మంబుల్ ॥ (30)

కం. దినకరుసురి వెల్గుదమని
జిన వల్లభు నొట్టనెత్తు జిలకవి ననుం
మనుజులుగల్గకె ధాత్రిం
వినితించుదు ననియ వృత్త విభుదకవీంద్రుల్ ॥ (30)

కం. ఒక్కొక్క గుణంబుగలదు
రొక్కండిగ కొక్కులక్కి లేదెవ్వరికిన్
లెక్కింపనొక్క లక్కకు
మిక్కిలి గుణ పక్షపాతి గుణమణి గణముల్ ॥ (31)

ఇవి సర్వ లక్షణ సమన్వితమైన కంద పద్యములు. ఈ శిలాశాసన పద్యాల ద్వారా తొలి తెలుగు పద్యాలుగా వీటిని గుర్తించినారు. అనంతరము దాదాపు 6 శతాబ్దం నుండి తెలుగు భాష ప్రచారంలో ఉన్నట్లు చరిత్ర కారులు గుర్తించినారు. అందువల్ల తొలి తెలుగు కవి నన్నయ్య గారు అని ఆంధ్రులు తీర్మానించడం సమంజసంగా లేదని తెలుగు సాహిత్యా కారులు అభిమానులు భావిస్తున్నారు. ఏది ఏమైనా చరిత్ర, భాష, సంస్కృతి, సాంప్రదాయాల్లో వంచనలు పొందిన మన తెలంగాణ వాళ్ళు ఈ విషయంలో కూడా నయవంచనకు గురి అయినారన్నది వాస్తవిక సత్యం.

-----0-----

# రెండవ అధ్యాయం - రచనల పరిచయం

1.శ్రీరామ నవరాత్రి పూజా విధానము (1960)1973 సం॥ 2. శ్రీరామ రాఘవ సంస్తవము 1974 సం॥ 3. రామరాఘవ స్తవము 1975 సం॥ 4. శ్రీమదాంజనేయ స్తుతి 1979 సం॥ 5. శ్రీ చెన్నకేశవ స్వామి శతకము 1980 సం॥ 6. వివిధ మంగళహారతులు 1980 సం॥ 7. భజనలు కీర్తనలు 1980 సం॥ 8. హరి కథలు 1980 సం॥

## శ్రీరామరాఘవ సంస్తవము

శ్రీమాన్ బ్రహ్మశ్రీ రామక రామశర్మ గారు 1974 సంవత్సరంలో ఈ శతకరచనకు పూనుకున్నారు. వీరారాధించే ఆ శ్రీరామచంద్ర మూర్తిగారికి వీరి ఆవేదనను పద్యరూపంలో తెలియజేశారు. వీరిని యీవిధంగా పరిచయం చేసుకుంటూ (1)"పుణ్యశ్రీ గోదావరీ తీర శ్రీధర్మపురీ నివాసులగు శ్రీ లక్ష్మీనృసింహస్వామి భక్తులగు బ్రహ్మశ్రీ రొట్టె వాసుదేవమూర్తి గారి పరంపరా అస్మద్గురుదేవులగు శ్రీ రొట్టె చంద్రశేఖర శాస్త్రిగారి శిష్యసముదాయములో నొక రామదాస పాద రజపుటణువు " అని వారిగురించి పరిచయం చేసుకున్నారు. శ్రీరామచంద్ర మూర్తి గారికి లోకకళ్యాణాన్ని కాంక్షిస్తూ ఓ స్వామీ మీయీ భక్తుల వేదనలు విని లోకులందరికీ ఆనందం జేకూర్చండి స్వామీ అంటూ ప్రార్థిస్తూ, ప్రాధేయపడుతూ ఈ కావ్యశతకాన్ని భక్తిప్రపత్తులచే ఆమూలాగ్రం నింపి సృజించారు. చక్కటి వృత్తపద్యాలలో రామభక్తి పానకం ప్రవహించింది అద్భుతమైన ఎత్తుగడలతో ఆరంభింపబడిన పద్యాలతో అలంకార సొబగులతో నీతినీ, రీతినీ, భక్తి సాంప్రదాయాదులను సమాజానికీ పద్యాలద్వారా అందించారు. ఆనందనామ సంవత్సరం శ్రావణ శుద్ధ సోమవారం 1974 లో ప్రచురించినారు. భక్తులచేత వారిసహాయం స్వీకరించి ముద్రింపజేశారు. ఈ శతకముద్రణా భారం నిర్వహించిన గుప్తదాతలకు ఆయురారోగ్య భోగభాగ్యాలు చేకూరగలగాలని ఆశించినారు.

### ముఖచిత్రం :-

కోదండరాముడు, అయోధ్య పట్టాభిషేక శ్రీ సీతారామ,లక్ష్మణ, భరత,శత్రుఘ్న, హనుమత్సమేత శ్రీ సీతారామచంద్ర స్వామివారి దివ్యసుందర విగ్రహరూపం కమనీయంగా, అందంగా చిత్రీకరించినారు.

**అంకితం :- వీరి ఆరాధ్యదైవమైన శ్రీ సీతారామచంద్ర స్వామివారికి వీరాంజనేయస్వామివారికి పరముభక్తి పూర్వకంగా అంకితం.**

**ప్రముఖుల అభిప్రాయాలు :-**

శ్రీమాన్ అప్పాల మోహన్ శర్మగారు రామభక్త సేవాసమాజ సంఘానికి అధ్యక్షులు కెరీంనగరం జిల్లా, హుజూరాబాద్ తాలూకా, సైదాపురం గ్రామస్థులు. శ్రీమాన్ బ్రహ్మశ్రీ రామకరామశర్మ గారు “రామ” అనే పేరుతో భగవత్తత్వాన్ని సాధనచేసినారని పారాయణ యజ్ఞాదులు చేసి యిపుడిట్లు అక్షరరూపంగా గ్రంధరూప సేవ చేయునెంచినారని కొనియాడినారు. వీరి ఆత్మలో ఆ శ్రీరామచంద్రమూర్తి నిండియున్నారని అందరూ భావించినారు.

వారు మోక్షాకాంక్ష దప్ప వేరే యితర ధనాదులను కోరకపోవడంవల్ల వారి నిరాడంబరత్వం బహిర్గతం అయిందని కవిగారి ఆశయం చాలా గొప్పదని వీరిని అభినందించినారు. వీరి రచనలో అనేకానేక అంశాలు నిత్యజీవితంలో స్వయంగా కవిగారే ఆచరణలో పెట్టినారని శారీరక, మానసిక, శాబ్దిక వాసనలనుండి విడిపోయి వీరు రామభక్తిలో ధ్యాన నిమగ్నులైనారని వీరిని వీరి భక్తిభావాన్ని రాముని యందు వీరికిగల ఆప్యాయతాను రాగాదులను భగవద్భక్తి తత్పరతను ఎంతగానో కొనియాడినారు.

అందమైన కందాలలో, సర్వలఘుకందములతో, అంత్యప్రాసలతో అధ్భుతమైన విశేషఅలంకారాలతో, భక్తిపారవశ్యంతో భక్తిరసాన్ని గుప్పించినారని వీరి రచనలను ముఖ్యంగా యీ శ్రీరామ రాఘవసంస్తవమును కొనియాడినారు.

శ్రీమాన్ పార్వెళ్ళ గోపాలకృష్ణ శర్మ అవధాని గారు వీరిరచనకు పరిచయం వ్రాస్తూ......

శ్లో ॥ ప్రణోమిక్వణ దోంకార మణిఘంటా విభూషితాం
కవిలోక కుటుంబస్య కామధేనుం సరస్వతీం ॥(2)

కవిత్వమునకు మూలం అనుభవము అది ప్రతిభా, వ్యుత్పత్యభ్యాసముల సాహచర్యమున జగన్మోహినిగా పరిణమిస్తుందని పై మూడింటి సాయములేనివారు ఐననూ భక్తిభావప్రేరితులై కవితా నిర్మాణము గావించుట కలదని అది వీరియందు జరిగింది తెలియజేసినారు. 73 సంవత్సరముల ప్రాయంలో వీరీ రచనను కొనసాగించడానికి పూనుకోవడం అభినందనీయమని వీరిరచన ఆసాంతము మధురభూయిష్టమని “ చెఱకునకు వంక బోనేమి చెడునె తీపి ” యన్నట్లు రసవంతములైన పద్యములు భక్త్యావేశములో రచించినారని వీరిని అభినందిస్తూ............

ఉ॥ డెబ్బదివత్సరంబుల గడించిన భక్తియు రక్తి యేకమై
కబ్బముగాగ జెప్పె శతకంబు రఘూద్వహు పాదపద్మమం
దబ్బున జేర్చెయుంకు పగరోసిన యట్లు రచించి భక్తియే
ప్రచ్చిన నేమిగావలయు వాంఛలు సర్వము దీరు నాపయిన్ ॥(33)

ఉ॥ రామచరిత్రముం జదువరా ? యెవరైనను వారికబ్బెనా
రామకటాక్షమబ్బినను వ్రాసిర ?యేమి కవిత్వమిట్లు శ్రీ
రామ పదారవిందముల వ్రాలిన తుమ్మెదయైన ధన్యుడే
రామక రామశర్మ యిట వ్రాసినదంతయు భక్తితత్వమే ॥(34)

ఈ విధంగా వీరి భక్తితత్వాన్ని కొనియాడుతూ వీరి పద్యాలు పాఠకలోకానికి ఆమోదాన్ని ప్రమోదాన్ని కలుగజేస్తాయని, వర్తమాన, భవిష్యత్ కవులకు వీరి పద్యాలు, రచనలు ఆదర్శదాయకాలవుతాయని వీరిని అభినందించినారు.

**ప్రస్తావన:-** శ్రీమాన్ ఆనూరి మరంగంటి నారాయణాచార్యులు గారు మరియు శ్రీమాన్ శేషం నరహరిస్వామి వారు వీరి కావ్యానికి అభిప్రాయాలనందిస్తూ సహస్రాధికంగా రామాయణ పారాయణాదులు గావించి నాల్గవసారి మహాసామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవాదులు కొనసాగించినారని సామాన్య ప్రజలకు సుబోధములు అయ్యేటట్లుగా వున్నాయని వీరిని కీర్తించినారు. యిందులో కవిగారికి కేవలం భక్త్యావేశమేగాని మరోటిగాదని వీరి యీపద్యాలు సాహితీవేత్తలను యొప్పించినాయని వారిచేత అభినందనలందుకొనినాయని దోషజ్ఞులు "క్షీరనీర న్యాయంగా నోర్పుతో నీ కూర్పును గ్రహించాలని వీరి నిరాడంబరత్వాన్ని అభినందించినారు.

శ్లో ॥ శ్రీరామా, పురుషోత్తమా, నరహరీ, నారాయణా, కేశవా,
గోవిందా, గరుఢధ్వజా, గుణనిధీ, దామోదరా, మాధవా.
శ్రీకృష్ణా, కమలాపతీ, యదుపతీ, సీతాపతీ, శ్రీపతీ,
వైకుంఠాధిపతే, చరాచరపతే, అక్ష్మీపతే పాహిమాం ॥(35)

ఈ విధమైన భక్తిపారవశ్యతను పాఠకులందరూ ఆదర్శంగా భావిస్తారని వీరి కవిత్వ తత్వాన్ని ప్రముఖ పండితులు అభినందించినారు,

## 2. శ్రీ రామ రాఘవ స్తవము - రామ తత్వచింతనము

ఈ కావ్యంలో కవిగారు 125 పద్యాలు కందంలో 76 పద్యాలు చంపకోత్పల, శార్దూల మత్తేభాదులలో వృత్తాలలో వ్రాసినారు. యిందులో ఉపశీర్శికలు అభ్యాస

సమాధి, పూర్వసమాధి, మనోనిశ్చల సమాధి, శ్రీ రామ బ్రహ్మ మానస పూజ, యమము, నియము వంటివి ఏర్పరిచి వీరి పద్యాశ్వాలను పరుగులు తీయించినారు. అనుబంధంలో శ్రీ శంకరాచార్యుల వారి లిఖిత ఆత్మలింగ శ్లోకరూపాలను సంగీతరూపంలో ఆటతాళ లయాన్వితంగా గేయరూపంలో అందించినారు. వీరిరచనలపై బమ్మెర పోతనామాత్యుల ప్రభావం పూర్తిగా పడియున్నదని నిరూపించే పద్యరత్నములెన్నో యీ కృతిలో కవిగారు ఆవిష్కరించినారు.

## ప్రచురణా కాలం:-

శ్రీ నళనామ సంవత్సర జ్యేష్ట బహుళ బుధవారం 1976 లో ప్రచురించినారు భక్తుల గుప్తదానంతో నిర్మించడం జరిగింది. భక్తి, శ్రద్ధలతో పారాయణం చేసుకునేవారికి ఉచితంగా యీ శతక కావ్యాన్ని యివ్వడం జరుగుతుందని యిందులో తెలియజేశారు.

అంకితం :- శ్రీ సీతారామచంద్ర స్వామివారి పదపంకజములకు పవిత్రమైన మనస్సుతో అంకితం చేయబడింది.

## ప్రముఖుల అభిప్రాయాలు :-

ప్రాక్కథనము పేరిట శ్రీమాన్ శాస్త్రుల విశ్వనాథశర్మ గారు స్వస్తిశ్రీ రాక్షసనామ సంవత్సర కార్తీక కృష్ణ నవమి 1975 లో మెదక్ జిల్లా శివంపేట వేదపాఠశాల అధ్యక్షులు గారి ద్వారా అభినందనలు అందజేస్తూ వీరి రచనను సాంతము ఆలోకించినచో వీరికి భగవద్దత్తమగు కవితా శక్తి సగుణ సాకారము.

నిర్గుణ నిరాకారాము శ్రీ రామునియందు గల నిష్టాపారవశ్యము గలిసి రూపొందిన కావ్యమిది అటు వాల్మీకీ రామునియందు యిటు ఆధ్యాత్మ రామునియందు గల భక్తిస్వరూపములను చక్కగా ప్రతిబింబింపజేశారు అని బ్రహ్మశ్రీ శ్రీమాన్ రామక రామశర్మగారి రచనలను ఆసాంతము కొనియాడినారు. కవిగారికి గల అపారమైన నమ్మకము, భక్తి, అచంచలవిశ్వాసము బహు ప్రశంసా పాత్రములైనవని వీరిని అభినందించినారు.

ప్రముఖుల అభిప్రాయములు :-

ప్రాక్కధనము పేరిట బ్రహ్మశ్రీ శ్రీమాన్ శాస్త్రుల విశ్వనాథ శర్మగారు స్వస్తిశ్రీ రాక్షసనామ సంవత్సర కార్తీక కృష్ణ నవమి 1975 లో మెదక్ జిల్లా శివంపేట గ్రామస్థులు వేదపాఠశాల నిర్వాహకులు వీరిరచనలపై అమూల్యమైన అభిప్రాయమునందిస్తూ వీరికి భగవద్దతమగు కవితాశక్తి సగుణసాకారము, నిర్గుణనిరాకారము శ్రీరామునియందు

గల నిష్ఠాపారవశ్యము గలిసి రూపొందిన కావ్యమిది. అటు వాల్మీకీ రాముని, యిటు ఆధ్యాత్మ రాముని స్వరూపమును చక్కగా ప్రతిబింబింపజేశారు.

శ్లో ॥ బ్రాహ్మణస్యతు దేహోయం
క్షుద్ర కామాయ నేష్యతే
యిహ కృచ్ఛాయ తపసే
ప్రత్యానంత సుఖాయచ ॥(36)

అను ఆర్యోక్తికి వీరు ప్రతీకలయినారు. వీరి రచనలను అభినందిస్తూ వీరికిగల లపారమైన ,అచంచలమైన రామభక్తిని రామునియందుగల వీరిప్రగాఢవిశ్వాసము అభిమానము భక్తిభావన,నిష్టవంటి సుగుణాలను వీరు కొనియాడినారు.

బ్రహ్మశ్రీ పార్వెళ్ళ గోపాలకృష్ణావధాని గారు కరీంనగరం జిల్లా చాకుంట గ్రామస్థులు శ్రీరాజరాజేశ్వర డిగ్రీ కళాశాల కరీంనగరం నందు తెలుగు భాషో పన్యాసకులుగా పనిచేస్తూండేవారు. నేను కూడా వీరివద్ద బి.ఎ. డిగ్రీ 1987 లో శ్రీ రాజరాజేశ్వర కరీంనగర సాయంకలాశాలలో చదువుకున్నాను ( పరిశోధకుడు, వేణుగోపాలవర్మ) వీరి రచనలు పరిశీలించి పద్యాలు సులభశైలిలో భావపుష్టితో వీరి కవిత ఓలలాడుతూవుంటుందని భక్తిభావ రంజకాలుగా నిండివున్నాయని వీరియా శతకాన్ని అభినందించడం జరిగింది.

“ నవకవితాయుగమున లాక్షణిక కవిత యదియు సహజసుందరమై, సత్యమై, శివమై తేలికమాటలతో నలరారుతూ విశేషించి వీరికవితలో ఆసాంతము రామభక్తిచే పరిపూర్ణత నాపాదింపజేసినారని వీరిరచనలో రామభక్తియే వీరికీ కీర్తినాపాదించి పెట్టినదని తెలియజేశారు. వీరిరచనలో రమణీయ భావ రమణశీలత నొప్పియున్న పద్యాలు అనేకానేకాలుగా ప్రకాశిస్తూంటాయని వీరి కవిత్వమును కొనియాడినారు. వీరిరచనలకు ముందుమాట వ్రాసేభాగ్యం వీరు నాకు కలిగింపజేయడం నా భాగ్యం అని వీరిని అభినందించినారు. అంతేకాకుండా వీరు నిరంతర రామనామ పారాయణా భాగ్య సుసంపన్నులని వీరినిష్ట, వీరి పట్టుదల, దైవచింతన ప్రగాఢమైన భక్తి విశ్వాసాలు ఎనలేని కీర్తిని వీరికి సాధించిపెట్టినవని వీరిని అందరు అభినందించినారు.

బ్రహ్మశ్రీ ఏ. వెంకటరమణయ్యగారు పీలూఖానా– హైదరాబాదు గారలు 30–08 –1974 కల్లేపల్లి గ్రామములో వీరి రచనలను అభినందిస్తూ...............

సీ ॥ శ్రీ రమాంశజ యైన సీతా మహాదేవి
వామభాగంబున వరలుచుండ
ప్రకట ధనుర్బాణ పాణియై సౌమిత్రి

దక్షిణభాగంబున దనరుచుండ
ప్రముదితాత్ముల లేచుభరత, శత్రఘ్నులు
వింజామరలు పూని వీచుచుండ
చేతులు శిరమున జేర్చి వాయుజుడట్టి
మించిన భక్తి ప్రార్థించుచుండ
తే॥గీ॥ నిండు పేరోలగంబుండి నిఖిలజగము
లేలు శ్రీరామచంద్రుండ హీన గతిని
నీ మనోంబుజ పీడన నెగడు గాక
రమ్యగుణధామ రామక రామశర్మ ॥(37)

శ్రీమాన్ బ్రహ్మశ్రీ రామక విశ్వనాథ శర్మ గ్రామము బొమ్మెనపల్లి జిల్లా కరీంనగరం గారలు 27-4-1970 రోజున వీరి రచనలనభినందిస్తూ 36 పాదాల ఉత్పలమాలికను అభినందన మాలికగా వీరికలంకరిస్తూ వీరి భక్తిని వీరి కవితాశక్తిని శ్లాఘిస్తూ వీరిని అభినందించినారు. పండు ముసలి వయసులో మకరంద సదృశమైన రచనలు వెలార్చినారని వీరి భక్తిభావాలు పండితులకు పామరులకు సైతము ఆనందడోలికలలో తేలి ఆడేవిధంగా ఆనందాన్ని పంచిపెడతాయని తద్వారా వీరి రచనలద్వారా సామాన్యమానవ లోకానికి భక్తిభావనను పంచిపెట్టేవిధంగా వున్నాయని వీరి కవితావిధానాన్ని వీరు కొనియాడినారు. శ్రీమాన్ రామక రామశర్మగారు ఈనాటికీ అందరినోళ్ళలో నానుతూ పరోక్షదేవతారూపులై అందరిచేత అభినందన చందన నీరాజనాలు అందుతూ శాశ్వతముద్ర వేసుకోగలిగినారు. వీరి రామభక్తి వీరి దైవానుబంధము వీరి దైవచింతన వీరి మోక్షారాటము దానికొరకు చేసే పోరాటము అందరి మన్ననలందుకోగలిగింది.

## 3. శ్రీమదాంజనేయ స్తుతి :

బ్రహ్మశ్రీ రామకరామశర్మ 1979లో ఈ కావ్యం రచించినారు. ఈ శతక కావ్యంలో 112 కందములందముగా అల్లినారు. దీనికి అనుబంధంగా ఛందనాలంకార కథ, శ్రీ రామచంద్ర మూర్తిగారికి హనుమంతునికి మధ్యగల సంభాషనను వ్రాసినారు. ఇవి 15 కంద పద్యములు. శివ ఆంజనేయ సంభాషణా పేరుతో ఓ 20 కంద పద్యాలు రచించినారు. సువర్చలా జననం పేరిట 10 కంద పద్యాలు సూర్యుని వద్ద హనుమంతుడు విద్య నేర్చుకోవడం పేరుతో 24 కంద పద్యాలు శివుడే

హనుమంతుడగుట శీర్షికతో 11 కంద పద్యాలు రచించినారు. ఇదంతయు భక్తి తత్వమే. సామాన్య జనులకు కూడా సులభంగా అర్థమయ్యే రీతిలో ఈ శతకము రూపుదిద్దుకోవడం జరిగింది.

శ్రీ సిద్ధార్తినామ సం။ర మార్గశిర శుద్ధ గురువారం 1979లో ఈ శతకాన్ని పాఠకలోకానికి అందించగలిగినారు. ద్రవ్య సహాయం చేసనవారు గుప్త దాతలు. భక్తి శ్రద్ధలతో పఠనము, పారాయణము చేసుకొనే వారికి ఉచితంగా ఈ శతక కావ్యము అందజేయబడుతుంది అని ఇందులో ప్రకటించబడింది.

శ్రీమాన్ కవిగారు వారి ప్రారంభ పద్యం తెలియజేస్తూ, సర్వ లక్షణ సమన్వితమై సాంప్రదాయిక గుభాలింపులతో మకరందంతోయుందని తెలియజేస్తూ.

శా॥ శ్రీ వాగీశ్వరితో విధాతలను యా శ్రీలక్ష్మితో విష్ణులన్
శ్రీ విశ్వేశ్వరితో మహేశ్వరుల నా శ్రీ కాళీదాసాదులన్
శ్రీ వేదాంత రహస్య బోధ గురుడే శ్రీ శంకరాచార్యులున్
భావమ్మందున నిల్పి ఈ శతకమున్ ప్రారంభమున్జేసెదన్॥(8)

శా॥ కందంబుల్మతంబు వ్రాయుటకు నీ కానందమో యేమో యీ
కందంబుల్రచియింప బుద్ధి గలుగంగా జేసియున్ నీవు నా
డెందమ్మందున నుండి భక్తి రసముండే వాక్యముల్ యిచ్చినన్
విందుల్జేసెద కంద పద్యములతో వీరాంజనేయ ప్రభూ॥(9)

కవిగారు వీరాంజనేయ స్వామి మందిరం కరీంనగరమందున కొంత కాలము వీరి పుత్రుని వద్ద ఉన్నపుడు స్వామి వారిపై భక్తితో ఈ శతకమును రచించినారు. ఇందులో ఆమూలాగ్రము భక్తి తత్వము తెలియజేశారు. వివిధ కథాంశములను గూర్చి అందించినారు. నిష్ఠ, భక్తి, శ్రద్ధ, పట్టుదల, విశ్వాసము అనునవి ఇందులో అందరికి అందే విధంగా వారి భక్తి శ్రద్ధలను కనిపింపజేసినారు.

**ప్రముఖుల అభిప్రాయాలు :**

బ్రహ్మశ్రీ శాస్త్రుల విశ్వనాథశర్మ గారు, శివంపేట, మెదక్ జిల్లా వేదపాఠశాల నిర్వాహకులు గారు వీరు ఈ శతకానికి ముందు మాట వ్రాస్తూ, కవిగారు శాస్త్రీయ ప్రవృత్తి, నివృత్తులను సహజంగా అలవరచుకోగలిగారని వీరి ధర్మనిష్ఠ భగవద్భతికి దాసోహం అంటూ వీరి సహజ సిద్ధమైన పాండిత్య ప్రభావంతో ఈ అందమైన కందములను మనకదించగలిగినారని వీరిలో భావశుద్ధి, ధారాశుద్ధి ఒకదానితో ఒకటి

ముందంజవేసి బోధన నిష్కంఠకమై, మనోహరమై ఆనందాన్ని కలిగించగలిగిందని ఈ కృతి సుసంపన్నమైనదని "తమేవైకం జానథ ఆత్మానా మన్యావాచో విముంచథ" అనాత్మ ప్రసంగములు మానుకొనుము, ఆత్మ దర్ధనము గావించుము అనే ఉపనిషద్వాక్యమును, సర్వమును అనుసరించి, గ్రంథకర్త కృతకృత్యుడైనాడు. అట్టివారి కవిత్వంపై నేను అభిప్రాయం వ్రాయడం ఆనందతుందిలం అని భావిస్తున్నానని వీరు తెలియజేసినారు.

బ్రహ్మశ్రీ పార్వెళ్ల గోపాలకృష్ణావధానిగారు వీరిని అభినందిసన్తూ శ్రీ రామకరామశర్మగారు " శ్రీ రామ చరణారవింద, మరంద బిందు, సందోహ తుందిలేందిందులు'' మన్నెముపల్లి వాస్తవ్యులు రామనామ భజనతత్పరులు పుష్టిమార్గములో వీరి జీవితము నడిచిందని అంటూ భగవత్కృపతో వీరిన్ని రచనలు అందించగలిగినారని వీరు నిరంతర శ్రీమద్రామాయణ పారాయణా ధురందరులు అంటూ వీరిది సహజ కవిత యని వివరిస్తూ............

ఉ॥ రాముని సత్కృపాగరిమ రాముని భక్తుని సచ్చరిత్రమున్
రాముడు వ్రాసె శ్రోత్రజన రంజకమై దనరార కైత శ్రీ
రాముడె కార్యకర్తయును రాముడె కామదినెంచునట్టి యీ
రామచరిత్ర మద్భుతము వ్రాసెడునుద్యమ వద్భుతంబునున్ ॥(38)

ఉ॥ వ్యాకరణంబురాదు కృతులందును పఙ్ఞయు లేదు ఛన్దముం
దాకి పరిశ్రమింపక యధామతి నేదొ గజేన్ద్ర మోక్షము
న్వేకువనే పఠించు నొక వేడుకగా నదె యింతజేసె గా
దా కవితాప్రసక్తి యరుదైనది యర్వది దాటువానికిన్ ॥(39)

ఉ॥నారద దర్శనంబున మనంబుప్రసన్నత నొంది కౌతకం
బారగ రామతారకమునంది ముదంబు జెంది భక్తి సం
సారమునీది రామకథ చాల సుఖంబుని గ్రోలిగ్రోలి సే
వారతిదీర జన్నములు వారక నాలుగు జేసె నింపుగా ॥(40)

అంటూ వీరి రచనా చమత్కృతులను భక్తిపారవశ్యతను కొనియాడుతూ వీరి సహజ మైన కవిత్వ పటుత్వ కవిత్వశక్తిని ఎంతగానో అభినందించినారు.

----0----

# 4. శ్రీ చెన్నకేశవ శతకం

కవిగారి స్వగ్రామములోని మందిరంలో వెల్సిన శ్రీ లక్ష్మీచెన్నకేశవస్వామి వారి దేవాలయంలోని స్వామివారిపై భక్తితో వెలయించిన శతకమిది యిందులో భక్తి, మోక్షాకాంక్ష సామాజికస్పృహ మున్నగను లక్షణములతో సహజసుందరంగా తీర్చిదిద్దడం జరిగింది.

శ్లో ॥ దక్షిణోర్ధ్వ కరే శంఖం । వామహస్తే సుదర్శనం
గదావామ కరన్యస్తం । యభయం దక్షిణాకరే
శ్రీభూమీసహితంసౌమ్యం।శ్రీవత్సాంకిత వక్షసమ్
ఆదిమూర్తిస్థితంతోయం । కేశవాఖ్యం నమామ్యహం ॥(41)

కేశవస్వామివారిపై గల భక్తి శ్రద్ధలను యిందులో పొందుపరిచినారు. కవిగారి పద్యసుమాలు భక్తులందరిలో ఆనందాలను నింపి మెప్పువడిసినది. ప్రచురణకాలం శ్రీ పింగళినామ సంవత్సర మార్గశిర బ॥ పంచమి శుక్రవారము 12 - 12 -1977 ప్రచురణకర్తలు గుప్తనామధేయులు మహాభక్తులు వీరి శిష్యులు ఈ గ్రంధం భక్తితో పారాయణం చేయువారికి ఉచితంగా అందజేయబడుతుందని యిందులో పొందుపరచడం జరిగింది.

## అంకితం :-

శ్రీ భూనీళా సమేత లక్ష్మీ చెన్నకేశవ స్వామివారి దివ్యపాదారవిందములకు సహస్రానేక నమాస్సుమాంజలలు సమర్పిస్తూ అంకితం చేయడం జరిగింది.

స్వామివారికి వినమ్రంగా అంజలి సమర్పిస్తూ....................

ఉ॥ శ్రీధర నీ పదాబ్జముల చిత్తము నిల్పిన నిల్వదయ్య యో
సాధుజనావనా సుజన సన్నుత నామది నిల్పి సంస్మృతిన్
బాధలు బాపు నిన్ను నెడబాసియు తాళగ జాలనయ్య యో
మాధవ నిన్భజించెద రమావర మన్నెముపల్లి కేశవా ॥(42)

ఓ స్వామీ మీయందు నా చిత్తము నిల్పునట్లు నన్నాశీర్వదించండి స్వామీ అంటూ వినమ్రంతో ప్రార్థించడం కేశవస్వామిని శరణాగతి కోరడం వారిని అర్థించడం మోక్షాన్ని అర్థించడం తన వారందరికి తన గ్రామస్థులకు అందరికి క్షేమం జరుగాలని కోరుకోవడం కవిగారి భక్తిచింతన అందరికి అందించడం వంటి మంచికార్యక్రమాలు

రూపొందింపజేయడం అందరికి నచ్చి వీరికి అమేయమైన కీర్తిని అందించగలిగింది. యీవిధంగా కవిగారు అమరకవిగా శాశ్వతఖ్యాతిని ఆర్జించినారు.

యిందులో వీరుదశావతార వర్ణన వంటి శీర్శికలు, నవవిధ భక్తులను జూపిస్తూ నిరంతర భగవన్నామ సంకీర్తనా స్మరణ చేస్తూండేవారు. యిందువల్లనే వీరికీశక్తి లభించింది. తద్వారా నేను కావ్యాలు వ్రాయడం లేదని కవి తన కవితానిరాడంబరత్వాన్ని తెలియజేసినారు. ఎవరైతే భక్తి శ్రద్ధలతో, భక్తికి లోటులేకుండా పఠింపనెంచారో వారికి ఈ ప్రతి ఉచితంగా అందిస్తానని ఇందులో ప్రకటింపజేసి వీరి భక్తి తత్వాన్ని తెలియజేశారు.

నాటి రోజుల్లో గ్రామాల్లోని విద్యావంతులు కొందరు ఈ శతకం పఠియించి ఇందులోని భావ గాంభీర్యతను మెచ్చుకొని వారు గ్రామములోని నిరక్ష్యరాస్యులకు పఠనం ద్వారా వినిపింప జేస్తూ ఆనంద పరవశాన్ని అందిస్తూ ఉండేవారు. ముఖ్యంగా జానపద ఉత్సవ సందర్భాలలో చిరుత రామాయణం వంటి యక్షగాన ప్రదర్శనా సమయంలో వీరి పద్యాలను ఉదాహరణగా ఉపయోగిస్తూ ఉండేవారు.

కవి గారి భక్తి నిష్టలను అందరూ ఆదర్శంగా భావించి శ్రీ చెన్నకేశవ స్వామి భక్తులు ఈ పద్యాలను కరస్తం చేసి ఆలయంలో జరిగే వివిధ పూజోత్సవాల్లో, జరిగే సేవా కార్యక్రమాల్లో పల్లకి సేవా, వాహన సేవా, రథోత్సవాది సవా కార్యక్రమాల్లో ప్రదక్షణావళి అంతర్భాగంగా ఒక ప్రదర్శన పూర్తి కాగానే ధ్వజస్తంభం ముందు స్వామీని సేవలో వేంచేపుచేసి ఈ పద్యాలను పఠిస్తూ ఉండేవారు. ఇదే గ్రామంలోనే భక్తులు గడ్డం రాఘవరెడ్డిగారు, తాళ్లపెల్లి భద్రయ్యగారు యేగిన వీరేశం గారు, సేరుభద్రయ్యగారు వంటిభక్తులు అనేకులు యీ పద్యాలను గొంతెత్తి ఈ పద్యాలను పఠిస్తూ ఉండేవారు

యిందులోని ఉత్పలమాలికలో గ్రామములోని అన్ని కులాల వారిని ఉదహరిస్తూ అందరికి క్షేమం జరగాలని కోరుకుంటూ విశ్వ కళ్యాణాన్ని ఆశించినట్లుగా ఈ పద్యమాలిక రూపుదిద్దుకుంది. ఇందులో గ్రామములోని కర్షకులను, కార్మికులను అందరిని ఉద్దేశించి వీరందరికి మేలు జరిగే విధంగా, ఓ స్వామీ, నీ కరుణా వర్షాన్ని ఎల్లవేళలా కురిపించమని త్రికరణ శుద్ధిగా కోరుకున్నారు. వీరి రచనల ద్వారా భక్తి, ఆధ్యాత్మికత పరివ్యాప్తికాగలిగింది అని చెప్పవచ్చు.

## 5. వివిధ మంగళహారతులు

మంగళహారతులు అనేవి భారతీయ హైందవ సాంప్రదాయంలో ఆధ్యాత్మిక రంగంలో వివిధ దేవతార్చన రూపాల్లో కార్యక్రమాల్లో భాగంగా ఖచ్చితంగా ఇవి ఇమిడి

ఉంటాయి. పూజా కార్యక్రమానంతరం. మంగళహారతి ప్రశాంతంగా చదవడం ఒక ఆనవాయితి. వ్రతానంతరం, అభిషేకానంతరం, మంగళహారతి చదవడం ఒక సంప్రదాయం. కవిగారు ఈ నియామాను సారంగా ఆనందంగా పాడడానికి భగవన్నుతి చేయడానికి వీలుగా కొన్ని మంగళహారతులు రచించినారు. అక్కడక్కడ కొన్ని పుస్తకాలల్లో ముద్రించినారు. కొన్ని నేటికి మౌఖికంగా నేర్చుక్ను వారి వద్ద నుండి కొన్ని మంగళహారతలు సేకరించి ఇందులో చేర్చడం జరిగింది నేటికీ చాలామంది మహిళలు నాగులచవితి, నాగపంచమి,హనుమజ్జయంతి, కేశవస్వామి వారి బ్రహ్మోత్సవాలలో కవిగారి మంగళహారతులు పాడడమే పరిపాటి గా వస్తున్నది. భక్తి పరిడవిల్లుతుంది.

## -ః హారతి ః-

వసంతరాగం - ఆదితాళం-

1. గౌరీ శంకర మంగళం సదా
   కరీంనగర నివాస తరాకారి జనకమహాబల
   భవతారక త్రిపుర హరణ - త్రి నయన ॥గౌరీ॥

2. ఖండ చంద్ర శిఖిక నమకసుముఖ
   మృకండు సూను రక్షక విషభక్షక
   భండనాంగ నాహిత శిక్షక వేదండ
   చర్మధర మధుర వివరద ॥గౌరీ॥

3. మండలేశ ముఖసుర నుత బ్రాహ్మణ
   మండలారాధన ప్రియ ఫణిరాట్
   మందితోడ వక్షశ్చంద్ర మౌళ్యఖండ
   పూజనేన తోషిత హృదయ ॥గౌరీ॥(43)

శివుడిపై మంగళహారతివీరి భక్త్యావేశం ఇలా ఈ విధంగా అప్పుడపుడు మంగళహారతుల రూపంలో వస్తూ ఉండేది. వీరి కుమార్తె గారు వీటిని వ్రాసి పెడుతూ ఉండేది. కొన్నొ కొన్నొ పూజా కార్యక్రమాల్లో, శుభ కార్యాల్లో సందర్భానుసారంగా పాడుతూ ఉండేది. ఇలా చదవడం వల్ల వీరి అనుయాయుల్లో అంతే వాసుల్లో ముఖ్యంగా మహిళా మూర్తులకు ఎక్కువ శాతం ఇవి కంఠతా వచ్చేవి. కొన్ని మంగళహారతులు వీరు పాఠక లోకానికి అందించగలిగినారు. వీరు భక్తి తత్వానికి ఇది కూడా నిదర్శనాలయినాయి.

రామునిపైన "జయనీరాజనంబిదే రాఘవా..." వంటి అనేక మంగళహారతులు

భీంప్లాస్ రాగంలో, మోహన రాగంలో చక్కగా రచించినారు. అలాగే అమ్మవారిపైన "శ్రీ లలితా శివజ్యోతి సర్వకామధ శ్రీ గిరినిలయా, నిరా మయా" హారతీ గైకొనురా, మురళీ మోహనా ముకుంద వామనా, జై శ్రీరఘువీరా శ్రితమందారా నీరాజన కళలలరా నవనీరద శ్యామశరీరా వంటి మంగళహారతులు నీరాజనం " వంటి హారతి పాటలు వీరు వీరి శిష్యసముదాయానికి అందించినారు. పౌరోహితులుగా కూడా వీరి వ్యాసంగం కొనసాగబడింది కాబట్టి సత్యనారాయణ వ్రతాది కార్యక్రమాల్లో, తులసీ, శ్రీకృష్ణ వివాహాది శుభకార్యాల్లో, వైకుంఠ ఏకాదశి, శివరాత్రి, శ్రీరామనవమి, హనుమజ్జయంతి, శ్రీ లక్ష్మీచెన్నకేశవస్వామివారి వార్షిక బ్రహ్మోత్సవాది శుభ కార్యక్రమాల్లో వివిధ శుభకార్యాల్లోనూ ఈ మంగళహారతులు ఉపయోగిస్తూ వుండడం నేటికీ ఈ ఆనవాయితీ కొనసాగబగుతుండడం ముదావహం.ఇలా ఈ మంగళహారతులు స్వయంగా వీరు పఠించి, పఠింపింపజేసి అందరినీ ఆనందపరవశులను చేస్తూండేవారు.

శ్రీరామనవరాత్రోత్సవ కల్పః అనే వీరి పరిశోధనా గ్రంథంలో ప్రథమవాసర పూజనుండి నవమవాసర పూజవరకు ప్రతిదినము అర్చించేవిధానంలో భాగంగా " నివేద్య " నివేదనానంతరం నీరాజయేత్ అంటూ తొమ్మిది మంగళహారతులు నీరు చెప్పినట్టుగా వీరి పుత్రులు కుటుంబసభ్యులు తెలియజేసినారు. వీరి మంగళహారతులలో భక్తి, ఆవేదన, దర్శనాకాంక్ష మెండుగా నిండియుంటాయి. హనుమన్నుతి పూర్వకంగా కూడా కొన్ని మంగళహారతులు రూపకల్పన చేసినారు.

(43)' మంగళలములు రామా శ్రీరామా మానిత గుణధామా " వంటివి మన్నెంపల్లి శ్రీ లక్ష్మీచెన్నకేశవ స్వామివారి మందిర ప్రధాన పూజారిగారైన శ్రీమాన్ శ్రీ నరహరి ఆచార్యులు గారు యిప్పటికినీ ఆలయంలో చదువుతూవుండడం పరిపాటిగా వస్తున్నది. " శ్రీజననీ మంగళం శర్వాణీ మంగళం " వంటి దేవీపరమైన మంగలహారతులు అనేకానేక సందర్భాలలో గ్రామస్థులు వినిపిస్తూనేయుంటారు. ముఖ్యంగా ధనుర్మాసవ్రతంలో గానీ శ్రావణమాసం శుక్ర, , శని వాసరాల్లో మన్నెంపల్లి గ్రామంలోని శ్రీ లక్ష్మీచెన్నకేశవ స్వామివారి మందిరంలో జరిగే " పల్లకీ సేవ " కార్యక్రమంలో భాగంగా అందంగా రమణీయంగా చెవులకింపుగా భక్తిపారవశ్యంతో వినిపింపజేస్తూ ఆనందాన్ని పంచిపెడుతూవుండేవారు. యిది ఒక ఆనవాయితీగా యిప్పటికినీ కొనసాగింపబడుతుంది.

(44)" నిగమాంతవర్ణిత నటరూపధారీ ఓం నమో శంకరా నీరాజనం నిత్యనీరాజనం నీకు శుభనీరాజనం " వంటి గీతాలు యిప్పటికినీ గ్రామంలోని పెద్దవయసులో వున్నవారు అప్పుడప్పుడు వారి వారి యిండ్లల్లో జరిగే శుభకార్యాల్లో

చదువుతుండటం జరుగుతూ ఉంటుంది. నేను (పరిశోధకుడు) పౌరోహితాధికార్యక్రమాల్లో ఎప్పుడైనా వెళుతూ ఉండే సమయాల్లో గమనకు వస్తూ ఉండేవి. ఇలా అనేక రూపాల్లో కవిగారు ప్రజల నాలుకలపై శాశ్వతంగా నిలిచిపోయి " సుకవి జీవించు ప్రజలనాలుకలయందు" అన్నది అక్షరసత్యమని నిరూపించినారు.

## శ్రీరామనవరాత్రి పూజా విధానము – నవరాత్రి కల్పః

పరిచయం : శ్రీమాన్ రామకరామశర్మ గారు ఔత్సాహికులు, జిజ్ఞాసువులు, నిరంతర భగవన్నామ పారాయణ జపశీలి, వారి ఆరాధ్య దైవమైన శ్రీరామచంద్రమూర్తి వారి రామాయణ పారాయణములు నిరంతరము చేస్తూ ఉండేవారు. మర్యాదా పురుషోత్తముడైన శ్రీ రామచంద్రుని ఆరాధన వ్రతమును ఆలంబనా చేసుకొని వీరి తల్లిదండ్రులు వీరికీనామకరణం చేశారు. కాబోలు వీరు సార్థక నామధేయులైనారు.

వారు నమ్మిన వారి ఆరాధ్యదైవమైన శ్రీరామ నవరాత్రి మహోత్సవములు సవైధికంగా ఏర్పాటుచేసే గ్రంథరాజమొకటి ఏర్పడి యుండలేదనే బాధ వారికి ఉంటూ ఉండేది. వారి స్వాధ్యాయులతో, అనుయాయులతో, మిత్రులతో, శిష్యులతో అప్పుడపుడు విచారం వ్యక్తం చేస్తూ ఉండేవారు. కొంతకాలం పిదప ఆపని నేను ఎందుకు చేయకూడదు అని ప్రశ్నించుకొని ఆ పనికి పూనుకున్నారు. వెంటనే రచనకు ఉపక్రమించారు.

శ్రీమద్రామాయణం వాల్మీకిచే ప్రణీతం చేయబడింది. వాల్మీకి రామాయణం షట్కాండా యుక్తంగా లభించింది. ఈ రామాయణంపై పరిశోధనకు పూనుకున్నారు. అనేక ప్రాంతాలు సందర్శించినారు. భద్రాచల క్షేత్రం సందర్శించి, కాశీ, గయ, ప్రయాగల వంటి పుణ్యక్షేత్రాల దర్శించి, దర్శించిన వారివద్దనుండి కొన్ని వివరాలు సేకరించి వారి సందేహాదులను, అనుమానాదులను నివృత్తి చేసుకొని, వీరి గురువర్యులు ధర్మపురి క్షేత్ర వాస్తవ్యులు అయిన బ్రహ్మశ్రీ రొట్టె చంద్రశేఖర శాస్త్రి గారి సలహాలతో శ్రీరామనవరాత్రోత్సవ కల్పాన్ని ఏర్పరచడం జరిగింది. అన్ని సంరంభాలు సమకూర్చుకొని రచనకు శ్రీకారం చుట్టినారు. నేటికి అన్ని ప్రాంతాలలో ఈ గ్రంథాన్ని ఆధారంగా ఆచరిస్తూ ఉన్నారు.

లఘ్వాహ్నిక –దశావరణార్చన, నవాహ్నిక, శ్రీ మద్రామాయణ పారాయణ క్రమ మంత్ర రామాయణాధ్యుప బృంహితః శ్రీరామ నవరాత్రోత్సవ కల్పః అనే పేరుతో వీరి పరిశోధనా గ్రంథం వెలుగులోకి వచ్చింది. ఇందులో ఋగ్, యజు, సామ, అధర్వణ వేద మంత్రంచే మంత్ర సహితంగా  ఈ రామాయణ ఆధారంగా శ్రీరామ

నవరాత్రి పూజా విధానము ఏర్పరచి ఇప్పటికి అనేక దివ్య క్షేత్రాల్లో అనేక ప్రాంతాల్లో ఈ నవరాత్రి పూజా విధానాన్ని ఆరాధిస్తూ ఉండే విధంగా ఏర్పాటు చేసినారు. ఇప్పటికి తెలంగాణంలోని అనేక ప్రాంతాల్లో భారతదేశంలోని ఇతర ధార్మిక క్షేత్రాల్లో ఈ విధానాన్ని ఆరాధిస్తూ, అనుసరిస్తూ నవరాత్రి మహోత్సవాలను ఏర్పరచుకుంటున్నారు. ఇందులో వరణార్చన, మంత్ర ప్రయోగం, మంత్రోపయోగం, వివిధ న్యాసాలు, వివిధ నివేధనలు అవధారయలు, వివిధ నీరాజనములు ఏర్పాటు చేసినారు. వీరు రూప కల్పన చేసిన, ఈ దేవనాగరి గ్రంథమాధారంగా చాలా మంది ఈ గ్రంధాన్ని ఆరాధిస్తూ ఉన్నారు.

## ప్రచురణా కాలం :-

ఈ గ్రంథం శ్రీ ముఖ నామ సం॥ర చైత్ర శుద్ధ నవమి 1-4-1993 (ద్వితీయముద్రణ)కవిగారి అనంతరం వీరి పుత్రులు శ్రమతో పుస్తకాన్ని ముద్రింపింపజేసి అందరికి అందుబాటులోకి తెచ్చినారు. శ్రీరామున్ని ఆరాధించే వారందరికి ఈ గ్రంథాన్ని వైధిక రూపంగా నవరాత్రి ఉత్సవాలు జరిపించుకునే విధంగా ఏర్పాటు చేసి అందరి ఆదరాభిమానాలు చూరగొని భక్త జనులకు ఆనందం కలిగింపజేశారు.

## ప్రచురణా సంస్థ :-

ప్రకాశకులు విద్యా గ్రంథమాల, హనుమకొండ, వరంగల్లు సమాఖ్య గారలు ముద్రింపింప జేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయముతో ఇది వెలుగులోకి వచ్చింది. చాలా మంది దీనిని ఉపయోగించి విధివిదానంగా శ్రీరామ నవరాత్రి మహోత్సవాలను ప్రతి సంవత్సరము చైత్ర మాసంలో జగజ్జేగీయ మానంగా పూర్తి చేసుకుంటున్నారు.

పరిష్కర్తృత్వం :- శ్రీమాన్ శాస్త్రుల్ల విశ్వనాథ శర్మ శివంపేట మెదక్‌జిల్లా వేదవిద్యా పాఠశాల నిర్వాహకులు గారి నేతృత్వంలో పరిష్కరించబడినది. శుద్ధ ప్రతి శాస్త్రుల్ల భార్గవరామ శర్మ గారిచే చేకూర్చబడినది.

## ప్రముఖుల అభిప్రాయాలు :-

బ్రహ్మశ్రీ మల్లావజ్జల సుబ్బరాయశాస్త్రి గారు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు వరంగల్లు గారలు, బ్రహ్మశ్రీ వీరేశ్వర కృష్ణ డోంగ్రేశాస్త్రి గారు, బ్రహ్మశ్రీ సన్నిధానం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, శ్రీ ఉ.వే. సన్తానం గోపాలాచార్యులుగారలు, బ్రహ్మశ్రీ ముదిగొండ వీరభద్రయ్య గారు, శ్రీమాన్ శ్రీభాష్యం విజసారధి అధ్యక్షులు సర్వవైదిక సంస్థానం కరీంనగరం గారలు వీరి వీరి

అభిప్రాయాలలో భాగంగా శ్రీమాన్ రామక రామశర్మకవిగారు పూజ్య శ్రీ కరపాత్ర స్వామిగారి దివ్యమంగళాశాసనములతో అత్యంతవిలువైన మంత్రభాగాలను సందర్భానుసారంగా వుపయోగిస్తూ శ్రీరామ నవరాత్రోత్సవ కల్పాన్ని సిద్ధంచేశారు యీ మంత్రోపయోగం చేస్తూ శ్రీరామనవరాత్రి మహోత్సవాలు నిర్వహించినట్లయితే సవైదికంగా యుటుందని జిజ్ఞాసులు అందరూ ఆనందంగా స్వామివారి నవరాత్రులు జరుపుకున్నట్టు వుంటుందని తెలియజేశారు. తొమ్మిది రోజులు పూజించే విధానంలో భాగంగా నిర్వహించే యజ్ఞంలో స్వాహాకారం చేసే మంత్రభాగాలను, సంహితాభాగాలను వాటితోపాటు వాల్మీకీ రామాయణాంతర్గత వివిధ విశేషసర్గల శ్లోకభాగాలను ఉదహరిస్తూ వ్రాయడంవల్ల ఈ గ్రంధానికి వివిధ ప్రయోజనం చేకూరబడింది.

ప్రథమవారచర్య, ద్వితీయవారచర్య, తృతీయవారచర్య అనే శీర్శికలతో 9 రోజుల పూజావిధానమును యేర్పరిచి నైవేద్యాదులు తన్మంత్రాదులు సూచించినారు. శ్రీమాన్ రామక రామశర్మగారి అచంచల భక్తివిశ్వాసాదులను, వారి నిష్టను, అభినందించినారు. సామ్రాజ్యపట్టాభిషేక విషయాన్ని అందరూ కొనియాడినారు రామునియందు కవిగారికి గల అవ్యాజానురాగాలను భక్తిభావాలను అందరూ ముక్తకంఠంతో అభినందించినారు. యిప్పటికినీ కొన్ని దేవాలయాదుల్లో వీరి గ్రంధాధారంగా నిష్టకు నియమాలకు ఎలాంటి లోటురానీయకుండా శ్రీ రామ నవరాత్రి కార్యక్రమాలు దిగ్విజయంగా నిర్వహించుకోవడం గమనార్హం. చాలామంది వైదికులకు యీ పొత్తం కరదీపికగా ప్రయోజనం కలిగించింది.

## 7. భజనలు కీర్తనలు

గ్రామంలోని భక్తుల మ్రొక్కులు, చెల్లింపులు అనే కార్యక్రమంలో భాగంగా గ్రమస్థులు వారి యిళ్లల్లో ఏవైనా శుభకార్యాలు జరిగినప్పుడు పెళ్లిల్లు, పేరంటాలు, వార్షికోత్సవాలు వంటి శుభకార్యాలు జరిగినప్పుడు విధిగా మన్నెంపల్లి గ్రామంలోని శ్రీ లక్ష్మిచెన్నకేశవ స్వామివారి మందిరంలో పల్లకీసేవ మ్రొక్కుబడి వుంటూయుండేది. నేటికినీ యీ ఆచారం యింకా కొనసాగింపబడుతుంది సాయంవేళ దాదాపు 7 గంటల ప్రాంతంలో స్వామివారిని పల్లకీలో వేంచేపు చేసి అలంకరణాదులు పూర్తిచేసి అర్చకస్వామి ప్రధానార్చకుని నేతృత్వంలో ప్రదక్షిణలు ఐదింటిని ఏర్పరిచినారు ఆలయంలో ఉత్తరం ద్వారంవద్దనుండి ఆలయ అంతరాళం లోగిలిలో ధ్వజస్తంభం వద్దనుండి స్వామిని ఊరేగింపుగా సేవాకార్యక్రమం చేస్తూండేవారు. స్వామిని ఊరేగిస్తూ భజనలు చెప్పడం అందరిచేత అనిపించడం జరుగుతూండేది. భజనసామాగ్రిగా కంజర్లు, తాళాలు, జాగంట, మద్దెల, గజ్జెలు వంటివి సాధనాలుగా స్త్రీలు, పురుషలు, పిల్లలు, వృద్ధులు

లనే భేదం లేకుండా ఆ ఊరిలోని ఆబాలగోపాలం అందరూవిధిగా పాల్గొనేవారు. పల్లకీని మోస్తూ, భజనలు చేస్తూ వెళ్ళేవారు ఒక ప్రదక్షిణం పూర్తికాగానే స్వామివారి గోవిందనామాలు చెప్పి జయజయధ్వానాదులు చేసి కేశవస్వామి గోవిందా గోవిందా అంటూ భక్తియుక్తులై వెళ్తూ ధ్వజస్తంభంవద్ద ఆగి భక్తిపద్యాలు గొంతెత్తి శ్రావ్యంగా కవిగారు యితర భక్తులు చదివేవారు యిప్పటికినీ యిదే ఆచారం కొనసాగుతుంది.

అందులో భాగంగా కవిగారు "రఘుపతి రాఘవ రాజారాం పతీతపావన సీతారాం" వంటి గీతాలు పాడుతూ భక్తులను ఉత్సాహ పరుస్తూ వుండేవారు.

" సీతారాం సీతారాం సీతారాం జయసీతారాం
వాలిమర్ధనాసీతారాం వనచరపోషక జయజయరాం
రాజారమణా సీతారాం ఆనందరూపా సీతారాం
తాటక భంజక సీతారాం సుగ్రీవమిత్రా సీతారాం
అహల్యావందిత సీతారాం పక్షిసంరక్షక సీతారాం ॥ సీతారాం ॥
రఘుకులనందన సీతారాం నీలమేఘశ్యామా సీతారాం
కోదండరామా సీతారాం కోసల నేతా సీతారాం ....
భక్త సంరక్షకా సీతారాం ఆనందరూపా యినకులరాం
మోహనరూప సీతారాం మోదకదాత సీతారాం ॥సీతారాం॥
భక్తవరదుడా రఘుపతిరాం-బ్రాహ్మణప్రీతా జయశుభరాం
నిత్యసంతోష జయశుభరాం-నిష్టతేజుడా రఘుకుల రాం
వీరాధివీరా సీతారాం - రాక్షస భంజక సీతారాం
ప్రేమమూర్తి సీతారాం - భక్త వందిత రఘుకుల రాం" ॥సీతారాం॥(45)

ఇటువంటి మధురమైన గీతాలు అందరికి చెప్పి, చెప్పించి అందరిలో భక్తిని, విశ్వాసాన్ని కలిగించడమే వీరి ప్రధాన ధ్యేయంగా కొనసాగబడుతూ ఉండేది. "రండయ్యో రండయ్యో పండారి పురమునకు-ఊపిరి ఉండగనే సేవించి వద్దామా" వంటి భజన గీతాలతో భక్తులందరిలో ఉత్సాహాన్ని, ఉబలాటాన్ని, ఆనందాన్ని పంచిపెడుతూ ఉండేవారు.

"హరే హరే రామా-రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ-కృష్ణ కృష్ణ హరే హరే "

వంటి భజన గీతాలు చిన్న పిల్లల హృదిలో స్థిరపడుతు ఉండేవి. గ్రామస్తులు చాలా మంది చిరుతల రామాయణం వంటి యక్షగానాలు పాడుతూ రంగస్థల కార్యక్రమాలు వేస్తు ఉండేవారు. ఉత్సాహంగా ఈ పాటలు పాడుతూ ఆనంద సాగరంలో

మునిగిపోతూ ఉండేవారు.

పల్లవి : పురుషోత్తమా అరవింద నేత్ర నీలాబ్జ వర్ణా
పురుషోత్తమా హరి పురుషోత్తమా ॥పురుషో॥

చరణం : సుమదళములు అరవిందములు
పారిజాత ప్రసూనాదులు మల్లియలు
విరజాజులు సంపెగలు జాజులు
నీ సేవకు స్వామీ నీ సేవకే ॥పురుషో॥

చరణం : మదినిండ సంతోషముప్పొంగగా
హరినామ సంకీర్తనంబులు చేయగా
కేశవ నామాలు పఠియించగా
రక్షించుమా శ్రీహరి రక్షించుమా. ॥పురుషో॥(46)

ఇటువంటి మధురమైన కీర్తనలు నేటికినీ అందరిండ్లలో వినిపిస్తూంటాయి. ప్రతిధ్వనిస్తూ వుంటాయి. నేటిఆధునిక కాలంలో అయ్యప్ప దీక్షలు, ఆంజనేయస్వామి దీక్షలు, భవానిదీక్షలు వంటివి భక్తులందరు సామూహికంగా చేస్తూ ఉన్నప్పుడు అప్పుడప్పుడు కవిగారి మధురమైన భజన గీతాలు వినిసిస్తూ వుంటాయి. మాబోటి శిష్యులకు హృదయంలో ఆనందం తాండవిస్తూ వుంటుంది. యిలా స్వామివారి సంకీర్తనా స్రవంతిలో అందరిని ముంచివేసి ధన్యజీవియై అందరి గుండెల్లో శాశ్వతమైన స్థానాన్ని పదిలపరుచుకోగలిగారు.

మహా భక్తకవిగా అజరామర కీర్తిని ఆర్జించినవారిలో వీరొకరు కవిగారి ఆధ్యాత్మికచింతన ఎందరినో పరమభక్తులుగా తీర్చిదిద్దింది.

కవిగారికి యంజలి యిదె
కవిగారికి భక్తియుతికి కాంచన మణికిన్
యవిరళ భక్తికి యెపుడున్
భువిపై సాష్టాంగ నుతులు బుధులిడి రెపుడున్ ॥

----0----

# 3వ అధ్యాయము రచనలు – పరిశీలన

## రామ రాఘవ సంస్తవము

ఆరు పదులు దాటిన వయస్సులోనే ఛందః ప్రక్రియలు ఆమూలాగ్రం అపోసన పట్టి భక్తి యుప్పొంగగా చక్కని పద్యధారలో మునగనెంచి రామకృపా కాంక్షతో అద్భుతమైన శతక పద్యాలు అందించిన మహాభక్తశిఖామణి ఈ రామకరామశర్మ గారు. వీరి భావనలో వీరి ఉఛ్వాశ నిశ్వాసాల్లో కూడా నిరంతరం రామనామం ప్రతిధ్వనిస్తూ ఉండేది. వారినెరిగిన వారు, వారి బంధువులు, శిష్యులు, సహచరులు వారి గురించి ఈ విధంగా చెప్తుతూ ఉంటారు.

రాముడే ఈశతకమును తనతో చెప్పించాడని తనకీ కవిత్వ శక్తిని శ్రీరాముడే ప్రసాదించాడని తెలయజేస్తూ.....

కం॥ శ్రీమద్వాల్మీకంబగు
రామాయణ పఠనజేసి రాముని దయతో
రామశతకంబు జెప్పెద
రాముడె బలికించె నాత్మ రంజిల రామా! (1) 47.

ఈ పద్యం పోతన భాగవతంలోని "పలికెడిది భాగవతమ" అనే పద్యాన్ని తపిస్తుంది. వాల్మీకి రామాయణం అనేక సహస్రాధిక పారాయణాదికాలు చేసి యున్నాడని ఇది శ్రీరాముని దయతో మాత్రము సాధ్యము అయిందని ఆత్మ రంజిల్లే విధంగా రాముడే నాతో పలికించాడని భక్తి పూర్వకముగా చెప్పడం వారి నిగర్వత్వాన్ని చెప్పకనే చెప్తుతుంది. ఎంత దీనంగా స్వామిని అర్తిస్తున్నాడో వీరి ఈ పద్యంలో మనం గమనించవచ్చు

కం॥ ధనమును విద్యయు గీర్తియు
నినుగోరగ లేదు రామా నిముసమునన్
నిను విడువగలేను గావున
నిను మరువని మనము నాకు నిలుపుము రామా!

రా.రా.సం (16) 48.

శ్రీమాన్ శర్మ గారు ఈ పద్యంలో నిను నేనేమి కోరుకోవడంలేదు.

ధనముగాని, విద్యను గాని, కీర్తిని గాని నేను ఆశించలేదు గాని నిను విడిచి నేనుండడం జరుగదు. కావున శ్రీరామ నిను మరువజాలని మనస్సును నాకు నిలుపుమయ్యా అంటూ ఆర్తితో స్వామిని కోరిన వైనాన్ని గమనించినట్లయితే స్వామిపై

గల తన నమ్మకమును భక్తిని ఈ విధంగా తెలియజేయడం జరిగింది. నిష్కల్మష హృదయంతో నిరంతరం స్వామిని మాత్రమే ధ్యానిస్తూ సార్థక నామధేయుడయ్యాడు ఈ మహా కవి. మరో సందర్భంలో రాముని పైగల తన చిత్తశుద్ధిని ప్రకటిస్తూ ఓ శ్రీరామా నే కనులు మూసిన తెరచిన నీ రూపమే సాక్షాత్కరిస్తుంది అంటూ వేడుకోవడం ముదావహం.

స్వామీ రామచంద్రా! నీ నిజరూప దర్శనం నాకెపుడు అందిస్తావయ్యా అంటూ దీనంగా తాను నమ్మిన ఆ కోదండ రామున్ని ప్రార్థిస్తూ అణుకువను ప్రకటిస్తున్నా ఈ పద్యాన్ని గమనిద్దాం ఒకసారి

కం॥ కనులన్మూసిన తెరచిన
గనుపించుము నాకు రామ కరుణాసింధో
ఘన కోమల రూపంబును
కనులకు చూపించు రామ కారుణ్యనిధీ. (23) 48.

కళ్ళు మూసిన తెరచిన నీ రూపమే కనిపిస్తుందని ఓ కరుణా సింధో నిజరూప దర్శనం చేసుకోవాలని ఉందయ్యా ఓ స్వామీ, నీ కోమలమైన దివ్య మంగళ విగ్రహము దర్శించుకోవాలిని ఆతృత నాలో ఉందయ్యా అంటూ మీ దర్శనం కొరకు నేను వేచి చూస్తున్నాను అంటూ వేడుకుంటున్నా ఈ దృశ్యాన్ని సమాజంలోని ఓ భక్తి గీతంలో ఒక సన్నివేశాన్ని గుర్తుకు తెస్తుంది. “చూసిన కనులు పండుగ చూడని కనులు దండుగ” అనే గీతం నిజమేమో అనిపిస్తుంది.

మరో పద్యంలో ఓ రామా! నీవేనారాయణాడువయ్యా నీవంటి పరమ సద్గుణ దైవం వేరెవరు మరొకరు లేనేలేరయ్యా అంటూ వివరిస్తున్న ఈ పద్యాన్ని స్పృశిద్దాం శ్రీరాముని గుణగానము యొక్క ప్రాధాన్యతను రామచంద్రుని ఘనతను కవిగారి శతకంలో అడుగడుగునా దర్శించుకోవచ్చువీరి రామ భక్తి అపారము, అమేయము శ్రీరాముని చిత్తములో ఆసాంతము వారు లీనమైయున్నట్లుంటారు. కవిగారి రామభక్తి అనన్యమైనది.

కం.॥ నీవలె దయగల సద్గురు
నీవలెను పరోపకారి నిను గనజాలన్
నీవే నాకిల సాటియు
నీవే నారాయణుడవు నిజముగా రామా! (44) 49.

నీవంటి దయగల సద్గురు పరోపకారి నేనెక్కడ చూడలేదయ్యా, నీకు నీవే సాటి రామా! నీవు నిజంగా ఆ నారాయణుడవేనయ్యా అంటూ కీర్తించడం వీరి భక్తికి

నిదర్శనం."ఆనందో బ్రహ్మే దివ్య జానాత్, ఆనందాద్యేవ ఖల్విమాని భూతాని జాయంతే ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయంత్యభిషం విషంతీతి" అనే ఉపనిషత్తు వాక్యాలకు అనుగుణంగా అన్నింటికన్న ఆనందమే చాలా ముఖ్యమైనది. ఆయితే ఆ ఆనందం నాకు రామనామ స్మరణలోనే కనిపిస్తుంది .

కం॥ సంతోషమెయానందము
సంతోషమె సుఖమునిచ్చు సర్వజనులకున్
సంతోషమె గావలెనన
సంతతమును రామనామ స్మరణకు రామా! (64) 50.

పై పద్యం సంతోషం ఆనందాన్నిస్తుందని ఆ సంతోషమే సుఖాన్నిస్తుందని సర్వజనులకు సంతోషము కావాలంటే సదా రామానామ స్మరణ చేయడం వల్ల హృదయానందం కలుగుతుందని అందువల్ల స్వామీ, రామానామ స్మరణ వినా వేరే ఏ స్మరణ ఆనందాన్ని అందివ్వదని చక్కగా వివరించారు. శ్రీరామునిపై తనకు గల గట్టి నమ్మకాన్ని నిరూపిస్తు శ్రీమాన్ రామకరామశర్మ గారు తన భక్తి తత్వాన్ని ఈ క్రింది పద్యంలో చక్కగా వివరించారు.

కం॥ ఊఱక వేడెదు నాకో
తీఱిక లేదనుచు నీవు తీవ్రపడకు'మా
యాఱడిని దీర్పు రామా
వేఱెవ్వరు వెతల బాపు విబుధులు రామా! (68) 51.

ఎంత చక్కని సంభోదన కళ్ళ ముందు కనిపిస్తున్నట్లున్న దృశ్యమాలిక వలె ఎపుడు వేడుతు కనిపించే నేను మిమ్మల్ని విసిగిస్తున్నట్లు నీకనిపిస్తే తీరిక లేదనుచు ఇబ్బందులు పడకయ్యా ఓ శ్రీరామా! మా కష్టాలు తీర్పడానికి నీవు.....

తప్ప వేరె ఎవరు లేరయ్యా అంటూ వెతలుబాపే బుదులు మీరు గాక వేరే ఎవరు లేరు అంటూ తన నిక్కచ్చి తత్వాన్ని ఎంత చక్కగా నిరూపించారో చూసినట్లయితే కవిగారికి రాముని పై గల ధృడమైన అభిప్రాయాన్ని ఈ పద్యంలో మనం గమనింపవచ్చు. రాముడిని విభుదుడిగా నిరూపిస్తూ, శ్రీరామా! నీవంటి గొప్పవారు, గొప్పదైవం వేరే ఎవరు లేరయ్యా అంటూ తాను నమ్మిన సిద్ధాంతాన్ని చక్కగా వివరించడం జరిగింది.

శ్రీరామునిపై తనకు గల మమకారాన్ని ఎంత ఖచ్చితంగా తెలియజేస్తున్నాడో నిరూపించే ఈ పద్యం చూసినట్లయితే రామక రామ శర్మగారు ఎంత గాఢ భక్తి పరులో నిరూపితమవుతుంది.

కం॥ నీవే దయగలవాడవు
నీవే నాకమ్ము నాత్మ నిశ్చయ బుద్ధిన్
నీవే సర్వము రామా
రావే సాక్షాత్కరింప రయమున రామా! (77) 52.

స్వామీ దయగల దేవదేవుడవు నీవేనయ్యా" ఏ తీరుగ నను దయజూసెదవో యిన వంశోత్తమ రామా"...... అన్న కంచెర్ల గోపన్న రామదాసు గారి దీనాలాపన యిందులో ద్యోతకమవుతుంది. దయగలదేవుడు ఎవరయ్యా అంటే శ్రీరాముడు మాత్రమే అని ఓ ఖండితాభిప్రాయము ఒకటుంది. నా ఆత్మలో స్వర్గమిచ్చే దాతవు కూడా నీవేనని నమ్ముతూ నిశ్చయబుద్ధితో వున్నాను అంటారు కవిగారు. యింకా ఓ రామయ్యా నీవే నాకు సర్వస్వము అంటూ వినమ్రంగా అర్తిస్తున్న ఈ వైనం చూస్తే రామునిపై వారికి గల నమ్మకాన్ని గమనించవచ్చు.

రావే సాక్షాత్కరింప రయమున స్వామీ అంటూ రామునికి దగ్గరబంధువు వలె, అత్యంత ఆప్తమిత్రునివలె, శిష్యునివలె ఎంత హృదయ పూర్తిగా అర్థిస్తున్నాడో గమనించినట్లయితే వీరి భక్తి శ్లాఘనీయము గాకపోదు.

తనకు స్వామియందు గల అవ్యాజానురాగాలు, మమకార,ప్రేమాభిమానాలు ఒక త్యాగరాజువలె, రామదాసు వలె ఎంత చక్కగా ఈ క్రింది పద్యంలో గుప్పించాడో గమనించినట్లయితే ఈ కవిగారు నిజంగా ఆ కోవలోకి జెందినవారే అని అనక మానరు. ఆపద్యాన్ని ఒకసారి చూద్దాము.

కం॥ రామా యని నే బిలిచిన
నేమాత్రము బలుకవైతి నేమి దయాళూ !
స్వామీ నా తప్పేమీ
నా మీదను గినుక మాను న్యాయమె రామా.॥ (88) 53.

ఓ శ్రీరామా ! ఓ దయాళూ ! మా రామా అని ప్రేమతో, భక్తితో పిలిస్తే ఏ మాత్రం పలుకడం లేదు యిది మీకు న్యాయమా ! అంటూ ప్రశ్నించడం వీరి ప్రేమతత్వాన్ని అంతకు మించి భక్తి తత్వాన్ని కనిపింపజేస్తుంది. స్వామీ నావల్ల ఏమైనా తప్పు జరిగిందా అంటూ భక్తి నమ్రతతో స్వామిని నిలదీయడం చూస్తే వీరికి స్వామివారిపై ఎంత అధికారముందో అని అనిపిస్తుంది యింకా ఓ శ్రీరామచంద్రా! నామీద మీకు కోపంగా వుండడం న్యాయమేనా?అంటూ ప్రశ్నిస్తాడు యిలా ఈ శతకంలోని అన్ని పద్యాల్లో రామునితో సంభాషించడమే జరుగుతుంది. ఈ శతకాన్ని బ్రహ్మశ్రీ రామక రామశర్మగారికి శ్రీరామునికి మధ్య జరిగిన సంభాషణ అని చెప్పి కవిరామ

సంభాషణాశతకం అని పిలువవచ్చునేమో అని అనిపిస్తోంది.

మరోపద్యంలో స్వామి సర్వాంతర్యామి అని నమ్ముతూ ఆ నమ్మకాన్ని నిరూపిస్తూ ఓ శ్రీరామా ! ఆత్మారామా ! అన్నింటిలోనూ నీవే నిండియున్నావు గదయ్యా అని వారిని స్తుతించడం భక్తి సంపూర్ణతత్వాన్ని చాటుతూంది యీపద్యం వీక్షిద్దాం.

కం॥ ఆకారము సెప్పగరా
దాకారమె లేదు నీకు నది యెట్లన్నన్
యాకారమె జగమంతయు
నాకారములో నీ జ్ఞానమాత్మయె రామా । (92) 54.

పరబ్రహ్మ తత్వం వివరిస్తూ స్వామీ మీ ఆకారము ఇది అని చెప్పగలేము అన్నింటిలో ప్రపంచమంతా నిండియున్న మీ రామతత్వాన్ని మేమిలా భావిస్తున్నామంటూ ఎక్కడైతే జ్ఞానం వికసిస్తుంటుందో అక్కడ జ్ఞానరూపమే మీరై వెలుస్తున్నారని మా ప్రగాఢమైన నమ్మకం స్వామీ అంటూ ఎంత చక్కగా వివరించారో గమనించిన పిదప రామ భక్తి యింత సలక్షణమైనదా యింత విలక్షణమైనదా అని అనుకోక మానరెవరైనా అలా పాఠకుల మేధస్సుకు ఆలోచనా తరంగాలు సృష్టించగల గొప్ప శక్తిని ఈ కవిగారి కలమునుండి జాలువారినది అని చెప్పడం అతిశయోక్తి కాజాలదు. అలా కవిగారాబాల గోపాలాన్ని భక్తి సముద్రంలో ముంచి వేసి వారు ధన్యులవడమే కాకుండా అందరినీ ధన్యులను జేయడం జరిగింది.

అంతేకాదు నిరంతరము రామనామ స్మరణమే ధ్యేయంగా పెట్టుకున్న వీరు ఆ భక్తి పారవశ్యంలో మునిగి రామనామం వినా మరే శబ్ధం ఉచ్ఛరించాలని అనుకోవడం లేదని అనేక సందర్భాలలో వివరించడం జరిగింది. వారి అకుంఠిత భక్తి రామాయణ పారాయణ శక్తి వీరికి రామ సాక్షాత్కారం అందించియుండవచ్చు అంత గొప్ప భక్త బంధం వీరిది శ్రీరాముని ఆదర్శాలను తమ జీవితాదర్శాలుగా మార్చుకొని జీవితగమనం కొనసాగించారీ కవిగారు.

ఈ శతకంలో కవిగారికి గల అపార భక్తితత్వమును తెలియజేయడమే ఒక సదాశయంగా భావించారేమో అని అనిపిస్తోంది ఈ క్రింది పద్యంలోకి ప్రవేశిస్తే...

కం॥ రామా ! మది సెజ్జపయిన్
రామా ! పవళించవయ్య రాగమొలుక శ్రీ
రామా ! రమతో సతతము
రామా ! నామీద నెనరు రావలె రామా ॥ (96) 55.

రాముణ్ణి తనవాడుగా భావించి నిష్కల్మష హృదయంతో భక్తిప్రపత్తులు పరిమళించే విధంగా ఓ శ్రీరామా ! నా మనస్సు ఒక సెజ్జగా భావించి సీతాదేవితో సహా ఈ హృదయమనే సెజ్జపై పవళించి విశ్రమించండి. నామీద దయ అనే అనురాగవర్షాన్ని కురిపించండి స్వామీ నేను నీవాడిని అంటూ  ఎంత చక్కగా వేడుకుంటున్నాడో గ్రహిస్తే జాలు భక్తికి యింత గొప్ప శక్తి వుంటుందా అని అనిపిస్తూ ఉంటుంది.

మరొక పద్యంలో శ్రీరాముణ్ణి జనులందరి హృదయములను మేల్కొల్పుమయ్యా అంటూ ప్రార్థిస్తాడు. "లోకా ః స్సమస్తా ః సుఖినో భవంతు " అని అనిపించేవిధంగా కవిగారి అభిమానపూర్వక భక్త్యాక్రందన ఈ పద్యంలో మనం చూద్దాం.

కం॥ మేల్కొను దశరథ రామా !
మేల్కొనుమా సుగుణధామ మేఘశ్యామా !
మేల్కొనెను సర్వమేదిని
మేల్కొల్పుము హృదయములను మేలగు రామా ॥ (98) 56

స్వామీ మీకు మేలు కలుగుతుంది. మంగళం మహత్ అని అనేవిధంగా ఓ నీలమేఘశ్యామా!ఓ దశరథాత్మజా ! ఓ సుగుణధామా ! మేల్కోవయ్యా అంటూ అర్థిస్తూ మీరు మేల్కొనడమే కాదు సర్వ మేదిని మేల్కొంది జగమంతయూ మేల్కొంది వారి హృదయాలలో కరుణ, దయ, సత్యం, శాంతి, న్యాయం కల్సిపోయేటట్లుగా వారిని మేల్కొల్పండి. అంటూ కోరుకుంటారు.

శ్రీరామచంద్రునిపై గల తన నమ్మకాన్ని అపారమైన భక్తిని ఎంత చక్కగా ఆర్ద్రత కనిపించేవిధంగా ప్రేమతో ఆలాపించే ఈ పద్యం గమనిస్తే ఈపద్యంలో భక్తిలో యింత గొప్పతనం ఉంటుందా అని అనిపించక మానదు.

కం॥ శరణని వేడిత రామా
శరణాగత రక్షణంబు సలుపుము రామా
మరణంపు వేళలందున
కరుణించియు నీవు నాకు కనబడు రామా. (102) 57

ఓ రఘుకులేశా నిన్ను శరణంబీయమని ప్రాధేయపడుతున్నాను. శరణాగత రక్షకుడవనే సల్లక్షణంబు నీయందు యుందని నేను గాఢంగా నమ్ముతున్నానయ్యా ఓ రామయ్యా! కనీసం నేను మరణించేవేళలో నైనా కనిపించవయ్యాఒకసారి మీ శుభదర్శనభాగ్యం కలిగించి నన్ను ధన్యుణ్ణి జేయవయ్యా అంటూ ఎంత దీనంగా ప్రార్థిస్తున్నాడో వీక్షిస్తే ఎంత అకుంఠితదీక్ష రామునిపైన ఎంత భక్తి అని మనం ఆశ్చర్యపోక తప్పదు. శరణాగతి వైష్ణవభక్తి దీనినే ప్రపన్నత అంటారు.

ఆ వెంటనే మరో పద్యంలో సాక్షాత్తు ఆ శ్రీరామచంద్రునితోనే వాదానికి దిగుతాడు ఆ సంవాదన వింటూంటే ఔరా ! రామునిపై ఈ కవిగారికి ఎంత అధికారము హక్కు ఉందయ్యా అని ఆశ్యర్యపోవడం పాఠకులవంతవుతుంది. ఓసారి ఆపద్య సౌందర్యాన్ని దర్శిద్దామా...

కం॥ కోదండ రామ యనుచును
నీదండను జేరి బిలువ నీదయ రాదా
మోదంబున మాటాడుము
ఖేదంబు నడంప జేయు కృపతో రామా.. (113) 58.

ఓ స్వామీ ! ( ప్రేమతో ) ఓ సాకేతరామా ! ఓ కోదండరామా ! నీ దయనాశించి మీ చెంత చేరాను రావయ్యా ! రామయ్యా ! శరణంటినయ్యా ! కాపాడవయ్యా ! అంటూ ఎంత ప్రార్థించినా నా మొర వినడం లేదు అంటూ ఓ స్వామీ మోదంతో మాట్లాడండీ నాలోని దుఃఖాన్ని, ఖేదాన్ని పారద్రోలండి అంటూ ఎంత హృదయార్ద్రతతో ప్రార్థిస్తున్నాడో ఈ పద్యంలో మనం గమనింపవచ్చు వాస్తవంగా వీరికి రాముడు బంధువే అని అనేవధంగా ఆ సంభాషణ ఆ స్తుతి ఆ మోద ఖేదాల సంభాషణ అవన్నీను సందర్భోచితమైన ఆవేదనాత్మక రోదనాగీతాలే అనడంలో సందేహం ఏ మాత్రం లేదని ఈ పద్యం విన్నవారెవరైనా అంటారు.

ఆ శ్రీరామచంద్రుని కృపా కరుణా కటాక్షవీక్షణాలకై కవిగారు అనునిత్యం రామనామ పారాయణాది నిరంతర రామనామ చింతన వంటి సత్కార్యక్రమాలు ఆచరిస్తూనే వుండేవారు.కోదండము–నీదండ– కవిసాభిప్రాయము ప్రయోగము స్వామీ నీభుజాన ఎప్పుడూ ధనుస్సు వుంటుంది అది నీ 'దండ' జేరినవారికి అభయమీయమని కోరడమే మాకు దండ– అండ– నీకోదండము ఎంతచక్కటి ప్రయోగములను కవిగారుచేస్తున్నారో అవగతమవుతుంది.

ఓ స్వామీ! ఆది, మధ్య, అంతం అనేవి ఏవి లేవు. బ్రహ్మాండం అంతా నీవే స్వామీ! సర్వ వ్యాపకులు మీరే అయినపుడు ఏ గోత్రము, ఏ సూత్రము లేనట్టి సప్త గుణములను నాకందించు స్వామీ అంటూ చక్కగా కందంలో ఎలా వాంఛిస్తున్నాడో చూద్దాం ఈ పద్యంలో కవిగారు రామునికి వారికి సంబంధ బాంధవ్యములున్నట్లు చిత్రీకరించడం గొప్పవిశేషం. రాము ని దర్శనానికి రాముని దీవెనలకై రాముడిచ్చే మోక్షానుగ్రహానికై వేచి చూచే నిజమైన భక్తులు వీరని నిరూపించారు.

కం॥ ఆదియు మధ్యమనంతము
లేదు సదా నీకు దలప లేవంగము లే
దేదీ సూత్రము గోత్రము
యేదనరానట్టి సత్వమీవోరామా! (114) 59

స్వామి సర్వాంతర్యామి తత్వాన్ని ఎంత చక్కగా వివరించినారో ఈ కవిగారు పై పద్యంలో మనం చూడవచ్చు. సత్వము అనే గుణము సర్వ శ్రేష్టము అయినది. అటువంటి సత్వ గుణముగలవారు సమాజంలో సర్వోన్నతులు కాగలుగుతారు. అటువంటి వారివల్లనే ధర్మం సంరక్షింప బడుతున్నదిస్వామీ త్రిగుణాలలో 'సత్యము' నీవు త్రిమూర్తులలో ఒకరైన విష్ణువుమీరు త్రిమూర్త్యాతీతమైన చిద్రూపము నీవు అనేపదాలు వరుసగా భగవత్తత్వాన్ని ప్రతిపాదిస్తున్నాయి.

స్వామి చిద్రూపా! ఆనంద రూప! నీలమేఘశ్యామ! ఓ శ్రీరామా! ఆహ్లాదము చిందించే రూపంతో సాక్షాత్కరించే ఓ శ్రీరామయ్య మీ ఆ సద్రూపంతోనే నా హృదయమనే మందిరంలో కొలువై యుండలయ్యా అంటూ దీనంగా ప్రార్థించిన విధానాన్ని గమనిస్తే....

కం॥ భద్రమ్ముగా సర్వమ్మున
సద్రూపుడవై వెలుంగు స్వామివి నీవో
చిద్రూపా నా హృదయము
త్వద్రూపము నిలుపగోరె దశరథరామా! (118) 60

ఓ స్వామీ! నా హృదయమనే మందిరంలో శాశ్వతంగా కొలువై నిలిచి సదా మీ కరుణాకటాక్ష వీక్షణములతో నన్ను కాపాడి ధన్యుణ్ని చేయవయ్యా అంటూ ఓ దశరథరామా మర్యాద పురుషోత్తమా! కోదండరామా! భక్తుడినయినా నన్ను కరుణించి కాపాడే భాద్యతా మీదేనండి అంటూ ప్రార్థించే వైనం వీక్షిస్తే భక్తుడికి, స్వామికి మధ్యగల అన్యోనతను ఆ ప్రేమ బంధాన్ని చక్కగా విన్నవించడం కవిగారి భక్తి తత్వాన్ని తెలుపకనే తెలియజేస్తుందని చెప్పవచ్చు. ఇలా ఏ పద్నాన్ని స్పర్శించినా ఏ పద్యాన్ని రాగాలపంగా చదివినా శ్రీ రామా నామా మహాత్మ్య సుమధుర భక్తి ప్రకటితమవుతు కవిగారి గొప్ప కవితా లక్షణములను ఆధ్యాత్మిక చింతనను, అపరిమితానంద రామభక్తిని తెలియజేస్తుంది. తద్వారా సమాజమంతటిని ఆధ్యాత్మిక చింతనలో చేర్చుటకు సిద్ధహస్తుడై, కంకణధారుడై, కవిగా, తాత్వికునిగా, భక్తునిగా, మార్గదర్శిగా ఒక ఆదర్శ మూర్తిగా నిలిచి గ్రామములోనే వారికి కాకుండా సమీప గ్రామములోని యావద్భక్తులకు ఒక

ముఖ్య సంధాన కర్తగా నిలిచి ఉన్నాడు అని చెప్పడంలో అతిశయోక్తి ఏ మాత్రము లేదు.

సాకేత సార్వభౌముడైన సీతాపతి శ్రీరామచంద్రుని ఆదరాభిమానాన్ని చూరగొనిన వారిని గుర్తుకు చేస్తూ వారు ధన్యజీవులయినారని వారి అదృష్టాన్ని పొగడుతూ అటువంటి సౌభాగ్యం తనకు కూడా కలిగించవయ్యా అంటూ వేడుకుంటున్న సన్నివేశం గల ఈ పద్యాన్ని స్పృశిద్దామా ఒకసారి.

కం॥ శబరివలె ఫలములిచ్చిన
యబలతొగాని మాటలాడవ యేమో
శబరిగనో యబలగనో
సొబగున జన్మించనయితి సుందర రామా! (120) 61.

భక్త శబరి యెంగిలి ఫలములు రుచిగా ఉన్నావో లేవో అనే వంకతో ఫలములు తాను తిని నీకు ఇవ్వగా ఆనందంగా ఆరగించినారు. ఆ భక్త శబరి యొక్క జన్మను ధన్యము చేశారు గదా స్వామి. ఆమె అబల కావున అబలలనే మీరు అనుగ్రహిస్తారని నేను భావించాల రామచంద్రా! ఓ భగవంతా నేను యే శబరిగనో లేదా యే అబలగానో జన్మించినట్లయితే బాగుండేది కదా నన్ను కూడా మీరు కరుణించేవారు అయి ఉందురు కదా! అని తన జన్మకు తనకుతాను ఇలా నిందించుకున్న వైనంతో కవిగారి భక్తి చింతనను రామునియందు గల ఆదరాభిమానములను మనం గమనించవచ్చు.

అదే విధంగా మరో పద్యంలో కవిగారు స్వామి అనుగ్రహించిన కొందరు భక్త పుంగవులను స్మరిస్తు నాకెందుకు అలాంటి కరుణ ప్రసాదించలేకపోయావయ్యా అంటూ ప్రార్థించిన ఈ పద్యాన్ని ఆలోకిద్దాం ఒకసారి.

కం॥ భక్తులలో ప్రహ్లాదుడు
ముక్తులలో పక్షిరాజు ముజ్జగములలో
భక్తులు ముక్తులనేకులు
ముక్తులలో నన్నుజేర్చు మునినుత రామా! (121) 62

భక్తులలో ప్రహ్లాదుడే భక్తాగ్రగణ్యుడు ముక్తి నొందినవారిలో పక్షిరాజు జఠాయువు అధికుడు ఈ మూడు లోకాల్లో మీ వల్ల ముక్తినందిన వారల సంఖ్య అనేకం. మీ దయతో అందరికి ముక్తిని ప్రసాదించారు. ఆ అందరిలో నన్ను కూడా చేర్చండి ఓ రామాచంద్రా! మీ కరుణ వల్లనే కదా ఆంజనేయుడు సంజీవని ప్రధానం చేసి మీ అనుజుడైన లక్ష్మణున్ని బ్రతికించగలిగాడు. మీ దయవల్లనే గదా లోకకంఠకుడైన వాలిని హతమార్చి సుగ్రీవుడు వానర రాజైనాడు. మీ కరుణాకటాక్షాల వల్లనే కదా

శత్రు రాజైన లంకాధిపతియైన సోదరుడు విభీషణుడు ధర్మ సంస్థాపనకై రావణావధానంతరం తిరిగి లంకాధిపత్యాన్ని చేపట్ట గలిగాడు. అంతెందుకు స్వామీ! మీ దయను పొందని ప్రాణికోటి యేదీలేదు. కావున అందులో నన్నుకూడా చేర్చుకొని నా జన్మకు కృతార్థత చేకూర్చండి అని వేడుకున్నాడు.

రామక రామ శర్మగారు తాను కవియై శ్రోతగా, మరొకమారు ప్రాశ్నికుడుగా మరొకమారు సంభాషణ కావించే తనవాడుగా తన రాముణ్ణి భావించుకొని తన శతక రచన గావించాడు అనడానికి నిదర్శనాలు ఈ పద్య సుమాలు. అందులో ఒకటి ఈ క్రింద పరిశీలిద్దామా.....

కం॥ ఎప్పుడు నన్నెటు దలచిన
దప్పక ఘన మోహమాయ చాటింతు నటం
జొప్పగ జెప్పితి గీతను
నిప్పుడు దరియింపజేయవే శ్రీరామా. (125) 63.

ఓ ప్రభూ! ఈశ్వరా! ఓ శ్రీరామాచంద్రా! కృష్ణావతారంలో భగవద్గీతలో శ్రీ భగవాన్ ఉవాచ....

శ్లో॥ సర్వధర్మాన్ పరత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వ పాపేభ్యో మోక్ష యిశ్యామి మాషుచ॥ (19) 64.

ఓ ప్రభూ! శ్రీకృష్ణావతారంలో మీరు చెప్పిన ఈ శ్లోకార్థాన్ని నేనిలా అనునయించు కుంటున్నాను. భక్తులారా! నాయందు యెవరయితే మనసు లగ్నం చేసి నన్నే సర్వస్వంగా భావించి ప్రార్థిస్తారో అలాంటి వారికి మాయ, మోహం, సంసార సాగరం వంటి బంధాల నుండి కాపాడి మోక్షాన్ని ప్రసాదిస్తానని తమరే చెప్పారు కదా! మరి మీరేలా నాకు మోక్షమందించలేక పోతున్నారు అని సాక్షాత్తు స్వామి వారినే ప్రశ్నిస్తూ ముకుళిత హస్తాలతో ప్రణమిల్లుతూ స్వామి కృపకై అర్థించే విధానం గమనిస్తే నిజంగా ఈ కవి ఎంత ధన్యజీవి ఎంత పరమ భక్తుడు అని అనుకోక తప్పదు.

స్వామిని తనకు దర్శించే కన్నులు ప్రసాదించమని ఎంత చక్కగా వినయంతో దీనంగా భక్తి ప్రపత్తులతో వేడుకుంటున్నాడో ఈ పద్యంలో మనం చూడవచ్చు

కం॥ నినునెపుడు దలచు మనమున
నిను గాంచెడి కనులు నాకు నీవెనొసగుమా
నను భక్తకోటి జేర్చగా
నిను స్వర్గమయుని జూపు నిజముగ రామా! (120) 65.

స్వామీ ఓ దాశరథీ! నాకు నిన్ను మాత్రమే తలచే మనసును నిన్ను మాత్రమే చూచే కన్నులకు ప్రసాదించవయ్యా అంటూ ఆరాధ్యదైవమైన తన రామచంద్రున్ని తనకుగా కోరుకుంటున్నాడు. భక్తకోటిలో నన్ను ఒక్కడిగా చేర్చుకొనే బాధ్యత కూడా మీరే స్వీకరించండి.

ఎందుకొరకంటే మీరే సర్వవ్యాపకులుగదా మీ సర్వమయ తత్వాన్ని మీరే నిరూపించుకోండి నేనడిగిన విధంగా నాకు మంచికన్నులను మంచి హృదయాన్ని మీ చింతనకు మీ దర్శనానికి ప్రసాదించండి స్వామీ అంటూ యెంత వినయంగా వేడుకుంటున్నారో చూడండి. తత్ఫలితంగా మీకు సర్వవ్యాపకులని గుర్తింపువస్తుంది. ఓ రామా నాకొరకు కాకున్నా మీకొరకైనా యిది జరిగేలా చూడండి స్వామీ అని ఎంత అమాయకంగా ప్రశ్నిస్తున్నాడో చూడండి.

తాను నమ్మిన సిద్ధాంత ఖచ్చితత్వాన్ని కవిగారు ఎంత చక్కగా వివరిస్తున్నాడో గమనిస్తే వారికి శ్రీరామునిపైన ఎంత అధికారమున్నదో మనం గ్రహించవచ్చు.

కం॥ చచ్చిన వానికి మోక్షము
నిచ్చిన నీకేమి లాభమిపుడుండగ నే
వచ్చియు దర్శన మిచ్చియు
ముచ్చట లాడుటయె నాకు మోక్షము రామా॥ (224) 66.

ఓ రాఘవేంద్రా ! కోదండపతీ ! మరణించిన వారికి మోక్షం ప్రసాదించడంలో గొప్ప యేదీ లేదు పైగా మీకే లాభం యుండదు. నేను జీవించి యుండగనే వచ్చి మీ దర్శనభాగ్యం మాకు కల్గించి నాతో ముచ్చటాడడమే నాకు మోక్షం ప్రసాదించినంత భాగ్యంగా భావిస్తానని అదే నాకు నిజమైన మోక్షం అని ఎంత ధైర్యంతో తన కావ్యనాయకుడైన శ్రీరాముణ్ని తాను కోరుతున్నాడు. స్వామికి కవికి మధ్యగల సంబంధ బాంధవ్యాన్ని నిరూపిస్తున్నాడో గమనించండి.

స్వామీ నేను మీనుండి యిది ఆశిస్తున్నాను నా యీ కోరికను మన్నించండి నా యీ యీప్సితము నెరవేర్చండి అని తనదైన బాణీలో ఆ శ్రీరాముణ్ణి తన శతకపద్యంలో కోరుతున్న ఈ వైనం చూస్తూంటే శ్రీరామభక్తి అనే విషయంలో కవిగారు ఎంతగా మునిగిపోయారో మనకు అర్థమవుతుంది.

కం ॥ రామా ! నా హృదయములో
రామా ! జానకిని గూడి రామానుజుతో
రామా ! దర్శనమిచ్చుచు
నామాట వినెదవనుచు నమ్మితి రామా ॥ (22) 67.

శ్రీరామచంద్రప్రభూ నా హృదయంలో సీతామాతతో సహా మీరు లక్ష్మణస్వామి వారు కల్సి శుభదర్శనం కలిగించండి స్వామీ అంటూ వీరు రామానుజుడు చక్కని శ్లేషను ప్రయోగించారు. విశిష్టాద్వైత సిద్ధాంతకర్త రామానుజులు, మరోఅర్థంలో లక్ష్మణుడు అని, ఆ శ్రీరామచంద్ర మూర్తిని తన స్వామిగా భావించి, తనవాడైన తన స్వామిలో నా నమ్మకాన్ని వమ్ముచేయకుండా

నా హృదయంలో సీతాసమేతంగా కొలువుండమని ప్రార్థించే సన్నివేశమే యీపద్యం చూపిస్తూవుంది.

మిమ్మల్ని నమ్ముతున్నాను స్వామీ అంటూ ఆ శ్రీరాముణ్ణి తన స్వామిగా భావించి తనవాడైన తన స్వామితో నా నమ్మకాన్ని వమ్ముచేయకండి స్వామీ అంటూ దీనంగా ప్రార్థించే ఈ సన్నివేశం ఈపద్యంలో చూసినట్లయితే సీతారాములపైన తనకుగల ప్రేమ ఎంతగొప్పదో సీతారాములతో పాటుగా లక్ష్మణస్వామి కూడా కలిపి ముగ్గిరి దర్శనం తన హృదయకమలంలో కావాలని కోరుకోవడం భక్తుడు భగవంతునికి గల దగ్గరి సంబంధబాంధవ్యాన్ని నిరూపిస్తున్నది యిది కవిగారికి స్వామివారికి గల అవినాభావసంబంధం అని మనం యీ పద్యంద్వారా తెలుసుకోగలిగాము.

కవిగారి తాత్వికచింతన, తాత్వికభావన యీపద్యంలో మనం స్పృశించవచ్చు. వారి ఆలోచనాతరంగాలు ఆలోచనల సవ్వడులు యీపద్యంద్వారా పాఠకలోకానికి అందించడం వారికిగల భక్త్యానురాగాలు ప్రస్ఫుటం చేస్తున్నాయి.

కం॥ మనసే జ్యోతిర్మయమని
మనసును గను బొమలనడుమ మణిగాజూడన్
మనసే బ్రహ్మమటంచును
మనసును నిలుపుటయె బ్రహ్మమార్గము రామా.. ॥ (123) 68

ఓ సీతాపతీ మనసే ఒక జ్యోతిర్మయ స్వరూపము. రెండుకళ్ళమధ్యంలో భ్రూమధ్యస్థానంలో మనోవాహిని భావించవచ్చు. మనసే బ్రహ్మమని మనసును ఏకస్థితిలో నిలుపుటయే బ్రహ్మమార్గమని యిది వాస్తవమని పాఠకులకు ఎంతచక్కగా వివరిస్తున్నాడో ఈ పద్యంలో తెలుసుకోవచ్చు. ఏకసంథాగ్రాహితత్వము, మనోనిశ్చయము బ్రహ్మమార్గమును దర్శించడమేనని వాస్తవవిషయాలు కళ్ళకుకట్టినట్లుగా ఈపద్యంద్వారా ఈపద్యంద్వారా చూపించడం జరిగింది.

తనకు స్వామియందుగల అవ్యాజానురాగమైన భక్తిపారవశ్యతను ఎంతచక్కని పోలికతో చూపదలిచినాడో ఈపద్యంద్వారా పాఠకలోకాన్ని ఆనందలోకంలో ముంచగలిగినాడని యీ క్రిందిపద్యంద్వారా చెప్పవచ్చు.

కం॥ మనమును నిలుపుటకై యే
మనుజునకును దరముగాదు మహిలోపల స
ద్ధానమౌ నీ పద సరసిజ
మున నామనము నిలుపుమో రఘురామా॥ (27) 72.

ఈ భూమిపైనే ఏక ధ్యానము, తదేక చిత్తము సాధ్యం కావని ఒక విషయమునందే మనోలగ్నం చేయడం ఎవరికి సాధ్యపడదని చెబుతూనే ఓ స్వామి! నా మనస్సు మాత్రము మీ యొక్క ఘనమైన పాదసరోరుహములయందు నా చిత్తాన్ని నిలుపవయ్యా అంటూ ఎంతో భక్తితో స్వామిని అర్తిస్తున్నాడో మనకు తెలుస్తుంది. నా చిత్తాన్ని మీ పాదపద్మములయందు నిలిపి వుంచే భారం మీదేనని ఎంత చక్కగా అర్పిస్తున్నాడో మనమీ పద్యంలో చూస్తున్నాము. మానవుడికి సాధ్యం కాదని దైవానికి మాత్రమే సాధ్యమవుతుందని అది మీ ఒక్కరికి సుసాధ్యమైందని రామభక్తి చింతనలో నిండియున్న కవిగారు భక్తి పరవషాన్ని హనుమయందు ప్రేరేపిస్తూ, హనుమంతుని రామభక్తి తత్వాన్ని పాఠక లోకానికి అందింపజేయాలని తహతహ లాడడం ఈ కవిగారికి మాత్రమే సాధ్యమవుతుంది.

కవిగారు స్వామివారిని అనేకవిధాలుగా స్తుతిస్తూ స్వామివారి దశావతార వర్ణనలు స్ఫురణకు తెస్తూ స్వామీ నిన్ను ఏరూపుతో కొలువగలను అని నే భావించడంలేదు బహురూపాల్లో మిమ్ములను కొలవడం అనేది నాకు నిత్యకృత్యమైపోయిందని వాస్తవవిషయాలను చక్కగా పద్యంలో వివరించడం జరిగింది స్వామిని ప్రసన్నం చేసుకునే మార్గాన్వేషణలో భాగంగా కవిగారు పరమ భక్తితో చెప్పిన ఆపద్యమే యిది.

కవిగారు స్వామివారిని అనేకవిధాలుగా స్తుతిస్తూ స్వామివారి దశావతార వర్ణనలు స్ఫురణకు తెస్తూ స్వామీ నిన్ను ఏరూపుతో కొలువగలను అని నే భావించడంలేదు బహురూపాల్లో మిమ్ములను కొలవడం అనేది నాకు నిత్యకృత్యమైపోయిందని వాస్తవవిషయాలను చక్కగా పద్యంలో వివరించడం జరిగింది ఆపద్యమే యిది.

ఉ॥ రూపము నామము ల్దలప రూఢిగ నీకవి లీలగాని యే
రూపములేని నీవు బహురూపులు నామములుం ధరించుచున్
బాపము పుణ్యమున్ ద్వివిధ భాజక కర్మములన్ సృజించి నీ
వే పరమాత్మవై భువినహీనపు వింతల సేతు రాఘవా ॥(28) 73.

ఓ స్వామీ నీ రూపములు గానీ నీ నామములు గానీ నేను తలవలేను ఎందుకంటే నీకవి లేవుగాన మిమ్ము అనేక రూపములలో పిలుస్తూ,స్తుతిస్తూ, కీర్తిస్తున్నాను. పాపము, పుణ్యము అని రెండు విధాల విభజన నీవే చేశావుగదా నీవే పరమాత్మవై వెలిసినావు

గదా భువిపైన హీనము, అహీనము అనే వర్గాలుగా విభజించి మీరే సత్యాన్ని ధర్మాన్ని నిలిపినారు కదా "నామరూపాత్మకమైనది ప్రపంచము, రహితమైనది ఆత్మ – అదే పరమాత్మ "సృష్టి" నీ లీల పాపపుణ్యములు జీవులకు – "జీవుడు నీవే – దైవమునీవే" మూలమునీవని తాత్పర్యము.

కవిగారికి నిర్మలమైన భక్తిపరమైన ఆలోచనా తరంగాలకు అద్దంపట్టేవిధంగా బ్రహ్మసత్యం అనే విషయాలలో సందిగ్ధతలను వివరిస్తూ యీపద్యంలో తన భావనలను వివరిస్తూ..........

74ఉ॥ దేహమునందు నాత్మయును దివ్యపదార్థము వెట్టిపంపి వ్యా
మోహము కిట్లు జిక్కునటు బోడిమి జూపితివీవె కాదె యా
యూహదొలంగగా జగమిదొక్కటి మిథ్యయు బ్రహ్మ సత్యమం
చూహదొలంగ బ్రోవుము విశుద్ధము గానిహమందు రాఘవా.॥(139)

దేహములో ఆత్మఅనే దివ్యపదార్థము దానిపైన వ్యామోహమును చిక్కేవిధంగా మీరే సృష్టించారు. జగమంతా మిథ్యయని బ్రహ్మ సత్యమని చూపినారు యిది వాస్తవమే గదా అందుకే మమ్మల్ని సాకే బాధ్యత మీపైనే యుందిగదా అని స్వామికి వివరిస్తూ ఓ రాఘవా మాకీవూహ తొలగజేయవయ్యా ఓ రామచంద్రా మమ్మందరిని కాపాడే బాధ్యత మీదేగదా ఓ శరణాగతవత్సలా ఓ దీనదయాళూ పాహిమాం అంటూ స్తుతిస్తూ యిహమందు మానవలోకంలో మమ్మందరిని కాపాడేది నీవేగదా అని ఏ నమ్మియున్నానయ్యా అంటూ స్వామికి విన్నవించి మమ్మందరిని కాపాడే బాధ్యత మీదేగదా ఓ శరణాగతవత్సలా ఓ దీనదయాళూ పాహిమాం అంటూ స్తుతిస్తూ "బ్రహ్మ సత్యం – జగన్మిథ్య" ఆదిశంకరుల సిద్ధాంతానికి వ్యాఖ్యానమీ పద్యం అని చెప్పవచ్చు.

నిరంతరం స్వామి నామపారాయణం చేసే గుణమును ఒక యోగముగా తలపోసి యున్నానని దర్శనభాగ్యం కలుగజేసి మోక్షంప్రసాదించాలని సమస్తలోకాలను సంరక్షించాలని ప్రార్థిస్తూ తన ధార్మిక చింతనను భక్తితో తెలియజేశారు. పరలోకచింతన అనే సుగుణం వుండడంవల్లనే యిటువంటి భక్తికావ్యములు వ్రాసే ఆలోచనలు కలుగుతూంటాయని కవిగారి భావన అందుకనుకూలంగానే అనేక భక్తి ముక్తక కావ్యాలు యీ పాఠరలోకానికి వారు అందజేయగలిగారు యిది వారి జన్మసార్థక్యంగా భావించినారు.

ఓ రాఘవా లోకాలను సంరక్షించడానికి మేలుకోవయ్యా అంటూ సవినయంగా ప్రార్థిస్తూ జగత్ సంరక్షణాభారం మీపైననే యుందని వివరిస్తూ స్వామిని స్తుతించిన

యీ పద్యమందారాన్నియొకసారి పరిశీలిద్దాము.

ఉ॥ రాఘవ మేలుకో జనక రాజ తనూభవ తోడ వేగమే
రాఘవమేలుకో సకలరాజులు, పౌరులు వేచియుందురో
రాఘవమేలుకో దయను రాజ్యము పాలన సేయగావలెన్
రాఘవమేలుకో నిరపదాధుల సాధుల బ్రోవ రాఘవా ..॥ 75

రా.రా.సం.అ.(133)

ఓ రామయ్యా మేలుకో జనకరాజ తనూభవ అయిన సీతామాతతో సహా వేగమే మేలుకోసకల రాజులు పౌరులు పౌరవనితలు మీ దర్శనార్థమై వేచియున్నారయ్యా మేలుకో ఓ రామచంద్రా మేలుకో సకల రాజులను ప్రజలను దయతో రాజ్యాన్ని పాల్చిడానికి మేలుకోవయ్యా అని ప్రార్థిస్తూ నిరపరాధులను సాధులను కాపాడే బాధ్యత మీదే అని వినమ్రంగా ప్రార్థించడం ముదావహం సీతామాతతో కలిసి ములుకొని ప్రజలందరిని కాపాడటానికి కరుణ, దయ అనే గుణాలు పెంపొందేవిధంగా సొంపగు రీతిలో లోక కళ్యాణార్థమే మేలుకొండి అని కీర్తించడం కవిగారి భక్తితత్వానికి ధీశక్తికి యిదో తార్కాణం అని కచ్చితంగా భావించవచ్చు.

సవినయంగా ప్రార్థిస్తూ జగత్ సంరక్షణాభారం మీపైననే యుందని వివరిస్తూ స్వామిని స్తుతించిన యీ పద్యమందారాన్నియొకసారి పరిశీలిద్దాము.

ఉ॥ రాఘవ మేలుకో జనక రాజ తనూభవ తోడ వేగమే
రాఘవమేలుకో సకలరాజులు, పౌరులు వేచియుందురో
రాఘవమేలుకో దయను రాజ్యము పాలన సేయగావలెన్
రాఘవమేలుకో నిరపదాధుల సాధుల బ్రోవ రాఘవా ..॥ 76.

రా.రా.సం.అ.(138)

ఓ రామయ్యా మేలుకో జనకరాజ తనూభవ అయిన సీతామాతతో సహా వేగమే మేలుకోసకల రాజులు పౌరులు పౌరవనితలు మీ దర్శనార్థమై వేచియున్నారయ్యా మేలుకో ఓ రామచంద్రా మేలుకో సకల రాజులను ప్రజలను దయతో రాజ్యాన్ని పాలించడానికి మేలుకోవయ్యా అని ప్రార్థిస్తూ నిరపరాధులను సాధులను కాపాడే బాధ్యత మీదే అని వినమ్రంగా ప్రార్థించడం ముదావహం సీతామాతతో కలిసి ప్రజలందరిని కాపాడటానికి కరుణ, దయ అనే గుణాలు పెంపొందేవిధంగా సొంపగు రీతిలో లోక కళ్యాణార్థమే మేలుకొండి అని కీర్తించడం కవిగారియొక్క నిశ్చలభక్తికి, భక్తితత్వానికి ధీశక్తికి యిదో తార్కాణంగా భావించవచ్చు.

"కౌసల్యా సుప్రజా" -- అనే శ్లోకభావనమీద పెంచిన మరో ఉత్కృష్టమైన భావన యిది. ఇక్కడ సీతాపతియైన రాముని, రఘురాముని, అయోధ్యారాముని, ధర్మ సంరక్షకుడైన శ్రీరాముని మేల్కొల్పుట – అనికవిగారి భావన.

తాను దీనుడనని తనరక్షణభారం స్వామిదేనని ఓ స్వామీ గతంలో తమరు ఎంతోమంది దీనులను కాపాడిన సంఘటనలు ఎన్నోవున్నాయి. అందులో నన్నొక దీనునిగా భావించి యిహలోకంలో నాకేకష్టాలు లేకుండా చూస్తూ అంత్యకాలంలో మోక్షప్రదానం చేయండి అంటూ ప్రార్థిస్తూ చెపుతున్న పద్యమిది కవిగారికి శ్రీరామ చంద్రునిపై గాడమైన మమతానురాగాలు నిండియున్నాయి మనసా, వాచా, కర్మణా శ్రీరాముని పాదద్వయమందే మనోలగ్నం చేసి శ్రీరామచంద్రులను కలియుగంలోని మానవులు పడేబాధలు తొలగజేయాలనే ఉద్దేశంతో అడుగడుగునా రాముడిని స్తుతిస్తూ, కీర్తిస్తూ శ్రీరాముని గుణవైభవమును గానంచేస్తూ అనేకపద్యములలో రాముని శ్రేష్టత్వాన్ని చాటిచెప్పారు.

ఉ॥ దీనులలెల్ల బ్రోచుటకు దిక్కొరులెవ్వరు నీవె ధాత్రిలో
దీనులలెక్క నీకెరుక దీనులు నుండెడు చోటెరింగి, యా
దీనులనెల్ల గాచుటకు దీనదయాళుడ వైతివయ్య, యా
దీనుల లోన నేను గడుదీనుడ కావగ రమ్ము రాఘవా॥ (139)77.

దీనులనందరిని కాపాడే ధర్మం మీదేనని మీరే ఈ లోకంలోని దీనులను లెక్కించి వారుండే చోటుదెలుసుకుని వారిని కాపాడుతూ దీనదయాళుడ వైనారని అటువంటి దీనులలో నన్ను కడుదీనుడిగా భావించి కాపాడాలని ఆ బాధ్యత మీదే నని తన ఇష్టదైవంతో మొర పెట్టుకుంటున్నారీ కవివరేణ్యులు. నిష్కల్మషమైన భక్తి భావనను ప్రకటిస్తూ బ్రహ్మశ్రీ రామక రామశర్మగారు సాహితీలోకంలో అందనంత ఎత్తుకు ఎదిగినారని భావింపవచ్చు.

ఓ స్వామీ మీ చరిత్రను లెక్కించడానికి యెంతటి విజ్ఞులు ఐనా సరా ? సరిపోరు అంటూ మీ సేవకులపై ఆరడిపెట్టడం భావ్యము గాదని వివరిస్తూ నా యిలవేల్పువైన ఓ రామచంద్రా మీ పాదదాసులమైన మేము మిమ్మర్థిస్తున్నామయ్యా అంటూ ప్రార్థిస్తున్న యీ పద్యరాజాన్ని ఒక సారి పరిశీలిద్దాం.

ఉ॥ ఎన్నగ లేరు నీ చరిత మెంతటి విజ్ఞులు నైనగాని యో
పన్నగశాయి యో పతిత పావన నాకిలవేల్పు నీవయం
చెన్నియొ రీతులన్ సతము నిత్తఱి సత్తువ మీర బిల్తు నో
యన్న త్వదంఘ్రి సేవకుల నారడి బెట్టకుమయ్య రాఘవా॥(141)78.

ఓ స్వామీ! ఓపన్నగశాయీ! ఓ రమాపతీ! ఓ పతితపావనా ! మీరే నాకిలవేల్పు నా అభిమానదైవం నా యిష్టదైవం మీరే అని ఎన్నోమార్లు మిమ్ములను కీర్తించినాను మిమ్ము యెంతగానో ప్రార్థిస్తున్నాను కాబట్టి రాఘవా నన్ను కాపాడవయ్యా అంటూ వేడుకోవడం వారి భక్తి అచంచల విశ్వాసానికి ఓ నిదర్శనము.

ఓ స్వామీ నాకు దైవములయందెన్నటికి యెలాంటి భేదభావం లేదు హరిహర, ద్వైతాద్వైత భేదాలు లేవు అని నిర్దుష్టంగా చక్కగా పద్యంలో వివరించారు ఆపద్యాన్ని ఒకసారి భక్తితో ప్రేమతో పరిశీలిద్దాము.

ఉ॥ పంకజ గర్భుడన్న నిల పార్వతి నాథుడుయన్న నాకు నే
శంకయు లేదు లౌకిక విచారమునన్ దరిజేర రాదు నా
టంకము లెల్ల బాపు కపప్రద నొల్లగ లేను నేను నీ
కింకరుడన్ నుతించెదను కీర్తినొకించుక గోర రాఘవా.॥(145)79.

బ్రహ్మ మహేశ్వరుడు యిరువురు వేరే అనే శంక నాకు లేదు ఓ రమాపతీ! నాకే లౌకిక విచారము లేదు నా కష్టాలనెల్ల బాపేవాడివి నావేనని నమ్మాను నేను నీ కింకరుడను అని తెలియజేస్తూ మిమ్ము కీర్తిస్తున్నాను.

పాహిమాం రాఘవా నేనే కీర్తిని ఆశించడం లేదు నేనే ఖ్యాతిని కోరడంలేదు నాకే శంకయులేదు దైవంబెవ్వడు యైన నాకే చింతయూ లేదు స్వామీ మిమ్ము ప్రార్థిస్తున్నాను మీరు మా ప్రార్థనను విని మమ్ము కాపాడి రక్షించే భారాన్ని వహించి నన్ను మీ కింకరుడనని భావించి తరింపజేయగలరని విశ్వసిస్తున్నానయ్యా ఓస్వామీ ! ఓ దీనదక్షా ! ఓ కోదండపతీ ! ఓ సీతాపతీ ! ఓ ఆర్తత్రాణ పరాయణా ! ఓ దీనరక్షా ! నా యీ కీర్తనలను, స్తోత్రాదులను ఆలకించి రక్షించేందుకైనా మీ దర్శనభాగ్యాన్ని అందించి మమ్ము కృతార్థులను చేయండి స్వామీ అంటూ భక్తితో ప్రేమతో ఆప్యాయతతో తాను నమ్మిన దైవాన్ని తన యిష్టదైవాన్ని తన రామచంద్రుణ్ణి కోరుకోవడం మొరపెట్టుకోవడం యిది వారికే చెల్లింది అని వారి భక్తులు యెందరో అనేక సందర్భాలలో చెప్పడం యెంతమాత్రం అతిశయోక్తి కాజాలదు.

అణువణువన భక్తిభావంతో తాము పులకరించిపోయి అందరిని పులకరింపజేయడం కవిగారికి వెన్నతో పెట్టిన విద్య అని భావించవచ్చు. అను నినత్యం రామాయణ పారాయణాదులవల్ల నైతేనేమి ఆధ్యాత్మిక చింతనవల్లనైతేనేమి కవిగారివల్ల అనేకమంది రామభక్తులుగా మారిపోయినారు.

--xx--

# రాముని యందు కవిగారికి గల అవ్యాజానురాగం

శ్రీరామచంద్ర మీతో మాటాడవలెనన్న ఊహ నాలో తలెత్తింది. తదాదిగా ఎన్నో మార్లు యత్నించినాను. ఫలితం శూన్యం జగమంతా మీదే భారం కదా ఎందరెందరికో మీరు ఆప్తులు ఎవరెవరితోనో మీరు సంభాషించవలె. మీకు నమ్మినబంటు హనుమడు. మీకు సోదరులు ముగ్గురు. మాతృదేవతలు ముగ్గురు. సోదరి ఒక్కరు. వారి వారి బంధు సపరివారము ధర్మపత్ని సీతమ్మ కోటానుకోట్ల భక్త జనులు, భక్తులలో మిక్కిలి శ్రేష్టులు. ప్రథమ శ్రేణి, ద్వితీయ శ్రేణి, సామాన్య వర్గాలుగా వీరితో సంభాషణలు ఇంత విరామ రహితంగా మీరు ఉండి ఉంటారు కదా! కనీసం ఇది ఏకాంతం ఇపుడైనా తీరిక కలిగించుకోవెరా! అని వేడుతూ రామ రాఘవ స్తవములో రామా ఏకాంతంబిది.... (10) అనే పద్యంలో వారిని వీరు వేడినతీరు కవిగారికి మాత్రమే చెల్లినది. పట్టింపులు అనేవి అందరికి యుండడం సహజమే అది వారు నమ్మినదైవంనందు కూడా వుండునట్లుగా భావించినారు. అందుకే మౌనదీక్ష అనేపట్టు మీకు ... మాటాడండి అనేపట్టు మాకు భక్తులకు ఉండియుంటుంది. మీరు మీ పట్టింపు వదలకుండా ఉంటే మేము మా పట్టింపును పడికట్టుగా మార్చుకొని ప్రార్థిస్తూనే ఉంటామని, తన మంకు పట్టును ఈ క్రింది పద్యంలో నిరూపిస్తారు కవిగారు.

ఆ॥వె॥ మౌనదీక్ష నీకు మాననెడుపట్టు
మాటలాడు మనుట మాకు పట్టు
నిన్ను వేడుకొనుట నిత్యమౌ పడికట్టు
నిన్ను జేర్చుకొంట నాకు పట్టు॥ (34) 80.

కవిగారు తమ ఇష్ట దైవమయిన రామున్ని వేడుతూ, ప్రార్థిస్తూ ఎంత ఆత్మీయతతో తమకు దగ్గరి బంధువువలె, తమకు అత్యంత ఆత్మీయుడువలె సంభావిస్తు, నేనెవరికి చెప్పను చప్పుడు కాకుండా వేంచేయండి. నన్ను ధన్యున్ని చేయండి అని వేడుకుంటాడు ఈ క్రింది చిన్ని పద్యంలో తన ఆత్రతను, వేదనను కవిగారికి స్వామియైన శ్రీరామచంద్ర మూర్తికిగలబాంధవ్యాన్ని బహిర్గత మయ్యే టట్లుగా వారిలోగల రామభక్తిని వివరిస్తూ యీ చిన్ని పద్యంలో గొప్ప భావ జాలమును చూపించడంలోఈ కవిగారు కృతకృత్యులైనారు.

కం॥ ఎప్పుడు వచ్చెదరో నా
కిప్పుడు చెప్పంగ రాదె ఇది బరువేనా
చెప్పను నేనెవ్వరికిది
చప్పుడు గాకుండ రమ్ము జానకి రామా॥ (35) 81.

ఎంతో మమతానురాగాలను పద్యంలో కురుపిస్తారు వీరు. ఈ పద్యం చదివే పాఠకులకు ఆనంద పరవశం అవుతూ కవిగారికి ధన్యవాదములు చెప్పుకోకుండా ఉండలేరన్నది వాస్తవ విషయంగా అగుపిస్తుంది. ఈ శతకంలోని ప్రతి పద్యము అమృత సమమే. రాముడికి తనకు గల సంబంధ బాంధవ్యాలను అనుభవైక వేద్యంగా చక్కటి భావ ప్రకటనను కనిపించే విధంగా పద్య రామణీయకతను కవి గారు ఈ పద్యాలలో మరియు అనుబంధ పద్యాలలో చక్కగా వివరిస్తు, "చప్పుడు గాకుండ"అనే చక్కని తెలుగు నుడికారమును ప్రయోగిస్తూ భక్తి భావాన్ని అందరికి పంచడంలో సఫలీకృతులైనారు.

రాముడిని రామావతారం ఎత్తిన విషయాన్ని గుర్తుచేస్తు, ఓ స్వామి, ఈ భూ భారాన్ని బాపి రావణ, కుంభకర్ణాది దుష్ట రాక్షస వీరులను వధించి, ఇంద్రజిత్తు వంటి మోసకారులను సంహరించి, భూ భారాన్ని తొలగించి, ప్రజలందరికి ఆరాధ్య దైవమయినారు. కాని నన్ను కాపాడడమే నీకు బరువైనదా! అని ప్రశ్నించేపద్యం...

శా॥ శ్రీవైకుంఠ పురాధినాథుడవు లక్ష్మీదేవి యుక్తుండవై
దేవేంద్రాదులు బ్రహ్మరుద్రులును ప్రార్థింపంగ విచ్చేసి భూ
దేవీ భారము బాపి యేలితివయా దేవాధిదేవా ప్రభూ
రావా దాసుడ నన్ను బ్రోవ బరువా? రక్షింపవా రాఘవా॥(36)82.

ముందుగా స్వామి గుణోన్నతులు వైభవాలు వర్ణిస్తాడు ఓ స్వామీ నీవేమో వైకుంఠపురా నికి నాయకుడవు , నాథుడవు భూలోకంలో సమస్తజీవులకు అనునిత్యం ఆటంకాలను కలిగిస్తున్న ఆ దుష్టరాక్షసులైన ఖరదూషణ, రావణ, కుంభకర్ణ, యింద్రజిత్తు మొదలుగాగల రాక్షసనేతలందరూ ఋషిపుంగవులకు, ప్రాణులకు, జీవులకు అన్నిరంగాలవారికి విఘ్నాలు కలిగిస్తూ లోక కళ్యాణాకాంక్షులైన ఋషులు తలపెట్టిన యజ్ఞయాగాదులను ధ్వంసంచేస్తూ అపవిత్రంచేస్తూ అన్ని అమంగళకరమైన కృత్యాలు చేస్తూ నరులకు,సురులకు యిబ్బందులు కలిగించినవారి మీద వారిని అణచడానికి వారిని నాశనం చేయనెంచి దుష్టశిక్షణా నిమిత్తమై రామావతారం ఎత్తి, భూ భారాన్ని తొలగించావు గదయ్యా స్వామీ! మరి అటువంటి లోకోప కారులైన మీరు మీ భక్తున్ని, నీ దాసానుదాసులకు దాసుడనైన నాకు కనిపించి, నాపై కృప వహించి నన్ను కాపాడలేరా! అంటూ ప్రార్థించడం కవిగారి లోకోపకార తత్వాన్ని తెలియజేస్తుంది.

కలిగించినవారి మీద వారిని అణచడానికి వారిని నాశనం చేయనెంచి దుష్టశిక్షణా నిమిత్తమై రామావతారం ఎత్తి, భూ భారాన్ని తొలగించావు గదయ్యా స్వామీ! మరి

అటువంటి లోకోప కారులైన మీరు మీ భక్తున్ని, నీ దాసానుదాసులకు దాసుడనైన నాకు కనిపించి, నాపై కృప వహించి నన్ను కాపాడలేరా! అంటూ ప్రార్థించడం కవిగారి లోకోపకార తత్వాన్ని తెలియజేస్తుంది.

సాక్షాత్తు దేవతలకు రాజు దేవేంద్రుడు అటువంటి దేవేంద్రుణ్ణి కూడా రణరంగంలో ఓడించి, బంధించి యింద్రుడిని జయించి ఆ రావణసూనుడైన మేఘనాథుడు "ఇంద్రజిత్తు" అని పేరు గడించారు. అటువంటి దుర్మార్గుడిని కారణజన్ముడైన ఆ దుష్టుడిని అంతమొందింప సౌమిత్రి, లక్ష్మణుడు అరణ్య వాసంలో అట్టి నియమాలు పాటించి, రామ రావణ యుద్ధంలో జరిగిన భీకర సంగ్రామ వేదికపై సౌమిత్రి మేఘనాథుడిని సంహరించాడు. తద్వార రావణుని పక్షంలో శత్రువర్గంలో భయాన్ని కలిగింపజేయడం వంటివి రాముని నేతృత్వంలో జరిగినవి. అలా భూ భారాన్ని తొలగింపజేసిన ఓ రామచంద్రా! అలాగే నా భారాన్ని కూడా తొలగింపజేయ వయ్యా అంటూ కోరుకోవడం జరిగింది. ఓ స్వామీ! దుష్ట శిక్షణ భాధ్యత నీదేనయ్యా అంటూ నివేదించడం రామునిపైన లోక సంరక్షణా భారాన్ని మోపడం అనే సుగుణం కవిగారి ప్రేమ భావనకు నిదర్శనం. ఏది ఏమైనా భక్తి తత్వాన్ని ప్రచారం చేస్తూ ఆధ్యాత్మిక భావనను ప్రకటింప జేయడం కవిగారి పద్య భావోద్వేగమిది

తత్వబోధన :– కవిగారి ఆత్మ వేదన ఈ శతకంలో అనేక పద్యాల్లో వ్యక్తరజేశారు. వారి ఆలోచనా దృక్పథాలన్ని ఈ పద్యాల్లో కనిపింపజేశాడు. తాను నమ్మిన దైవం శ్రీరాముడు. ఇహపరలోకాల్లో ఆ స్వామి కరుణా కావాలనే శుభ చింతన గలవాడు ఈ కవీశ్వరుడు. అందుకే ఈ పద్యంలో వారి భావాన్ని ఒకసారి గమనిద్దాం.

కం॥ దేహాద్యభిమానముచే
మోహమ్మభివృద్ధి చెందె మూఢుడనైతిన్
ద్రోహములగు పనిలేవియు
సాహసమున జేయనీక సాకుము రామా॥ (37) 83

ఓ రఘురామా! నేను, నాకు అనే రెండు స్వార్థ చింతనలచే నేను నా దేహమునందు అభిమానము పెంచుకున్నవాడినైనాను. ఆ కోరికచే మూఢుడనైపోయాను. స్వామీ! నాచే ఏ అకార్యాలు చేయించకుండా చూడవయ్యా! అంటూ స్వామిని వేడుకోవడం ద్వారా రెండు అంశాలను పాఠకులకు సూచిస్తున్నాడు. 1. పరలోక చింతనామార్గాన్ని ఎంచుకోండని, భక్తిని ధైవ శక్తిని పెంచుకొనే ప్రయత్నం చేయండి. 2. దేహాభిమానం పెంచుకోవద్దని తద్వారా మోహం అభివృద్ధి చెందుతుందని దానివల్ల ఆ మోహాశయంవైపుననే ప్రయత్నాలు కొనసాగిస్తుంటారని తెలియజేశారు. అందుకే

స్వార్థ బుద్ధి వీడాలని సూచిస్తున్నారు. అంతేకాకుండా కవిగారు స్వామిని సముచితంగా ఆర్థిస్తున్నాడు. ఓ స్వామీ! ఈ మోహం అనే గుణంవల్ల అకార్యాలు అనగా దుష్ట చింతనలు, దుష్ట కార్యాలు ఆలోచనలు ఆవిర్భవిస్తాయని తద్వారా దుష్ట కార్యక్రమాల్లో పాల్గొనడం లోకంలో అందరిచేత ఛీత్కరింపబడడం జరుగుతుందని గుర్తింపు తగ్గుతుందని లోకనిందకు గురికావడం జరుగుతుందని ఇవి అన్ని సాదు స్వభావులకు తగవని కవిగారు సూచించినారు.

సమాజంలో నివసిస్తున్న వారందరు సన్మార్గంలో ప్రయాణం కొనసాగించాలని అందుకొరకు కొన్ని శుభ లక్షణాలు పెంపొందింపచేసుకోవాలని కవిగారు అభిలాషిస్తున్నారు. అందులో భాగంగానే వ్యక్తిగత అభిమానాలు పెంచుకొని మూఢులుగా మారుతు మోహావేశులు కావద్దని తద్వార ద్రోహచింతన వృద్ధి కాకుండా చూసుకోవాలని తెలియజేశారు. భూతదయ లేకుండా హింసా మార్గాన్ని ఎన్నుకొని స్వార్థ బుద్ధితో సాధు భావములు గల శిష్టులకు ఇబ్బందులు కలిగింపజేస్తుండడం వల్ల లోకనిందకు గురికావల్సి వస్తుందని తన ప్రియ దైవాన్ని కోరుకోవడం కవిగారి పరోపకార భావనను తెలియజేస్తుంది.

కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సార్యాది అరిషడ్వర్గాలను జయించే విధంగా ఏక సంథాగ్రాహితత్వం పెంచుకోనే విధంగా భక్తి మార్గంలో ప్రయత్నిస్తేనే అది స్యాధమవుతుందని అరిషడ్వర్గాలను జయించగలగడం చేకూరుతుందని కాబట్టి దైవ భక్తి అనే ఉత్తమ గుణాన్ని పెంపొందింపచేసుకోవాలని కవిగారు సూచించినారు. వారు నమ్మిన దైవాన్ని ప్రజలందరుకు ఈ సద్గుణాలు ప్రసాదించవలెనని వేడుకోవడం కవిగారి తత్వచింతనను తెలియజేస్తుంది. రామావతారంలో మర్యాదా పురుషోత్తముడైన శ్రీరామచంద్రుని ఉత్తమ గుణాలు ఉత్తమ ధర్మాలు జనులందరికి ఆశయుదాయకములైనవి, ఆదర్శదాయకములైనవి. అటువంటి సద్భావలను పెంపొందింపజేసుకోవాలని కవిగారు పాఠకులకు సూచించడం గమనార్హం. లోకోపకార చింతన ధర్మనిష్ట, వినయవిధేయత, తండ్రి ఆజ్ఞను శిరషా వహించడం మహిళా లోకంలో మహిళా మూర్తులను గౌరవించడం "యత్ర నార్యస్తు పూజ్యంతేరమంతే తత్రదేవతాః" అనే విధంగా రామావతారంలో మానవ అవతార పురుషునిగా శ్రీరాముడు జన్మించి జను లందరికి ఆదర్శనేతగా, ఆదర్శభ్రాతగా, ఆదర్శగాతగా, ఆదర్శపురుషునిగా శాశ్వతంగా జనుల మనోఫలకాలపై స్థిరప్రతిష్ఠలు గావింపబడ్డారు.

స్వామియందు కవిగారికి వున్న స్వీయాభిప్రాయాలను, స్వామివారిన ఉత్తమ శ్రేష్టునిగ వర్ణింపడం తద్వారా తనకు గల స్వామి భక్తిని తెలియజేస్తున్న ఈ పద్యాన్ని

ఒకసారి సంపూర్తిగా ఆలోకిద్దాము

శా॥ నీ పాదమ్ములె నమ్మియుంటి నెపుడున్ నీ పాటలంబాడితిన్
నీ పూజల్కడు భక్తితో సలిపితిన్ నీ సేవలన్జేసితిన్
నీ పద్యంబులు భక్తితో జదివితిన్ నీ సత్కాటాక్షంబు చే
లోపంబేమియ గల్గనీయకను నాలోనుంటివో రాఘవా॥(38)84.

ఓ స్వామీ! నీ పాద ద్వయాన్ని నమ్మియున్నానయ్యా! ఎల్లవేళ్ళల్లో నీ పూజలను నేను కడు భక్తితో చేసినానయ్యా నీకెన్నో సేవలు చేశాను అంటూ భక్తి పూజ్యతను వివరించాడు. శ్రీరామ నవరాత్రి పూజావిధానము వివరిస్తూ, చతుష్షష్ట్యోపచార యుక్తంగా పూజించే విధానాన్ని సేవలను తన దైవానికి చేస్తుంటానని ప్రేమతో అట్టి పూజలను స్వీకరించి నన్ను కరిణించవయ్యా స్వామీ! అంటూ వేడుకోవడం అర్ఘ్య, పాద్య, ఆచమన్యాది క్రమంలో పూజిస్తాననే విషయాన్ని ఏకరువు పెట్టారు. రఘురాముడుని మన:స్ఫూర్గిగా ఆరాదిస్తున్నారిలా.

మోక్షాకాంక్ష అనేది తనలో ఎంత బలీయంగా ఉందో ఈ పద్యంలో ఎంత చక్కగా వివరించినారో గమనిద్దాం. ఈ పద్యంలో తనకు గల ఇబ్బందులు, అభ్యంతరాలు పద్ధతి ప్రకారం చక్కటి క్రమంలో వివరించడం గమనిస్తూ ఉంటే కవిగారికి ఎంత అణకువ, ఎంత భక్తి, ఎంత శ్రద్ధ ఉందో తెలియవస్తుంది.

ఉ॥ దారసుతాదులందు, ధనధాన్యములందు, బంధుమిత్ర సం
చారములందు, జిక్కుపడి చాలాగ కష్టములందుచుంటి నా
భారముదీర్చి మోహమును బాయగ జేయుటకీవె నాకు నా
ధారమటంచు నమ్మితిని తప్పగ బ్రోవగ రమ్ము రాఘవా॥ (39).

తనకు గల ఇబ్బందులను సంసార బంధములయందు, భార్యా పిల్లలయందు, ధన ధాన్యాదుల యందు, బంధు మిత్రాదులయందు ఆశా మోహాల్లో పడి అనేక ఇబ్బందులు పొందుతున్నానయ్యా. నా ఈ భారాన్ని తొలగించడానికి మీరే దిక్కు అని నమ్మినానయ్యా అంటూ ప్రార్థిస్తూ నన్ను కాపాడగ రావయ్యా అంటూ వినమ్రతతో నివేదించుకోవడం కవిగారి సంభావ్యత అని చెప్పవచ్చు.

కవి గారి శబ్దాలంకార మక్కువకే యీపద్యం ఓ దృష్టాంతంబని చెప్పవచ్చు. ఆలంకార శైలి అంటే కవిగారికి ఎంత మక్కువో ఈ పద్యంలో చూపిస్తూ భక్తిని,

మోక్షాకాంక్షను దర్శనాకాంక్షను ఈ పద్యంలో చక్కగా వెలిబుచ్చడాన్ని దర్శిద్దాం.

ఉ॥ రమ్ము రయంబు నన్గనగ రమ్ము బ్రియంబున చేరదీసి కో
రమ్ము గరమ్ము జిమ్మెడు వరమ్మిడు, కమ్మని నీదు నామ సా
రమ్ము, సతమ్ము గ్రోలుదు వరమ్మున కిమ్మెయి తోడజేర్చు భా
రమ్ము వహించు నమ్మితి గరమ్మున ననుగొనుమయ్య రాఘవా ॥
(40) 85.

ద్విత్వాక్షర ప్రయోగం, వృత్యానుప్రాస సోయగం ఈ పద్య గమనంలో రమ్ము, రయమ్ము, గొనగరమ్ము, కోరమ్ము, గరమ్ము, జిమ్మెర, సారమ్ము, సత్యమ్ము, వరమ్ము, ఇమ్మెయి, భారమ్ము, నమ్మితి, గొనరమ్ము వంటి పదాల చేరికతో హాయిహాయిగా పద్యం సాగిపోయింది. నన్ను కాపాడరావయ్య సాకేత రామయ్య అంటూ దీనంగా అర్థించడం కవిగారికి స్వామి వారిపై గల మక్కువను ప్రదర్శిస్తుంది. ఛందాది శాస్త్రముల పఠన చేయలేదని కవిగారు చెప్తూనే ఇంత అందమైన శబ్ద సౌరభాన్ని గుప్పించడం చదివే పాఠకలోకానికి ఎంతో ఆనందాన్ని పంచడం కవిగారి పాండితీ వైభవానికి ఇది ఒక చిన్న నిదర్శనం అని చెప్పవచ్చు కవిగారి పదప్రయోగ సోయగము వర్ణనాతీతము వారి భక్తిచింతన అమేయము అపారమైన రామభక్తికిది దృష్టాంతమని భావించవచ్చు.

ఒక విమలమైన భక్తుడు వేరే దైవం కొరకు అపేక్షిస్తాడా? అర్థిస్తాడా? ఆశిస్తాడా? ప్రార్థిస్తాడా? అని స్వామిని ప్రశ్నిస్తున్న ఈ విశేషాన్ని గమనిస్తే, స్వామి వారి యందు భక్తుడైన కవి శ్రీమాన్ రామకరామశర్మ గారికి ఎంతగానో ప్రేమాభిమానాలు పెనవేసుకుపోయినవని చెప్పకనే చెప్పే విధంగా ఉంది ఈ పద్య చింతన.

కవి గారికి తన ఇష్టదైవమైన రామునిపైన ఎంత అధికారము ఉందో ఎంత పద్ధతిగా కచ్చితంగా తన దైవానికి నివేదిస్తున్నాడో ఈ క్రింది పద్యం ద్వారా మనం గ్రహించవచ్చు.

కం॥ రామా యీ తనువుండగ
రామా దరిశనము నొసగ రాదా యిపుడే
రామా దాసుడగానా
రామా యశాశ్వతపు తనువురా శ్రీరామా॥ (41) 86.

ఈ పద్యంలో ఓ శ్రీరామా చంద్రా నా యీ తనువులో ప్రాణముండగనే ఒకసారి దర్శన భాగ్యం కల్గించవయ్యా నేను నీ దాసుడనే గదా? ఈ శాశ్వతము గాని జన్మకు

సంబంధించిన యీ తనువు నాకెందుకయ్యా, ఒకసారి కనిపించి నాకు ముక్తి ప్రసాదించవయ్యా అంటూ వేడుకోవడం కవిగారి అచంచల భక్తి తత్వాన్ని పద్య రూపంలో ఎంత చక్కగా ప్రకటితం చేశారో తెలియవస్తుంది.

అనేకానేక పర్యాయాలు శ్రీమద్రామాయణ పారాయణాదులు గావించిన కవి శ్రీమాన్ రామకరామశర్మ గారు తన భక్తి విశ్వాసాలు నిరంతర రామనామ ఆలపనా శక్తి మున్నగు ఆధ్యాత్మిక బలంతో కవిగారు శ్రీ రామానామ వైభవాన్ని శతకంలోని అన్ని పద్యాల్లో కళ్ళకు కట్టినట్లుగా కనిపింపజేశారు. మరో పద్యంలో దానిని వీక్షిద్దాం.

కం॥ అనుమానమేమి లేకయె
యనువణువుననుండు బ్రహ్మమనుచు దెలిసిరో
గనువారు బ్రహ్మమయుడగు
గనలేకుండినట్టి ఖలుడిట రామా॥ (42) 87.

ఈ పద్యంలో బ్రహ్మ స్వరూప వివరణ ఎంత చక్కగా జరిగిందో మనం గమనించవచ్చు ఎలాంటి అనుమానము లేదు. బ్రహ్మ పదార్థము అనునది అంతటా నిండి యున్నది. అనువనువున వ్యాప్తమై, సర్వవ్యాప్త స్వరూపమై వెలుగుతూ యుండడం చూసి ఈ విషయాన్ని దెలిసిన వారు బ్రహ్మమయ స్వరూపులు అవుతారని, ఇది చూడని వారు బ్రహ్మను దర్శించు కోలేరని వీరి భావన. స్వామీ మీరే బ్రహ్మమయ స్వరూపులు. మీ అపార కరుణా కటాక్షాలే బ్రహ్మ పదార్థం అంటూ నిర్మోహమాటంతో స్వామిని హృదయంలో నిలుపుకున్నట్లుగా కీర్తించడం ప్రత్యక్షంగా తాను నమ్మిన దైవం అయిన ఆ శ్రీరామ చంద్రుడు తనకు ప్రత్యక్షమైనట్లుగా భావించి, వారితో ప్రత్యక్ష సంవాదానికి దిగినట్లుగా పద్యాలలో సంభాషించినట్లుగా అగు పించేటట్లు చేయడం కవిగారి కవిత్వ వేశేషము ఇదేనని భావించవచ్చు. ఏది ఏమైన కవిగారి భక్తి అనే శక్తి ఈ పద్యాశ్వాన్ని పరుగు తీయించింది.

రామ చంద్రునికై కవిగారికి ఎంత మక్కువ యుందో బాల్యదశనుండి రామభక్తి చింతన అనే సుగుణము ఎంత గొప్పదో రామచంద్రుణ్ణి తన పెన్నిదిలాగా భావించిన వైనం నన్ను కాపాడే భారం నీదేనయ్యా అంటూ ఎంత విశ్వాసాన్ని ప్రకటిస్తున్నాడో ఈ క్రింది అనుబంధ పద్యంలో వివరించినారు.

ఉ॥ చిన్నతనంబు నుండి నిను చిత్తమునందున నెల్లవేళలన్
బెన్నిధివోలె దాచుకొని వీత విచారుడనైతినయ్య నీ
సన్నుతిజేయ శక్తినిడి సాకెద వెట్టులో దెల్పనేరనన్
గ్రన్నన బ్రోవుమంచు ననురాగమునన్ నిను బిల్తు రాఘవా॥(43)88.

ఈ అనుబంధ వృత్త పద్యంలో కవిగారి చింతన, భావన, అంతరంగం ఎంత స్పష్టంగా ప్రకటితమవుతుందో చూద్దాము. ఓ రామచంద్రా! చిన్న తనమునుండే నా అంతరంగము నందు, నా చిత్తమునందు ఎల్లవేళల్లో నిన్ను పెన్నిధివలే భావించి, మీరే నా పెన్నిధి అని ధృడ నిశ్చయం చేసుకొని వీతవిచారుడిని అయ్యానయ్యా, నాకు మీ సన్నుతిజేసే శక్తిని ఇచ్చి నన్ను సాకే భారం నీదిగా దలపవయ్యా స్వామీ, నేనా విషయాన్ని దెలియలేకున్నాను. నాకు వెంటనే వచ్చి ప్రత్యక్ష దర్శనమిచ్చి, కాపాడ రావగదయా అంటూ ప్రేమగా నిను పిలుస్తున్నానయా ఓ రాఘవా, వచ్చి సత్వరమే నారక్షణ భారమే నీవే చేపట్టవయ్యా అంటూ వినమ్రంగా స్తుతించే ఈ కవిగారి తత్వాన్ని గనుక వీక్షిస్తే నిజంగా వీరు ఎంత ధన్యజీవులు అని అనుకోకుండా ఎవరు ఉండలేరు.

ఓ స్వామీ రామచంద్రా! నీ శ్రేష్టత్వము ఇంతటదని నేనెలా చెప్పగలనయ్యా అంటూ ఓ శుభంకరా! నీ మహిమలు లెక్కించ నలవి కానివి అంటూ ఎంత చక్కగా నిరూపించారో ఈ పద్యాన్ని స్పర్శిద్దాము.

ఉ॥ ఎన్నగరాదు నీ మహిమ ఎంత దయాళుడవయ్య నీకు నే
నెన్నడు నేమిసేయవలె నెవ్విరి నా మది భక్తి పూర్ణమౌ
నన్ను తిరంబుగల్గుటకు యజ్ఞ చతుష్కము నీదు నాజ్ఞ సం
పన్నము చేత జేసితి శుభప్రద దాసుడనేల రాఘవా ॥ (44)89..

ఓ స్వామీ! నీవెంత దయాళుడవయ్యా, దయచేసి నాకు నే జేసే కార్యక్రమాల వివరాలు మీరే సెలవియ్యండి, మీకు యేయే విధాల సేవలు సేయవలె. ఏ విధంగా నాభక్తి పూర్ణతను మీకు నిరూపించగలనయ్యా. యజ్ఞచతుష్కము పితృయజ్ఞము, స్వామీ యజ్ఞము మొదలగు చతుర్విద యజ్ఞములు మీ యాజ్ఞ మేరకు చేసి యున్నానయ్యా. మీ పవిత్రమైన సంపన్నమైన, ఆజ్ఞచేత అన్ని పవిత్ర కార్యములు నెరవేర్చితిని స్వామీ, నీ భక్తులలో నేనొక శుభప్రద దాసుడి నయ్యానని భావిస్తున్నానయ్యా దయచేసి నన్ను నీ ప్రియభక్తునికగా ఎంచుకోండి. నా సేవలు గ్రహించి, నాక మోక్షం అనుగ్రహించి, నన్ను కృతార్థున్ని చేయగలరని సవినయంగా ప్రార్థిస్తున్నానయ్యా అంటూ ఎంత వినమ్రంగా సెలవిచ్చాడో గ్రహిస్తే వీరెంత ధన్య జీవులో తెలియవస్తుంది.

కవి గారికి స్వామి వారిపై ఎంత నమ్మకం కలిగిందో స్వామియందు కవిగారికి ఎంత విశ్వాసము కలదో తాను నమ్మిన ఆరాధ్య దైవమైన ఆ సీతాపతికి ఎంత ధైన్యంగా నివేదించుకున్నాడో ఈ క్రింది పద్యంలో గమనిద్దాం ఒకసారి.

ఉ॥ ఎవ్వరి వేడబోను? నిల నెవ్వరు నాకిక లేరులేరు ? నా
కెవ్వరి తోడ నేమి పని? యెవ్వరు నా వెత దీర్చువారు? నే
నెవ్వరి మాటలొప్పుకొన నెవ్వరు నీవలె బ్రోచువారు? నా
కెవ్వరు అయిన దర్శనము నే నొసంగదగునయ్యా రాఘవా ॥ (45)90.

ఓ స్వామీ! మిమ్మొదప్ప నేనెవ్వరిని నమ్మలేనయ్యా అంటూ ఎవ్వరిని వేడుకోలేను ఈ ధరిత్రిలో నాకు వేరే ఏ దైవం లేదు. నాకెవ్వరితోను ఏ పనిలేదు. నా బాధలు దీర్చు వారలు ఎవరయ్యా, నేనెవ్వరి మాటలు ఒప్పుకోను..

నీవలె కాపాడేవారు వేరే ఎవరు లేరయ్యా అంటూ అతి నమ్రత ఉట్టి పడే విధంగా వారిని వేడుతూ మీ దర్శనం నాకివ్వండి అంటూ దీనంగా ప్రార్థిస్తున్న తీరు సదా హర్షణీయమే.

కవిగారి ఆవేదన కావ్య పఠనంపై గల ఆసక్తిని ఎంత చక్కగా పద్యంలో సంవేదనా రూపంలో వివరించాడో గమనిస్తే ఈ పద్యంలో భక్తి పరిమళం ఎలా కల్పింప జేశాడో తెలుస్తుంది.

ఉ॥ పాపములన్ని బోవలయు భక్తియు నట్లె జనింపగావలెన్
తాపములన్ని బోనరచి తాపస వందిత నన్ను ప్రేమతో
ప్రాపవు నీవయై పరమభాగవతమ్ము బఠింపజేసి నీ
బాపున నిల్పు కొమ్ము వరదా భవబంధములూడ రాఘవా॥(46)91.

ఓ స్వామి రామచంద్రా! మా పాపాలన్ని పోవాలి. మీయందు భక్తి జనించాలి. ఓ తాపస వందిత, నా తాపములన్ని దీర్చవయ్యా అంటూ నిష్కల్మష హృదయంతో ప్రార్థించడం నాపైన ప్రేమతో శిష్య వాత్సల్యంతో నాతో భక్తి పూరితమైన భాగవతాది సత్కావ్య పఠనము జేయించి నీ హృదయ మందిరములో నానొకింత చోటు కల్పించి, నన్ను కాపాడవయ్యా ఓ భక్త వరదా నా సంసార బంధములు తొలగించి నన్ను కృతార్థుణ్ణి చేసి నన్ను మోక్షార్హున్నిగా ప్రకటించండి స్వామీ అంటూ ఎంత గాఢమైన భక్తితో స్వామిని ప్రాధేయ పూర్వకంగా ప్రార్థిస్తున్నాడో గమనిస్తే, ఇందులో కవిగారి శక్తియుక్తులు ఎంత ఉన్నతమైనవో భక్తి ఎంత నిగాఢమైనదో ఎంత నిగూఢమైనదో వ్యవగతమవుతుంది. శ్రీ రామకరామక శర్మ గారు ప్రతినిత్యము త్రికాల సంధ్యా వందనాదులు, నిత్య కర్మానుష్టానములు నిత్యోపాసనాది హవన కార్యక్రమాదులు నియమ నిష్టలతో వారింటి పక్కనే కొలువైయున్న శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామి వారి మందిరములో

కొనసాగిస్తు ఉండే వారు. వీరి అనుష్టానమునకు, తపోదీక్షకు, పట్టుదలకు పరమ భక్తితత్వానికి గ్రామస్తులందరు మెచ్చుకొని వీరిని వేనోళ్ళ కీర్తిస్తూ ఉండేవారు.

కవిగారికి రామపదారవిందములపైగల అచంచల విశ్వాసంబును యీవిధంగా ప్రకటిస్తూ యీ వృత్తపద్యంలో ఎంత భక్తిపరవశంతో వివరించారో చూద్దామొకసారి. యీపద్యరామణీయకతను దర్శిద్దాం.

ఉ॥ ఆపదలెన్ని వచ్చినను నాప్తుడవై మము బ్రోచుచుంటి వీ
తాపములన్ని బాపుమని దాశరథీ నను వేడుచుంటి మా
దాపుననుండియుంబలుక ధర్మముగాదని యూరకుంటివా
తాపసవంధ్య వేగముగ త్వత్పదయుగ్మము జూపు రాఘవా ॥(47)93.

మమ్ము ఆపదలలో కాపాడేస్వామివిగా మిమ్ము అర్చిస్తున్నామయ్యా ఓ స్వామీ మా తాపాలను బాపే బాధ్యత మీదేనయ్యా అంటూ రామచంద్రమూర్తిని నిలదీస్తున్న యీపద్ధతి చూస్తే వీరికి స్వామిపైన ఎంత అధికారము యుందో గమనించవచ్చు. ఓ దాశరథీ మాతాపము దీర్చండి మాదగ్గరేయుండి మాతో మాట్లాడటంధర్మంగాదని యూరకున్నారా? ఓతాపసవంధ్యా ! మీ పాదయుగమ్ములను మాకందీయవయ్యా అంటూ వేడుకోవడం స్వామివారిపైన కవిగారికి గల అవ్యాజానురాగాన్ని సూచిస్తోంది.

భక్తిప్రపత్తత అనే సుగుణము వ్యక్తిని ఎంత ఉన్నతస్థాయికి చేరుస్తుందో ఈ కవిగారి విషయంలో చూడవచ్చు దేవునియందే పూర్తి బాధ్యతనుంచి ఈ వసుధ సమస్తమునకు నీవే ప్రధానమంటూ ఎంత చక్కగా భక్తి పూర్వకంగా వివరిస్తున్నాడో ఈ క్రింది పద్యంలో చూద్దాం.

ఉ॥ ఎవ్వరు నాకు ఆప్తజనులెవ్వరు నా వెతదీర్చువారు న
న్నెవ్వరు చేరదీసిరి కెవ్వరు బ్రోతురు నీవు దక్క నా
కెవ్వరు దిక్కు నెల్లపుడు నిమ్ముల దీర్తువు దేవదేవ నే
నివ్వసుధన్ సమస్తమున కీవే ప్రధానమటంచు రాఘవా ॥(48)94.

తాను నమ్మిన తన స్వామిని ఎంత దీనంగా వేడుచున్నాడో గమనించినట్లయితే ఈ పద్యంలో నాకు ఆప్తులెవ్వరు లేరని నా బాధ్యత తీర్చేవారు ఎవ్వరు లేరని అలాగే నన్నెవరు చేరదీసారని నన్ను మీరే కాపాడాలి వేరే ఎవరు సిద్దంగా లేరయ్యా ఓ స్వామి రామచంద్రా! నాకు నీవే దిక్కు "నీవే తప్ప హి తప్పరంబెరుగ....." 1. అనే పోతనార్యుని భాగవతపు పలుకులను స్ఫురింప చేస్తు నాకు మీరే దిక్కు అని అందరు తేల్చి చెప్పినారు. నేనైతే ఈ సమస్త భూ మండలానికి మీరే ప్రధాన కర్తలు అంటూ నమ్ముతానని తన నమ్మకానికి బలం చేకూర్చాలని కవిగారు దయాసముద్రుడైన, ఆ నీలమేఘశ్యాముడైయిన

రామభద్రున్ని ఎంత చక్కగా వేడుకుంటున్నాడో గమనిస్తే, శ్రీరామచంద్రుడిపై కవిగారికి గల భక్తి, నమ్మకము, విశ్వాసము, ప్రేమ, అనురాగము ఎంత ఉదాత్తంగా ఉన్నాయో తెలియవస్తుంది.

కవిగారికి గల భక్తి, నమ్మకము, విశ్వాసము, ప్రేమ, అనురాగము ఎంత ఉదాత్తంగా ఉన్నాయో తెలియవస్తుంది.

రాముని దర్శనార్థమై శ్రీరామచంద్రస్వామి దర్శనానికి ఎంతగా వేచిచూస్తున్నాడో కవిగారు ఈ పద్యసుమంలో ఎంత ఆత్మీయంగా వివరిస్తున్నారో గ్రహించవచ్చు. అంతేకాదు ఒకభక్తునిగా రామదర్శనకై ఆరాటం ఉబలాటం గమనించవచ్చు.

ఉ॥ నమ్మితినయ్య నెందరినొ నామదిలోపల సర్వవేళలన్
నమ్మమరెవ్వరిన్ బుడమి నాయధినాథుడ నీవెయంచు నా
నమ్మిక నీపయింగలిగె నన్ను దయందరి జేర్చుమయ్య లో
పమ్ములనోర్చి నీవరకు పావన రూపము జూపు రాఘవా ॥(49)95.

ఓ స్వామీ ! పంకజలోచనా ! ఓ రామచంద్రా ! నేను యెందరినో నమ్మినాను కాని నా హృదయమనే మందిరంలో మాత్రం మీరే కొలువైయున్నారు అన్నివేళల్లో ఈ విశ్వమునకు అధినాయకులు మీరేయని నే నమ్మినానయ్యా నాకు మీపయిన యీనమ్మకం కలిగింది కావున నన్ను దరిజేర్చే భారంకూడా మీదే నాలోని లోపములను ఓర్చుకొని మీ పరమపావనమైన దర్శనం కలిగించి నన్ను కృతార్థుణ్ని చేయండి స్వామీ అంటూ కారుణ్యం ఉట్టిపడేవిధంగా కోరుకున్న ఈ తీరుగమనిస్తుంటే భక్తునికి స్వామికిమధ్యగల సంబోదనా విధానాన్ని మనం గ్రహించవచ్చు.

ఓ స్వామీ మీ గొప్పతనమును నేనెలా వర్ణింపనయ్యా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది త్రిమూర్తుల సుగుణాదులన్ని నీయందే తాండవిస్తున్నాయి. సృష్టి,స్థితి, లయలకు సర్వం మీరే మీదృష్టివల్లనే ఈ చరాచరజగత్తు నడుస్తున్నది. ఓపరమాత్మా ! ఓ రామచంద్రా ! మిమ్మునేనెలా పొగడవలెనయ్యా అంటూ ఈపద్యంలో స్వామితో సంభాషించిన విధానాన్ని మనం భక్తిపారవశ్యంతో గమనిద్దాం. కవిగారి రామభక్తి అనన్యసామాన్యమైనది శ్రీరాముని యందు వీరికి ఎనలేని ప్రీతి యావద్రామా యణమును కరతలామలకముగా ఎన్నోమార్లు పఠించియున్నందున రాముని చిత్తమునందు నిలుపుకుని వీరు వీరి జీవనయానమును కొనసాగించినారు. రామభక్తుడుగా, రామసేవకుడుగా వాసిగాంచారు.

చ॥ శివుడవు నీవె బ్రహ్మవును శ్రీపతివీవె సురాసురాదులు
ధ్రువమగు పట్టువీవయిల భౌతిక సంపదకాలవాల వీ
వ వెలయు మంత్రమేరతడు పాశ్రితమైన మహార్థమీం సం
స్తవమొనరింతు త్వన్మహిత సర్వజగత్పతి వౌను రాఘవా.॥(50)96.

ఓ ఈశ్వరా ! మీరే శివుడు మీరే బ్రహ్మ మీరే విష్ణువు అయి ఈ సురాసురుల పుట్టుకకు మీరే కారణమయి భౌతిక సంపదలకై మీరే మీకు ఏ మంత్రంతోనైనా మిమ్ము సంస్తవం చేస్తాం మీ శుభనామ సంకీర్తనం ఒనరిస్తాము. ఈ సమస్త సృష్టిలో మీనామ మాహాత్మ్యాన్నే ప్రచారం చేస్తాను. మిమ్మిందుకు స్తుతించేవిధంగా, కీర్తించేవిధంగా. ఆరాధించేవిధంగా చూసే బాధ్యత నీదేనయ్యా రామచంద్రా అంటూ సృష్టి, స్థితి, లయాత్మక బాధ్యులు త్రిమూర్తులు మీరు సురాసురులు, పంచభూతములు అంతయు మీరే మహార్థమూలం మీరు అవతారపురుషునిగా, ధర్మస్థాపనకే మీరవ తరించి రావణ,కుంభకర్ణాది రాక్షసబాధ సామాన్యజనాలకు లేకుండా జేసిన మాననీయులు మీరని కవిగారు శ్రీరామచంద్రుడిని కొనియాడుతున్నారు.

శ్రీ సీతారామ చంద్రులయెడ కవిగారికి గల భక్తి ప్రపత్తులను ఎంత చక్కగా వివరిస్తున్నాడో తన భావన ధురీణత ఈ పద్యంలో ఎంత హృద్యంగా చూపెట్టినాడో మనమొక సారి భక్తి పూర్వక మనస్సుతో గమనిద్దాం.

మ॥ పశువుల్ మేతను మాని గోష్టముల కంభాయంచు చేరెన్గదా
దిశలంబోయిన పక్షి సంతులు ప్రద్యోజాలిపై వ్రాలె మా
శిశువుల్ హాయిగ నిద్రబోయి రొగి నిశ్చింతంబు రీ వీధులన్
నిశి పూజల్గయి కోగరమ్ముకృపతో నిక్కంబుగా రాఘవా ॥(51)97.

ప్రకృతి వర్ణన ఎంత చక్కగా చేసినారో కవిగారి ఆలోచనా తరంగాలు ఎంత చక్కగా వివరిస్తున్నాడో చూద్దాము ఓ స్వామీ నీకు నిశిపూజ చేయడానికి నాలో ఉత్సాహం కల్గింది. ఆనిశిపూజను స్వీకరించడానికి రావయ్యా శ్రీరామా అంటూ ఎంతచక్కగా అర్థిస్తున్నాడో చూడండి పశువులు మేత పూర్తిచేసుకుని వాటివాటి గోష్టములకు చేరియున్నవి అంబా అంటూ ఆవులు వాటి లేగదూడలకు అవి వస్తున్న సూచనలు అందిస్తూ దూడల ప్రతినాదమైన అంబాధ్వని వింటూ వడివడిగా చేరుకుంటున్నాయి.

ఆహారాన్వేషణకై ఆయా ప్రాంతాలకు వెళ్లిన పక్షిసంతులు అన్ని వాటిగూళ్ళకు చేరినాయి. అని పృథ్వీజాళి అని ప్రయోగము భూతమిపై వెలిసినవి వృక్షజాతులు వాటిని పృథ్వీజాళి అని ప్రయోగించడం ఎంత సంభావ్యత మా గ్రామంలోని యిళ్ళల్లో యున్న చిన్నపిల్లలు శిశువులు నిద్రపోవడం ఆరంభమైనది హాయిగా నిశ్చింతగా నిద్రిస్తున్నారు. ఓ

స్వామీ యీ ప్రశాంతవేళల్లో నేను చేసే నిశిపూజలను గైకొనగరమ్ము స్వీకరించడానికి రండి స్వామీ మా యీ సేవలు చేనంది మాపై కృపచేసి సాకుమయ్యాఅంటూ ప్రార్థించడం కవిగారికి గల భక్తినిర్మలతకు ఓ నిదర్శనమిది.

పై పద్యంలో కవిగారి ఆలోచనలమేరకు నిశిపూజాక్రమమునకు రాత్రివేళల్లో చేసేపూజకు రావడానికి మీకేమేని ప్రశాంతతకు భంగంవాటిల్లడం లేదని ఎంతచక్కని క్రమంలో వివరించారో చూసినట్లయితే సాయంకాలం ప్రకృతిలోజరిగే స్వాభావికాంశములు వాటిక్రమం ఆహారానికి వెళ్ళిన పశువులు, సాధుజంతువులు, పక్షులు అలాగే వీధుల్లోని యిళ్ళలోని శిశువులు ఆ పద్ధతిని ఎంతచక్కగా వివరించినారో యిందులో విదితమైంది. యిటువంటి ప్రశాంతసమయంలో మీకునిశిపూజ చేయడానికి నే సిద్ధంగా వున్నానని చెప్పడం కృప,దయజూపమని స్వామిని అర్థించడం యివన్ని కవిగారి భక్తిప్రపత్తులకు నిదర్శనం యిది. అలాగే స్వామివారిపైగల భక్తియుక్తులను తెలియజెప్పడం యిదంతా కవిగారి నిష్కల్మషత్వాన్ని వివరిస్తోందని చెప్పవచ్చు. కవిగారికి రామునియందు గల ప్రగాఢ భక్తి, శ్రద్ధ, విశ్వాసం, మధురానుబంధం స్పష్టంగా తెలియవస్తుంది. నిరంతర రామనామపారాయణం యైతేనేమి జపతపాలు, యైతేనేమి, గాఢమైన భక్తిశ్రద్ధలు అంటేనేమి యిలా వారి స్వామిభక్తిని రమ్యమైన యీశతకపద్యాల్లో చక్కగా వివరించినారు.

కవిగారి భక్తితత్వాన్ని ప్రకటిస్తూ ఎంతచక్కని అష్టపాదమాలిక ఎనిమిది పాదాలలో ఉత్పలంలో వినిపించడం యిష్టదైవంపై తనకుగల నమ్మకాన్ని, విశ్వాసాన్ని ప్రకటించడం ఒక అందమైన భక్తిరూపం తాండవిస్తోంది యిందులో.... కవిగారి పద్యగమనము కవిగారి ప్రయోగములు వారి భక్తితత్పరత వంటివి అధికంగా చోటుచేసుకునియున్నవి. కవిగారికి రామునియందు గల నమ్మకము, విశ్వాసము, గాడానురాగత మొదలగు సుగుణములు కలిగియుండి యున్నారు అందుకే పెద్దలు వీరిని సార్థకనామధేయులుగా వ్యవహరిస్తూ వుంటారు.

ఉ।। చూచెద నీదు పాదముల జూచెద బంగరు రంగు చేలముం
జూచెద జానునూరువుల జూచెద బ్రహ్మవెలుంగు నాభి నే
జూచెదను మధ్యమును జూచెద కౌస్తుభ వక్షశోభలన్
జూచెద శాంగచాపమును జూచెదనా వనమాలి కౌవళుల్
జూచెద నవ్వుమోము జవిజూచెద కమ్మని చూపు దేనియల్
జూచెద దివ్యమూర్ధమును శుభ్రకలాన్వితమౌ కిరీటమున్
జూచెద కంబుకంఠమును జూచెద నీ కరయుగ్మ కాంతులం
జూచెద స్వప్రకాశమును జూచెద శక్తిని నిమ్ము రాఘవా ।।(52)98.

ఓ స్వామీ ! నే నీపైగల భక్తిభావముతో మీ పాదయుగమ్ములను చూస్తాను. బంగారు వర్ణంగల చేలములను, పీతాంబరములను చూస్తాను చక్కటి మీ శరీరభాగాలైన ఊరువులను చూస్తాను. బ్రహ్మవెలుగులను జూపే మీ నాభిని దర్శిస్తాను. మీవక్షస్థల వైభవాలను వీక్షిస్తాను శారంగాది ఆయుధ సంతతిని జూస్తాను మీ కరయుగ్మ కాంతులను చూస్తాను మీ యుగళకంఠాన్ని వీక్షిస్తాను .వనమాలికాది సర్వాలంకారాదులను భక్తిపూర్వకంగా దర్శిస్తాను మీనవ్వుమోమునుమీకమ్మని చూపును ఆనందంతో వీక్షిస్తానయ్యా మీదివ్యమైన మూర్ధభాగాన్ని దర్శిస్తాను మీశుభ్రకలాన్వితమైన కిరీటాన్ని దర్శించుకుటాను మీ స్వప్రకాశ స్వరూపాన్ని చూసే శక్తిని నాకందించవయ్యా అంటూ తానారాధించే తన స్వామియైన ఆ శ్రీరామచంద్రమూర్తిని ప్రార్థిస్తున్నాడు.

'చూచెద' అని కేవలం ప్రాస స్థానంలోనే కాక యతిస్థానంలోకూడా పలుమార్లు ప్రయోగించడం – కవి స్వామిని తనివితీరా చూడాలనే తపనను, ఆర్తిని వ్యక్తం చేస్తుంది. పాదములు మొదలుకొని కిరీటమువరకు అంగాంగములు శస్త్రాయుధములు వర్ణించడం – " ఆపాదమస్తకం" స్వామిని దర్శించాలనుకోవడం – భగవంతుని ముందుగా పాదాలు దర్శించాలి – తరువాత క్రమంగా ముఖార విందం – ప్రభువులో, మానవులో ఐతే ముందుగా ముఖమే దర్శించుకోవాలి, ఆచార్యులైతే, పాదదర్శనం – ఇట్లా భగవద్దర్శనమొక విధానం– ఆలయార్చన విధానం తెలిసినవారు కనుక కవిగారు సాంప్రదాయజ్ఞులు కనుక స్వామివారిని ఆపాదమస్తకం వర్ణించారు. కవిగారు భక్తితత్పరులు కావున శ్రీరాముని ఎలా దర్శించాలో పరమ భక్తితో చూపించారు.

ఓ రాఘవా! నిన్ను వర్ణించే శక్తి నాకు లేదయ్యా, అన్నింటికి నీవే కర్తవు, హర్తవు అంటూ నిరూపిస్తూ సర్వలోకాలను రక్షించే బాధ్యత నీదేనయ్యా అంటూ స్వామికి తన నివేదనను ప్రకటించుకునే యీ పద్యాన్ని వీక్షిద్దామొకసారి.

ఉ॥ కర్తవు భోక్తవుందలప కారణకార్యము నీవె గాదె స
ద్భర్తవు సర్వలోకముల బాలన సేయుచునుందు వీవు స
ద్వర్తన గల్గుభక్తజన వాంఛలు దీర్చుచు దుష్టశిక్షణన్
వర్తిలుచుండు నీదయన వర్ణన నేనిటు సేతు రాఘవా ॥(53)99.

"బ్రహ్మార్పణం బ్రహ్మహవి:" శ్లోకాన్ని గుర్తుచేసేవిధంగా, పోతనగారు భాగవతంలో "ఎవ్వనిచే జనించు....." అనే పద్యాన్ని గుర్తుకు తెస్తూ సమస్త సృష్టికి మూలకారణం పరమాత్మ అని పరమాత్మ తత్వాన్ని వివరిస్తూ కవిగారు భక్తుల కాపాడటానికి నీవే కర్తవు కారణము నీవే కార్యము నీవే సర్వలోకాలకు సత్పాలన చేయడానికి సద్భర్తవు నీవేనంటూ ప్రజారక్షణ బాధ్యతనుస్వామి వారిపై ఎంత చక్కగా ఉంచుతున్నాడో గమనిస్తే

సత్ప్రవర్తన గలిగిన భక్తులను మానవాళిని మీ దయతో కాపాడే బాధ్యత మీదే స్వామి అంటూ వారి కోర్కెలు తీర్చుచు అందరిని కాపాడుతూ ఉండే మిమ్ములను వర్ణించే శక్తి నాకు లేదయ్య అంటూ నమ్రతతో ప్రార్థించారు.

స్వామి నిను ధ్యానించే స్వచ్ఛ మనంబును ప్రసాదించవయ్యా అంటూ భక్తితో వేడుకుంటు ఉండే ఈ పద్యం కవిగారి యొక్క నిర్మల భక్తికి ప్రతిరూపం.

మ॥ నిను ధ్యానించెద హృత్సరోరుహము నన్నీ దివ్యరూపంబు నీ
గనుచుందున్ జలజాత నేత్ర యుగళిం గౌతూహలం బొప్పగా
ఘనపీతాంబర ధారి ప్రేమ గలుగంగా జానకీ సాధ్వితో (54)
డను చిర్నవ్వుల నొల్కు స్వామి మది వేడ్కన్ నిల్పుమా రాఘవా॥100.

స్వామీ రామచంద్రా! నిన్ను నే నా హృదయమనే కమలంలో మీ దివ్య రూపాన్ని పూజించెదనయ్యా! ఓ జలజాత నేత్ర ఓ కంజదళాక్షా కుతూహలం ఉప్పతిల్లే విధంగా నిన్ను దర్శించి తన్మయత్వం చెందుతానయా అంటూ పవిత్ర హృదయంతో వేడుకోవడం గొప్ప విషయం. ఓ ఘన పీతాంబరధారి, ఓ రామచంద్రా! ప్రేమ గొలిపే జానకీ దేవితో చిరునవ్వుల మకరందాన్ని చిందిస్తూ నా మనస్సుకు వేడుకనొప్పే విధంగా నిలువవయ్యా అంటూ ప్రార్థించడం కవిగారి గొప్ప తనానికి నిదర్శనం.

" నా హృదయం సరోరుహం మీ నేత్రాలు జలజాతాలు" ఇది కవిగారి ఔచిత్య ప్రదర్శన సామ్యమును బట్టి కలిసి పోవాలని కాంక్ష కవిగారి స్వచ్ఛ భక్తికిది నిదర్శనము.

కం ॥ రాముని దర్శన భాగ్యము
కోమలి యా సీతతోడ కోరిన యటులే
రామయ్య గారు నందిరి
రామక రామయ్య గారు రామధనుండే॥

--×--

# రామరాఘవ స్తవము - పరిశీలన

1986 జూన్ మాసంలో ఈ పుస్తకం వెలువడింది. ఈ పుస్తకమునకు అభిప్రాయములు అందించిన వారిలో ప్రముఖులు శాస్త్రుల్ల విశ్వనాథ శర్మగారు కవిగారినుద్దేశించి సహజపాండిత్యము భగవద్దతమగు కవితాశక్తి, సుగుణసాకారాలు, నిర్గుణనిరూపితత్వము శ్రీరామునియందు వారికిగల నిష్ఠా,పారవశ్యము గలిసి ఈ పొత్తము రూపొందింపబడిందని రాముని గుణగణాలను వర్ణిస్తూ భవభంధవిముక్తి కొరకు కవిగారు రాముని ప్రార్థించిన తీరుతెన్నులు అత్యంత రమణీయంగా వుండియున్నవని తెలియజేస్తూ.............

శ్లో ॥ బ్రాహ్మణస్యతు దేహోయం
క్షుద్ర కామాయ నేష్యతే
ఇహ కృచ్ఛాయ తపసే
ప్రత్యానంత సుఖాయచ ॥ (55) 101.

అనే ఆర్యోక్తికి ఈ కవిగారు ప్రతీకయగుచున్నారని ఈ కావ్యాన్ని సంస్కరిస్తూ వారు యిందులో దోషములేమైన యున్నచో నావిగా, గుణగణములన్నియూ కవివరేణ్యులవిగా గమనించండి అని పాఠకలోకానికి చేసిన విజ్ఞప్తిలోనే ఈ కవిగారి రచనలు ఎంత సుందరములైనవో ఈ కవిగారికి రామునియందు గల భక్తి ఎంత నిగూఢమైనదో అర్తమవుతుంది. కవిగారు నిరంతరం శ్రీ రామనామ గానామృతంలోనే నిమగ్నులై వుండేవారు పాఠకలోకానికి కూడా వీరిచ్చే సందేశం సూచన అదే శ్రీరామ చంద్రమూర్తిని నమ్మమని అందరికీ చెబుతూ వుండేవారు.

అవధాని బ్రహ్మశ్రీ పార్వెళ్ల గోపాలకృష్ణ శర్మగారు సందేశం వ్రాస్తూ ఈ కవిగారి కలములో రామభక్తి అనే యింధనము నిండియుండినదని ఆ శక్తియే వీరి కవితాశ్వమును పరుగులు తీయించిందని తేట తేట తెలుగు తేలికమాటలలో పాఠకుల హృదయాలకు హత్తుకునేవిధంగా యున్నవని వివరించినారు. ఏది యెట్లున్నను రామభక్తులు ఆనందంగా పాడుకునేందుకు వీలుగా ఈ పద్యాలు అందరి జిహ్వాగ్రాలపై నాట్యంచేస్తూంటాయని కవిగారి భక్తి కవితాశక్తి అటువంటిదని సూచించినారు. భక్తిభావభందురమగు వీరి పద్యాలు సహృదయ పాఠకులకు మనోరంజకములవుతాయని భగవంతుని కృపకు పాత్రులు ఔతారని కవిగారు భావిస్తూండేవారు.

బ్రహ్మశ్రీ ఏ. వెంకటరమణయ్యగారు కవిగారి కవిత్వాన్ని వర్ణిస్తూ.......

తే॥గీ॥ పలికెడిది రామచరితంబు పలుకువాడు
రామచంద్రుడటంచు నిరంతరంబు
భావమున దలపోయు నీ వంటివాని
జూడగాలేదు శ్రీరామ సుకవిచంద్ర ॥ (56) 102.

తే॥గీ॥ తప్పులొప్పులుగా జేయదగినవాడు
నిరతమును నన్నుగాపాడ నేర్చువాడ
టంచు నాతోడనిపుడు వచించినారు
రామకాన్వయ హిమధామ రామసుకవి ॥ (57) 103.

తే॥గీ॥ రామ శ్రీరామ రఘు రామ రామరామ
యనుచుజింతించుచుండు నీయాత్మయెపుడు
గువలయంబున నీకేమి కొదవలేదు
రమ్యగుణధామ రామక రామశర్మ ॥ (58) 104.

30-8-1974 రోజున వీరి పుస్తకంలో వీరి గురించి ముందుమాటలు వ్రాస్తూ కవిగారినుద్దేశించి నిరంతర రామనామ పారాయణం జేసేవారు యైన శ్రీమాన్ బ్రహ్మశ్రీ రామక రామశర్మగారు ఎంతభక్తిభావనను పద్యాల్లో రంగరించి పోసినారో వివరించినారు. ఈ కవిగారు అణువణువున భక్తిభావాన్ని వారి తత్వాన్ని అందులో నింపియుంచినారని తెలియజేసినారు.

27-4-1974 బొమ్మెనపల్లి రామక విశ్వనాథశాస్త్రిగారు 32 పాదాల్లో ఉత్పలమాలికను సమర్పిస్తూ ఈ పుస్తకంలో కవిగారి రచనను గూర్చి ఈ రామరాఘవ స్తవముగురించి వీరి స్వీయాభిప్రాయాన్ని రసరమ్యంగా మాలికా రూపంలో వెలిబుచ్చినారు. కవిగారి నిష్కల్మషమైన భక్తితత్వాన్ని చక్కగా నిరూపించినారు. కవిగారి శ్రీరామ భక్తిభావాన్ని, వారికి భవభంధవిమోచనం కలిగించాలని వేడుకునే తపన యివన్నీ కూడా చక్కగా వివరించినారు. శ్రీరామ పాదారవిందములకు జేర్చిన భక్తి ప్రసూనములే ఈ పద్యాలని వీరి భావన.

## శ్రీ రామ రాఘవస్తవము - భక్తిభావన

శ్రీమాన్ రామక రామశర్మగారి భావనలో రాముడన్నా రాముని తత్వమన్నా ఎనలేని ఆదరాభిమానాలు కనిపింపజేస్తారు ఒకపద్యంలో ఈ భావాన్ని కనిపింపజేస్తూ ఓ రామచంద్రా నాచే ఏ ద్రోహపు పనులను జేయనీకయ్యాఅది నీ భాధ్యత అంటూ

వారి యిష్టదైవమైన రామచంద్రుని పైన భారాన్ని మోపుతున్న ఈ పద్యాన్ని స్పర్శిద్దామొకసారి.

కం॥ దేహాద్యభిమానముచే
మోహమ్మభివృద్ధిజెందె మూఢుడనైతిన్
ద్రోహములగు పనులేమియు
సాహసమున జేయనీక సాకుము రామా ॥ (59) 105.

ఓ రామచంద్రా దేహముపైన ఉండే అభిమాన మమకారములచే మోహం అభివృద్ధి చెందుతుంది ఆమోహంవల్ల మూఢునిగా మారిపోయినాను మూఢునినైన నేను తెలియకనే ఏదైనా అపరాధములు,ద్రోహములు చేయడానికి పూనుకుంటే అవి సాగనీయకుండా జేసి నన్ను సంరక్షించవయ్యా అంటూ వేడుకోవడం కవిగారి నిష్కల్మథషత్వాన్ని తెలియజేస్తూ భక్తి పారవశ్యతను నిరూపిస్తోంది. యిందులోని తత్వము యిదియే స్వామీ ఓ రామచంద్రా మానవులలో ఈ దేహం గొప్పది ఈ దేహమే నిత్యం అని నమ్ముకునేవారి దేహంమీద గల అభిమానాన్ని తద్వారా ఆవిష్కృతమయ్యే మోహాన్ని ఆ మోహంవల్ల గలిగే పరమార్థం మూఢత్వమని అటువంటి మోహం అని విషయంవల్ల చింతనలలో మార్పులు ఉత్పన్నమౌతూ వుంటాయని ఆ మార్పువల్ల మూఢత్వం అబ్బుతుందని దాంతో ద్రోహపు పనులు చేసే తలంపు ఏర్పడుతుందని అటువంటి దుష్టకార్యాలు చేసే సాహసాన్ని ఆపాదించకయ్యా అటువంటి చింతన నాలో కలిగించకయ్యా ఓ రామచంద్రా అంటూ దీనంగా రాముణ్ణి ప్రార్థిస్తున్న వైనమిది.

ఎంతచక్కటి తాత్వికభావన యిది ఎంత చక్కటి తాత్విక ఆలోచన యిది ముమ్మాటికీ వాస్తవమే ఈ సమాజంలో చాలామందికి యిది అనుభవైకవేద్యమే కానీ ఓ రామచంద్రా నాకుమాత్రం ఇటువంటి సాహసాలు అంటకడుతూ ఆపాదిం చకయ్యా అంటూ వినమ్రంగా వేడుకుంటున్న యీపద్యం ద్వారా కవిగారి భక్తితత్వం అవగతమవుతుంది. రామునియందు కవిగారికి గల అపారమైన భక్తికి యీ క్రింది పద్యం ఒక ప్రత్యక్షనిదర్శనం ఆంతర్యాన్ని చూద్దామొకసారి వారిభావన యిది.

కం॥ అందరితో జెప్పెదనని
యందువా నీ చరణసాక్షి యది దెలుపను నీ
యందముగల రూపము నా
ముందర గనిపింపజేయు మ్రొక్కెద రామా ॥ (60) 106.

ఓ సాకేత పురాధిపా ఓ యినకులచంద్రా మీ దర్శనం నాకు కావాలి ఒకసారి కనపడండి నాపైన మీకు అపనమ్మకమేమిటి అది అవసరం లేదురామా మీ

పాదద్వంద్వంబుల సాక్షిగా మీరు నాకు కనిపించిన విషయాన్ని నే నెవ్వరికి జెప్పనయ్యా నన్ను నమ్మండి రామచంద్రా ముందు మీ అందమైన రూపాన్ని నాకు చూపించండి నే మ్రొక్కులిడుతున్నానయ్యా "రామో విగ్రహవాన్ పురుషః " అనేది యిక్కడ సాక్షాత్కరించాలని కవిగారి భావన ఏది ఏమైనా సాక్షాత్తు స్వామివారినే సాక్షిగా జూపించి దర్శనాన్ని వాంచించడం కవిగారి పట్టుదలకు యిది ఒక నిదర్శనమైన పద్యరాజమై నిరూపిస్తుంది.

ఓ స్వామీ నే మరణించే వేళ నీ నామస్మరణ మానెదనేమో ఈ అనుమాన నివృత్తిజేయడానికి నాకు దర్శనమివ్వగ రండి అంటూ వేడుకుంటున్న ఈ పద్యాన్ని చూద్దామొకసారి చూసి వారి భక్తిభావనను గమనిద్దాం.

ఆ॥వె॥ మరణవేళ నేను మరచిపోదు నిన్ను
నాల్కతోడ నీదు నామ జపము
కనులముందు నాకు గనిపించి కరుణతో
ఎదను జేర్చు నన్ను యిపుడె రామ ॥ (66) 107.

ఓ రామచంద్రా! నే మరణించేవేళ శరీర కంపనంతో నీ నామ స్మరణ మానివేస్తానేమో అందుకే నాకు ఆరోగ్యం మంచిగా ఉన్నప్పుడే, నీ నామస్మరణ చేస్తూ ఉన్నప్పుడే నీ దర్శనం నాకు కలిగించి నన్ను నీలో జేర్చుకో రామా అంటూ దీనంగా ప్రార్థించడం ముదావహం. ఓ శ్రీరామచంద్రా! ప్రతిక్షణం మిమ్మేతలుస్తూ ఉన్నాను. నాకు ఒక వరం ప్రసాదించవయ్యా అందుకొరకైనా సరే ఒకసారి మీ దర్శనం భాగ్యం కలిగించవలెనయ్యా, రామభద్ర అంటూ వేడుకుంటున్నా స్థితిని ఈ పద్యంలో గమనిద్దాం.

స.ల.కం. అడుగడుగున దలచితి నిను
తడబడకను మొరలిడితిని తనయుడనని ని
న్నడిగితి నొక వరమిడమని
కడుముదమున నగు మొగమున గనబడు రామా ॥(69)108.

ఓ రామభద్రా! తడబడకుండా నా మొరలు మీకు వినిపిస్తూ ఉన్నను. ప్రతీక్షణం మిమ్మల్నే తలుస్తూ ఉంటాను. మీ నామస్మరణ వినా మరొకటి లేదు నాకు, ఒక వరమిచ్చి సంతోషముతో మీ నగుమోమును దర్శించుకునే భాగ్యాన్ని నాకు ప్రసాదించండి స్వామీ! శ్రీరామా అంటూ చక్కని పదాలతో సర్వ లఘు కందంలో స్వామిని వేడుకుంటున్న ఈ పద్యాన్ని వీక్షిస్తే రామా దర్శనానికి కవిగారి తపన ఆరాటం, ఉత్సాహం ప్రస్ఫుటమవుతుంది.

ఓ రామచంద్రా! నాకిక వృద్ధాప్యం వచ్చేసింది, శక్తి సన్నగిల్లింది. నీలో జేరే మార్గం నాకు జూపించండి స్వామీ అంటూ దీనంగా వేడుకుంటున్న ఈ వృత్త పద్య సుమాన్ని స్పర్శిద్దాం ఒకసారి.

శా॥ వృద్ధాప్యంబది వచ్చిజేరే బలమున్ వీర్యంబులున్దగ్గే నా
బుద్ధిన స్థబ్దతనిండే నింక నిరతమ్మున్ నాకు పూర్ణత్వ సం
సిద్ధింజేకుర జేసి బ్రోవుమిక నిన్ సేవింతు నెల్లపుడున్
శుద్ధ బ్రహ్మము నేను జేరుటెటులో సూచించుమా రాఘవా॥(71)109.

రామా! నీ దర్శన కాంక్షినై వేచి చూసి చూసి వృద్ధుడనైపోయానయ్యా. బలము, శక్తి సన్నగిల్లింది. బుద్ధిలో స్థబ్దత నిండుకుంది. ఇక నీ ధ్యాసే తప్ప మరొకటి లేదు. నీ శుద్ధ బ్రహ్మ లోకాన్నిజేరే మార్గం ఉండే సెలవియ్యండి స్వామి. నా చిన్నప్పటి నుండి నేను నీ సేవనే చేస్తున్నాను కదా నేను నీ వాడినిరా రామా. నన్ను కనికరించవయ్యా అంటూ దీనంగా అర్తిస్తూ తన భక్తి తత్వాన్ని తెలియజేస్తున్నారు కవిగారు ఈ విధంగా.

రాఘవా! రామచంద్రా! ఎందరికో మీరు ముక్తిని ప్రసాదించారు. చివరికి గుహుడు మొదలగు వారికి కూడా మోక్షం అందజేసినారు. మరి నేను నీకేమి తక్కువ జేసినానయ్యా రఘు పుంగవా! అంటూ స్వామిని భక్తి పారవశ్యంతో నిలదీస్తున్న వైనాన్ని ఈ క్రింది పద్యంలో వీక్షిద్దాం ఒకసారి.

ఉ॥ పట్టితి నీదు పాదములు పట్టినవారు తరించిరెందరో
పుట్టను బుట్టినీకు దయబుట్టగా రామ జపంబుజేసి యు
న్నట్టి మునీశ్వరుండు గనినట్టి పదంబులబట్టి ముక్తులై
నట్టిగుహాదులందరును నట్టులనన్ దయజూడు రాఘవా ॥ (74)110.

ఓ కోసల పురీషా! నే నీ పాదముల వీడను అలాగే పట్టుకుంటాను. గతంలో నీ పాదర్చన చేసిన వారెందరో తరించారు. నాకు నా మీద దయపుట్టే విధంగా ఏ క్షణమాత్రం విరామం లేకుండా నే నీ నామస్మరణ చేస్తూ ఉంటాను. ఎందరో మహానుభావులకు మరెందరో అదృష్ట వంతులకు నీ పాద స్పర్శ చేయగానే వారందరికి మోక్షమనుగ్రహించావు కదాయ్యా. వారందరు పునీతులైనారు గదా! అదే విధంగా నన్ను దయజూసి నాకు నీకృపా వర్షమును ప్రసాదించి, నాపైన మీ దయావర్షం కురిపించి నా జన్మకు సార్థకం జేగుర్చండి రాఘవా అంటూ ఎంతచక్కగా వేడుకుంటున్నారో గమనిస్తే మీ పవిత్రమైన పాదస్పర్శచే అందరికీ ముక్తి ప్రసాదించినారు మరి నాకు కూడా అలాగే కొనసాగించవయ్యా అంటూ వేడుకుంటున్న వీరికి రామునియందుగల అవ్యాజానురాగ మమకారాన్ని తెలియజేస్తుంది. స్వామీ రామచంద్రా!

శ్రీరాముడు ప్రేమైకజీవి అని అంటూంటారు మరి నాపైన ఏదయ్యా ఆ ప్రేమ నేనేమైనా అపరాధాలు జేశానా సెలవీయండి స్వామీఅంటూ చింతాక్రాంతుడైన కవిగారి ఈ పద్యాన్ని గమనిద్దాము.

ఉ॥ అందరి యందు ప్రేమ గలడందరు విజ్ఞులు నెల్లవేళ నా
యందును లేక పోవుటకు నే యపరాధము జేసియుంటినో
తొందరగల్గి వేడితిని దోచదు లోకమునందు నెల్ల నీ
వుండవటన్న సత్యమును నుల్లము నొప్పుగ దెల్పు రాఘవా ॥(65)111.

విజ్ఞులు అందరు మీరు అందరియందు ప్రేమ గలిగి యుంటారని అంటూ ఉంటారు. మరి నా యందేదయ్యా నేనెమైనా అపరాధాలు చేశానా చెప్పండి. లోకమంత మీరే ఉంటారని అంటారే ఆ సత్యమును ఋజువు చేయడానికి అయినా సరే మీరు నాకు కనిపించండొకసారి అంటూ ఎంత నిక్కచ్చిగా రామ దర్శన కాంక్షను కవిగారు తన ఆరాధ్యదైవమైన ఆ శ్రీరామచంద్ర మూర్తికి తెలుపుతున్నారో గమనించాము కదా! ఇది కవిగారి కవిత్వ లక్షణము.

రామభద్రా వందనం! జగదేక సుందరాకారా! చంద్రతేజో విభవా! ఓ రామచంద్రా! అందరికి ఆనందాన్ని పంచిపెట్టె ఓ శ్రీరామా! నీ భక్తుడనైన నాకు ప్రసున్నడవై ఆ ఆనందాన్ని చేకూర్చవయ్యా అంటూ రాముడిని శ్లాఘించిన వైనాన్ని ఈ పద్య సుమంలో పరిమళాన్ని ఆఘ్రాణిద్ధాం ఒకసారి

ఉ॥ వందనమయ్య రామ బుధవందిత శీల గుణాభిరామ నీ
యందము చందమామ ముఖమందు కళల్ గన సార్వభౌమ నీ
కుందగు భక్త ప్రేమ ఘనకోమల శ్యామల వర్ణ రామ యా
నందమే రూపమా యనెడి యాత్మయు నీవే సతంబు రాఘవా॥

(76) 112.

పండితులందరిచే వందనములందుకునే ఓ రామయ్య! నీకు నేను వందనం చేస్తున్నాను. ఓ గుణాభి రామా! ఓ శీల తేజోవిరాజిత నీ అందమైన మొము పున్నమి చందమామ వలె చంద్ర కళలతో పునీతమైన ఓ తేజో శీలి భక్తులపైన నీకు గల ప్రేమ అధికము ఓ శ్యామల వర్ణ నీ కమనీయ రూపమే ఆనంద రసాంబుధి. నీ ముఖ సౌందర్యముచే అందరిని ఆనంద పరచే ఓ రామా! నాకొక్కసారి దర్శన భాగ్యం కల్పించవయ్యా షోడశకళా ప్రపూర్ణుడవైన ఓరామచంద్రా అనిసంబోధిస్తూ శుక్లపక్ష చంద్రుని కళాభివృద్ధి దశల మాదిరిగానే శ్రీరామచంద్రుని తేజస్సు దినదినాభివృద్ధి

పొందుతూ వుందని స్వామిని షోడశ కళాప్రపూర్ణా రామచంద్రా అంటూ మదినిండుగా వేడుకుంటున్నారు. ఈ నిష్టాగరిష్టా పరుడైన రామకరామశర్మ సుకవి. నన్నాదుకోవయ్యా ఓ రామా ! అంటూ నీ కొరకు నే పడిన పాట్లు ఎన్నో నీకు దెలియనివా అంటూ స్వామిని ప్రశఙ్నిస్తూండే యీ పద్యాన్ని స్పర్శిద్దామొకసారి.

కం॥ నీ కభిమానము లేదా
నీకొరకై పడిన పాట్లు నీ వెరుగనివా
నీ కొమరుడ నే గాదా
నా కెవ్వరు దిక్కు బ్రోవ నరహరి రామా ॥ . (79) 113.

ఓ రామచంద్రా! నే నీ కుమారుడినయ్యా నాకింకెవరు దిక్కు నేను నీకొరకు ఎన్ని పాట్లు పడినాను నీ రామాయణ పారాయణాదులు ఎన్ని సహస్రాలు పూర్తిచేశాను సామ్రాజ్య పట్టాభిషేకాలు ఎన్నో చేశాను గదా రామా మరి నాకు దర్శనమిచ్చి నన్ను కృతార్థుణ్ణి జేయవయ్యా ఓ నరహరీ అంటూ ఆ శ్రీ రామచంద్రమూర్తిని భక్తితో ప్రార్థిస్తూన్న ఈ సన్నివేషం కవిగారిలోని అనురక్తిని, భక్తిని, ప్రేమను, అభిమానాన్ని, అనురాగాన్ని, అకుంఠిత దీక్షను,ప్రగాఢ విశ్వసనీయతను వారి పట్టుదలను శ్రద్ధను చెప్పకనే చెప్పుతుండడం వీరి అన్ని పద్యాల్లో కనిపిస్తూ వుంటుంది. భక్తిభావంలో ముంచిన పద్యాలు భక్తి మకరందంతో నిండిన పద్యాలు వీరిలోని రామ దర్శన కాంక్షను వినమ్రతను తెలియజేస్తూంటుంది.

స్వామివారి నామవైశిష్ట్యాన్ని తెలియజేస్తూ స్వామీ రామచంద్రా! నీ నామము పలుకవలెననినయది యమృత సమానము పిలిస్తే పలుకుతావని నమ్మకంతో పిలిచినాను రామా! నా తలపులు వ్యర్థం చేయకయ్యా అంటూ ప్రార్థించిన వైనం భక్తిప్రపత్తులు ఉట్టిపడే విధంగా ఉన్న ఈ పద్యాన్ని వీక్షజిద్దామొకసారి.

కం ॥ పలుకుల నమృతము లొలుకగ
బలికెదవని యాశతోడ ప్రార్థించితి నా
తలుపులు వ్యర్థము జేయక
పలుకననెడి దీక్షమాని బలుకుము రామా ॥ (81) 114.

రామదాసు భక్తకవి శ్రీ కంచెర్ల గోపన్నగారు పలికిన వాక్కులాంటి పద్యమిది "శ్రీరామ నీనామ మెంతోరుచి యెంతోరుచి "(71) అనే గేయం మాదిరిగా ఈ పద్యంలో అదే వైశజిష్ట్యాన్ని కనిప్పిజేశారు కవిగారు ఒకసారి ఆ పద్యాన్ని గమనిద్దామా.

కం॥ రామా నీ నామామృత
మేమోరుచి యేమోరుచి యెంతోరుచిరా
యీమాధుర్యముతో సరి
యేమాధుర్యంబు గలదె నిలలో రామా ॥ (82) 115.

మాధుర్యమును ఒలికించు మీ రామనామము ఎంతో రుచికదా ఎంతో రుచికరమైనదంటూ ఈ పద్యంలో ఋజువు చేశారు ఈ ప్రపంచంలో నీ నామంతో సాటి అయిన వేరే నామం లేదయ్యా అంటూ అత్యంత భక్తిశ్రద్ధలతో రామనామ మాహాత్మ్యాన్ని వివరించినారు.

దాదాపుగా ప్రతిపద్యంలో భక్తితత్పరతను కనిపింపజేశారు ఈ కవిగారు రామనామ శ్రేష్టత్వాన్ని అడుగడుగునా కనిపింపజేశారు వినిపింపజేశారు. కవిగారు తమదైనందిన జీవితంలో రామనామ చింతనను ఒక్కక్షణం కూడా వీడివుండకుండా భక్తిలో మునిగితేలినారు వీరు ఎందరికో ఆదర్శప్రాయులై నిలిచినారు. శ్రీరామపారాయణాదులు అంకితభావంతో పూర్తిచేసి చలామంది భక్తులకు రామనామ రామభక్తి ప్రాధాన్యతను కూలంకషంగా వివరించినారు. " మాతారామో మత్పితా రామభద్రః" అనే శ్లోక తాత్పర్యాన్ని వీరు స్వయంగా అనుభవించినారు అని తెలియజేయడంలో అతిశయోక్తి యిసుమంతైనా లేదన్నది వాస్తవం.

కవిగారు వీరి పేరులోని రామనామాన్ని సార్థకం చేశారు గ్రామంలోని భక్తులు ప్రజలు ఆబాలగోపాలము అందరూ వీరిని ఆదర్శంగా తీసుకుని తమ రామభక్తి పారవశ్యతను ప్రకకటింపజేసినారు. మన్నెంపల్లి గ్రామంలోని శ్రీ భూనీళా సమేత శ్రీలక్ష్మి చెన్నకేశవస్వామివారి మందిరంలో నిర్వహించే అనేకానేక కార్యక్రమాల్లో వీరి పర్యవేక్షణలో సర్వవైదిక సలక్షణయుక్తంగా యజ్ఞయాగాది క్రతువులు అన్నియూ అత్యంత వైభవంగా రమణీయంగా ప్రత్యక్ష పర్యవేక్షణలో నిర్వహింపబడుతూవుండేవి. భక్తులందరు తన్మయులయి కార్యక్రమాలను తదేకదీక్షతో వీక్షిస్తూ వుండేవారు.నేటికీ వీరిరచనలలోని భక్తిగీతాలు మంగళహారతులు పద్యాలు అదే దేవాలయంలో జరిగే కార్యక్రమాల్లో పఠిస్తూనేవుండడం పరిపాటిగా వస్తున్నది.

హారతి నీరాజనం, ఉత్తర నీరాజనం, వింజామర సేవ, జోలపాట, ఏకాంతసేవ వంటి పూజాకార్యక్రమాన్ని నెరవెరుస్తుంటానని తనపై స్వామి అనుగ్రహం ఎల్లవేళలా ఉండాలని స్వామి కరుణాకటాక్షవీక్షణలు తమకత్యంత అవసరమని కవిగారు కోరుకుంటున్నారు.

## : ఆంజనేయ స్తుతి :

ఆంజనేయస్వామి యందు అపరిమితమైన భక్తి ప్రపత్తులు తనకు రూఢిగా ఉన్నాయని రాముని దయ పొందాలన్న ముందు రామదాసుడు అయిన ఆంజనేయ స్వామిని ప్రసన్నం చేసుకోవాలని నమ్మి హన్మత్ ప్రసన్న యత్నంను కొనసాగించాడు కవి. ఈ పద్యంలో రామ దర్శనాన్ని కల్గించుటకు నీవే సమర్థుడవైయ్యా అంటూనే హన్మస్తుతిని ఆరంభించినాడు.

కం. అంతట రాముడెగలడని
సంతతమును నాకు ధృడము సల్పుము బుద్ధిన్
చింతించు దుష్ఠ మనసు ర
వంతయు లేకుండ జేయు బంటును హనుమా॥ (1) 124.

ఓ వీర హనుమా సర్వాంతర్యామి అయిన రామ తత్వాన్ని నిరంతరము నమ్మే స్థైర్య, ధైర్యాన్ని ధృడ సంకల్ప భలాన్ని చేకూర్చవయ్యా నా యందు ఆలోచనలో ఏ మాత్రము దుష్ఠ భావనలు రవంత కూడా లేకుండా చేసే భారము నీదేనయా హనుమా. నీవు రామునికి నమ్మిన బంటువు నేనేమో నీకు బంటును హనుమద్దాసును అంటూ వినయంతో స్తుతించడం వారికి భక్తి యందు గల ధృడ దీక్షను దాని సమగ్రతను వివరిస్తుంది.

జగదేకవీరుడైన శ్రీరామున్ని ప్రత్యక్షం చేసుకోవాలనే తపనను వివరిస్తూనే శ్రీరామా పరాక్రమాది సుగుణాలను వర్ణిస్తూనే ఎంతో గాఢంగా దీక్షతో స్తుతించినా సరే రామ దర్శనం కాలేదని చింతిస్తూనే తనప్రయత్నాన్ని మరోరూపంలో కొనసాగిస్తూన్నాడు.

అందులో భాగంగానే స్వామి దర్శనార్థమై స్వామికి అత్యంత ప్రియమైన భక్తుడు, శిష్యుడు, కింకరుడు, భంటు అయిన ఆంజనేయస్వామిని ప్రార్థిస్తే కనీసం వారైన తన దీనాలాపనను ఆలిస్తే తను కొరుకునే రామ దర్శనాన్ని కల్గిస్తాడని నమ్మకంతో తదేక దీక్షతో హనుమస్తుతినారంభిం చడు. తన మనసులో దుష్ఠ భావాలు చేర్చకుండా చూడవయ్యా ఓ హనుమయ్యా అంటూ దీనంగా ప్రార్థించడం ముదావహం.

భృత్యశ్చ భృత్య పరిచారిక భృత్య భృత్య అనే విశిష్ఠాద్వైత సిద్ధాంతంలో రామానుజీయ సిద్ధాంత వారులు అనుసరించే ఈ విధానాన్ని కవిగారు శ్రీ రామకరామశర్మ గారు కొనసాగిస్తూ స్వామి దర్శనార్థం కింకరుడిని ప్రసన్నం చేసుకుంటే తన మార్గం సుమార్గం అవుతుందని తద్వారా రామ దర్థనార్థం శ్రీ ఆంజనేయ స్వామిని

స్తుతించడం వారి ధృడ దీక్షకు సంకేతం.

శ్రీరామునికి దాసుడైన ఆంజనేయస్వామిని తనకు రామునియందు గల అచంచలమైన భక్తి విశ్వాసాలను వివరిస్తూ ఆంజనేయ గుణగణాలను చూద్దామా...

కం. రాముని ప్రియదూతవు శ్రీ
రాముని మదిలోన విడక రాత్రింబగలున్
రామ జపంబును చేయుచు
కామము క్రోధము జయించు ఘనుడవు హనుమా॥ (12) 125.

ఓ వాయు పుత్రా ! ఓ పవన తనయా ! నీవు రామునికి నమ్మిన బంటువు ప్రియమైన దూతవు శ్రీరామునికి అత్యంత ఆప్తుడవైన శిష్యుడవు. ప్రతినిత్యం నిరంతరం రామనామాన్ని పఠిస్తూవుండే శుభసంకల్పాన్ని కలిగియున్న సద్భక్త చింతామణివి నీవైయ్యా అంటూ రాత్రి పగలు అనే భేదం లేకుండా నిర్మలమైన మనస్సుతో రామనామ స్మరణ చేస్తూ, అరిషడ్ వర్గాలను జయించి కామక్రోధాది గుణములను ఆసాంతము తొలగింపజేసుకొని తాపస దీక్షతో శ్రీ రామ నామ జపసహస్రాధిక యజ్ఞ నిరతుడవై ఘనుడవనే ఖ్యాతి గాంచగలిగావయ్యా అంటూ కవిగారు శ్రీ ఆంజనేయస్వామి వారిని కీర్తిస్తున్నాడు.

సమాజంలోని మానవులు త్రికరణములలో దైవచింతననే భావిస్తూ భగవన్నామ స్తుతిని కొనసాగిస్తూ, ఎవరైతే చరిస్తూ ఉంటారో అటువంటివారు గొప్ప ధార్మిక శ్రేష్టులవుతారని కవి గారు భావస్తూ కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సార్యాది అరిషడ్ వర్గాలను జయించిన వారు నిష్కల్మశ హృదయులై శ్రీరామ ధ్యాన జప, తప, తర్పాణాది సత్కర్మలలో నిమజ్ఞులై ఉంటే అటువంటి వారికి తప్పకుండా దైవ దర్శనం సాక్షాత్కారం అవుతుందని శ్రీమాన్ రామక రామ శర్మ గారి భావన.

నిరంతర రామనామ జపయజ్ఞము అనునది గొప్పశక్తికి నిదర్శనం అని కవిగారి భావన. అందేకే అది కేవలం రామభక్తుడైన ఆంజనేయ స్వామికి మాత్రమే సాధ్యమవుతుందని, వేరే ఎవరికి సాధ్యం కాదని విశేషించి మానవుల కేరికి సాధ్యము కాదని కవిగారికి నిశ్చితాభిప్రాయం. ఓ రామా దూత చిరంజీవి, వానరవీర, నీలాంటి వజ్ర శరీరులకు, ధృడ దీక్షులకు కఠినమైన భక్తి ధ్యానంగలవరికి మాత్రమే ఈ ఘనత లభిస్తుందని అరిషడ్వర్గాలను జయించడం జరుగుతుందని అందుకే నీకింత ఘనత

చేకూరిందని కవిగారి గట్టి నమ్మకం.

అందుకే రాత్రి పగలు అనే బేధం లేకుండా రామనామ జపమనే యజ్ఞ దీక్షలో నిత్య హోతగా కనిపించే వాడు ఆంజనేయుడు మాత్రమే అని అటువంటి ఘనుడైన ఓ ఆంజనేయా! నన్ను కరుణిస్తూ, నాకు రామ దర్శనాన్ని కల్గింపజేస్తూ, ఆ సద్భాగ్యాన్ని చేకూర్చి కృతార్థున్ని చేయవయ్యా ఓ హనుమా అంటూ దీనంగా హృద్యంగా హనుమస్తుతి కొనసాగుతుందీ శతకంలో. స్వామిని ఆత్మబంధువుగా చిత్రీకరిస్తూ ఓ స్వామీ, నిన్ను కొలిచే వారందరికి నీవు ఆత్మబంధువువే నయ్యా నీతో సరి వేరేదైవ్యం ఎవరు లేరయ్యా అంటూ కీర్తిస్తున్న ఈ పద్యాన్ని పరిశీలిద్దాం.

కం॥ ఊరూరా నుండి జనులకు
తీరని బాధలను బాపు ధీరుడనీవే
లేరెవ్వరు నీతో సరి
ఔరా నీవాత్మబంధుడేగదా హనుమా॥ (14) 126.

దీనజన బాంధవా ! ఆర్తత్రాణ పరాయణా గ్రామాగ్రామాలనుండి ఎందరో భక్తులు నిన్ను ఆర్తితో కీర్తిస్తూ, స్తుతిస్తూ, శ్లాఘిస్తూ, కిర్తిస్తూ ఉంటారని వారివారి తీరని బాధలను తీర్చే ధీరుడవు నీవే నని స్వామిని ప్రార్థిస్తూ నీతో సరి వేరే దైవం ఎవరూలేరని ఓ స్వామి నీవందరికి ఆత్మబంధుడవయ్యా, నిన్నందరూ ఆత్మ బంధువుగా భావిస్తూ, కీర్తిస్తుంటారని కవి గారి భావన అందుకే స్వామిని స్తుతిస్తూ, ఓ ఆంజనేయ స్వామి, ఓ మారుతాత్మజా, శ్రీరామ చంద్రుని దర్శనం నాకు కల్గించి, నన్ను ధన్యుణ్ణి చేయవయ్యా అంటూ ప్రార్థించడం కవిగారి ధృడ దీక్షకు నిదర్శనం. కవిగారు రామబంటు హనుమను ప్రార్థించడంలో అర్థం ఇదే రామదర్శనం కొరకు భక్తులుపడే యాతనలు నీవుకూడా ఎరిగినవాడివే కనుక హనుమా నాబోటివాడికి స్వామిదర్శనం నీవేకలిగించగలుగుతావని వీరి భావన.

ఆంజనేయ స్వామి యందు కవిగారికి ఎంతనమ్మకం ఉందో వీరి సంబోధనాత్మక పద్య పాదాల ద్వారానే తెలుస్తూ ఉంది. అందులో భాగంగా ధీరుడవీవే, ఔరా నీవాత్మబంధువు, లేరెవ్వరు నీతోసరి అంటూ వాదోపవాదాలు గుప్పిస్తు, హన్మతత్వాన్ని దర్శింపజేస్తూ శ్రీరాముని దర్శన భాగ్యం అందించే సమర్థత వారికేవుందని కవిగారి నమ్మకం. అందుకే బాధలను దూరం చేసే ధీరుడవు నీవేనని జనులందరి నమ్మకం. ఆ జనుల నమ్మకాన్ని అనునిత్యం పాటించేవారు. అంతేకాదు ఆ బాధలను తీర్చే విషయంలో మీకు సరియైనవారు వేరే దైవం ఎవరూ లేరయ్యా అంటూ దీనంగా శ్రీ రామ భక్త హన్మాన్ గారిని వేడుకుంటూ ఉన్నారు.

ఓ స్వామీ! నీవందరికి ఆత్మబంధువైనావయ్యా అంటూ నిను గొలుచు వారికీవేరక్షా! అని భావిస్తూ,శ్రీ రామక రామశర్మ గారి ఎంత సౌమ్యంగా స్వామి వారిని కీర్తిస్తున్నారో చూడండి. ఔరా! మీరాత్మబంధువే కదా అని ఆంజనేయస్వామికి భక్తులకు గల బాంధవ్యాన్ని చుట్టరికాన్ని గుర్తుకు చేయడం కవిగారి ఆలోచనా శక్తికి భక్తి చింతనకు ఇది మరో నిదర్శనంగా నిలిచి పోతుంది. రామ దర్శనంకొరకై తహతహలాడే భక్తి చింతన గల కవిగారు రామదాసుడైన ఆంజనేయ స్వామిని నుతించడం, కీర్తించడం స్వామి యందు గల తన భక్తికి ఒక దృష్టాంతం. ఓ హనుమా ! గ్రామీణ పౌరులు నీ భజనలు, పారాయణాదులు, సుందరకాండాది హవనాదులు నిరంతరం ఆచరిస్తూ, నిర్మలమైన మనస్సుతో స్తుతిస్తూ ఉంటారు. అంటువంటి వారికి నీవే దిక్కని నమ్మి యున్నారు. ధైర్యంతో మహావీరుడవై వారి కష్టాలను తీర్చే శక్తి మీకు మాత్రమే ఉందని వారి విశ్వాసం.

అటువంటి భక్తులలో నేను ఒక భక్తుడనేనని నాకా గుర్తింపునందజేయాలని కోరుతూ శ్రీరాముడు నీ ప్రభువు, నీవు పిలిస్తే పలికే దైవం, కావున వారి దర్శనం నాకు మీరే కల్గించ సమర్థులు అంటూ కవిగారు హన్మన్నుతి చేయనారంభించినారు. ఓ హనుమా ! ఓ మర్కటేశా! నీవు ఆపన్నుల రక్షించాలనే దీక్షా బధుడవైయున్నావని తెలిసి నిన్నాశ్రాయించినానయ్యా అంటూ వినయ విధేయతలు ఉట్టి పడేట్లుగా హనుమను ప్రార్థించిన ఈ పద్యాన్ని పరిశీలిద్దాం.

కం. నిన్నాశ్రయించితిని యా
పన్నుల రక్షించు దీక్ష బట్టితివని ని
న్నెన్నడు కోరికలడుగన్
నన్నెప్పుడు విడువకయ్యా నమ్మితి హనుమా ॥ (5)

ఓ మారుతాత్మజా ! ఓ కపీశ్వరా ! ఆపన్న రక్షా అనే దీక్షను చేపట్టిన లోక రక్షకుడవీవని భావించి మిమ్మాశ్రాయించ బూనినానయ్యా, ఆ ఆపన్నులలో నేనొకన్నిగా భావించి ఈ దీనుడిని కాపాడవలసిన బాద్యత నీదేనయ్యా అంటూ స్వామి వారికి కర్తవ్య నిర్థేశణము చేయబూనడం కవిగారి భక్త్యావేశానికి ఓ నిదర్శనం నిన్నేమి ఆశించనయ్యా, నీవద్దే నేనుండునట్లు అనుగ్రహింపుమయ్యా అంటూ అర్పిస్తూ, స్తుతించాడీ పద్యంలో.

కవిగారు కరీంనగర్ పట్టణంలోని వీరాంజనేయ స్వామి దేవాలయంలో పుత్రుని వద్ద ఉన్నప్పుడు నిరంతర ఆరాధన కార్యక్రమాలలో తలమునకలై అనేక విధాలుగా భజిస్తూ, కీర్తిస్తూ, పారాయణ, భవనాది కార్యక్రమాలు నిర్వహిస్తూ, సామ్రాజ్య పట్టాభిషేకాది వినూత్న కార్యక్రమాలకు సృష్టికర్తయై నిరంతర రామానామ స్మరణ రామాకోటి

లేఖనం సామూహిక రామకోటి లేఖనమనే యజ్ఞంలో నిరంతరం పాల్గొని యుండడం వలన ఆంజనేయ స్వామిపై అంత మక్కువ ఏర్పండింది కవిగారికి. అందువల్లనే స్వామిపై తనకంత హక్కు కలదని కవిగారి స్వయంగా నాకు చెప్పడం జరిగింది. (పరిశోధకుడి బాల్యంలో).

నేను (పరిశోధకుడు) బాల్యంలోయుండగనే 4, 5వ తరగతి ఆ ప్రాంతంలో హనుమాన్ చాలిసా మాతో కంఠస్తం చేయించేవారు. 5వ తరగతిలో అమరకోశం స్వయంగా నాకు చెప్పించి కంఠత అయ్యే విధంగా చేశారు. అటువంటి సమయంలోనే ఆధ్యాత్మిక రంగంపైన నాకు భక్తి భీజాంకురాలు నాట గలిగారు. వీరితోనాకు స్వయంగా పదిపదిహేను వత్సరాల సాన్నిహిత్యం ఏర్పడింది. ఒకే గ్రామము అవడం మూలంగానే, ప్రక్కింటివాల్లమవడం మూలంగానో వారి మనుమడు రామక పాండురంగ శర్మ సంస్కృతోపన్యాసకులు హత్నూరు, జి॥మెదక్ గారు నాకు బాల్య స్నేహితులవడం మూలంగానో, వారి ప్రత్యక్ష శిష్యరీక భాగ్యం నాకు కలిగింది. అది నా మహదృష్టంగా నే భావిస్తున్నాను. (పరిశోధకుడు) నేను ఈ విద్యారంగంలో యీ స్థితికి రావడానికి కారణం వారివద్ద నేను కొన్నాళ్ళు శిష్యుడిగా ఉండడం వల్లనేమో అనుకుంటున్నాను. శ్రీమాన్ రామక రామశర్మ గారి భక్తి చింతనలో భాగంగానే ఈ శ్రీమదాంజనేయ స్తుతి వెలుగులోకి వచ్చింది. ఇందులో స్వామివారిపై తనకు గల భక్తి ప్రపత్తులను అద్భుతంగా ప్రకటింపచేయడం ముదావహం. పాఠకులు అందరూ కూడా దీనిని పఠించి, ప్రశాంతతను అందియున్నారు.

కవి గారు ఎంత వినయశీలుడో, ఎంత నిగర్వియో ఈ పద్యమే నిరూపిస్తుంది. ఓ హనుమా ! ఈ శతకం రాసే శక్తిని నాకియ్యవయ్యా. నీవు నా అంతః కరణంలో చేరి నిలిచి నాకు కవిత్వ పటుత్వ శక్తిని అందించవయ్యా అంటూ కోరుకునే ఈ పద్యాన్ని ఒక సారి వీక్షిద్దాం.

కం. వినుమయ్యా నీదు శతకం
బును రచియించుటకు నాకు బుద్ధినొసగి నీ
వూ నా యంతః కరణం
బునజేరియు వాక్పటుత్వ మొసగుము హనుమా ॥ (26) 127.

ఓ స్వామి ! ఓ హనుమా ! నీ శతకం రిచించే బుద్ది నాకొసగుమయ్యా. అందుకు గాను నా అంతః కరణంలోచేరి నిలిచి నాకు వాక్పటుత్వమును వాక్శక్తి సరస్వతి మాత అనుగ్రహము కవిగారు ఎంత లోతుగా యోచించాడో మనం గ్రహించవచ్చు. వాక్కుకు అదీశ్వరి, వాగాధీశ్వరీ, వాగ్దేవి. అటువంటి వాగ్దేవి ప్రసాదితమైన పటుత్వమైన వాక్శక్తిని

నాకొసంగుమయ్యా అంటూ తాను నమ్మిన రామబంటు హనుమను ప్రార్థించడం వాక్పటుత్వ శక్తి యుంటేనే కవిత్వం వ్రాయగలరు. అందమైన కవిత్వం వ్రాయగలినవారే కవీశ్వరులు కాగలుగుతారని అటువంటి కవిత్వ సంపద గలవారే నీ శతకం రాసేందుకు అర్హత పొందినివరవుతారని, కావున ఓ హనుమా! నాకా శక్తినీయగల కడు సమర్థుడవు నీవేనయ్యా అని వేడుకోవడం కవిగారి కవితా శక్తికి ఒక దృష్టాంతం.

ఓ హనుమా నాకు తెలిసి మీరొక భక్తున్ని అనుగ్రహించారు. నాకటువంటి దర్శన భాగ్యం అందించండి స్వామి అంటూ వినమ్రంగా ప్రార్థించిన వైనాన్ని ఈకింది పద్యంలో వీక్షద్దాము.

కం. తులసీ దాసుని మనమున
నిలిచితి నినుదలచినంత నీ దయచేతన్
కలకాలము నీ దాసుడ
నిలువుము నా హృదయమందు నిరతము హనుమా.॥ (27) 128.

ఓ స్వామీ శ్రీరామ చరితమానస రచించిన మహా కవి శ్రీమాన్ తులసీ దాసు గారిని అనుగ్రహించినారు కదా. అతడేమి ఎక్కువ చేశాడు. నేనేమి తక్కువ చేశాను. రామాదాసు కీర్తనలో వలె శబరినీకు చుట్టమా............. వలె తులసీదాసు మిమ్ము మనః పూర్వకంగా అభ్యర్థించారు, అర్థించాడు, ప్రార్థించాడు, స్తుతించాడు, కీర్తించాడు. అదే విధంగా నేనుకూడా మిమ్ము అర్తిస్తూ, కీర్తిస్తూ, నుతిస్తూ, స్తుతిస్తూ, ప్రార్థిస్తున్నాను. నామ పారాయణ కోటి జన్మములను నిర్వహించానయ్యా మరి నాకేది నీ దర్శనం అంటూ కలకాలం, నీ దాసదాసుడనైనా నా హృదయమందు మీరు శాశ్వతంగా నిలిచి యుండండి అంటూ వినయపూర్వకంగా అర్థించడం కవిగారి భక్తి చింతనకు ఇదో గొప్ప నిదర్శనం. ఓ స్వామీ! హనుమా! నే బ్రతికియుండగనే నాకు మీ దర్శనభాగ్యం కలిగించండి. ఎందుకంటే ఈ తనువు అశాశ్వతం గదా అందుకే నాకు జ్ఞానబోధ చేయండి స్వామీ అంటూ ప్రార్థించడం కవిగారి శ్రేష్ఠత్వాన్ని నిరూపిస్తోంది.

కం.. ఈ తనువశాశ్వతము గద
చేతనముండగనె దృఢము సేయుము నాకున్
బ్రీతిగ భక్తి జ్ఞానము
చేతను వైరాగ్యమిమ్ము చిన్మయ హనుమా ॥ (31) 129.

ఓ స్వామీ మానవ జీవితము నిమిత్త మాత్రమే ఈ శరీరం అశాశ్వతం చేతనం ఉండగనే బ్రతికియుండగనే నాకు మీ దర్శనభాగ్యం కల్గిస్తారని వాగ్దానం చేయండి.

ప్రేమతో భక్తిని, జ్ఞానమును ప్రసాదించండి స్వామీ ఓ చిన్మయా, ఓ సద్రూపా, ఓ కపపీశ్వరా, ఓ మారుతాత్మజా,జ్ఞానార్థుడనైన నేను మిమ్ము ప్రేమతో స్తుతిస్తున్నాను నా యీ మొరనాలకించి నాకీ జ్ఞాన ప్రదానంజేసి దర్శన నా యీ మొరనాలకించి నీకు జ్ఞానప్రదానంచేసి దర్శన భాగ్యం కల్గించ వయ్యా అంటూ వినమ్రతతో ప్రార్థించడం కవిగారి భక్తి అకుంఠితత్వానికి నిదర్శనము.

ఇందులో కవిగారికి స్వామివారిపైన ఎంత నమ్మకంవుందో మనం గ్రహించవచ్చు. నేను శాశ్వతంగా జీవించియుండడం సాధ్యంగాదు కావున జీవించియుండే యీరోజులలోనే నాకు దర్శనం అందించండి స్వామీ ఆ మహద్భాగ్యాన్ని నాకు కల్గించండి స్వామీ అంటూ వేడుకోవడం కవిగారి భక్తిచింతనకు ఓ ప్రబలతార్కాణం.

నాబోటి మానవ మాత్రులకు మిమ్ము ప్రార్థించడం సాధ్యమా ! గొప్పగొప్ప వాళ్ళకే సాధ్యంకాని మీ దర్శన భాగ్యం నా బోటి వాడికి దొరకగలుగుతుందా అంటూ ఆశ్చర్య సంభ్రమములను ఈ పద్యంలో వివరిస్తారు చూద్దాం.

కం.　సనకాది మహా ఋషులును
　　వనజాసనుడైన గాని వాసవు డేనిన్
　　నిను బొగడజాలరన్నను
　　మనుజులకు నుతింప శక్యమగునా హనుమా ॥　　(34) 130.

ఓ స్వామీ! సనకుడు సనత్కుమార, సనత్సుజాత, సనకసనందనాది మహాఋషులందరూ ఋగ్, యజు, స్సామాధర్వణ వేద గీతాలలో ఋక్కుల్లో కీర్తించినా మీ దర్శనభాగ్యం కలగడం చాలా కాలానికి గాని సాధ్యంకాలేదు. అలాగే వనజాసనుడు వాసవుడైనా గాని ఓ హనుమా నిన్ను బొగడజాలకున్నారయ్యా మానవమాత్రుడనైన నేనెంతటివాడను అంటూ ఆ స్వామినే ప్రశ్నించబూనుకోవడం చాలా గొప్పవిషయం అని భావించవచ్చు. ఇందులో మరో సూచ్యార్థం గొప్ప గొప్ప వారికే సాధ్యం కాలేదు మిమ్ము కీర్తించడం నాబోటివారికెలా అవుతుంది అంటూ అమాయకత్వాన్ని ప్రదర్శించడం మరో విషయంలో మహర్షులకే కాలేదు. నాబోటి నిష్టపరులకు యిదెలా సాధ్యం అంటూ వినమ్రంగా అర్థిస్తాడు.

----0----

వివిధ కథాంశాలు

ఈ పద్యంలో హనుమద్జననమునకు కథాంశమును చూపించారు. అటువంటి ఘట్టము ఉదాహరించిన ఈ పద్యాన్ని వీక్షిద్దామొకసారి....

కం॥ హనుమా నీదగు జననం
బును నే వినియుంటి నదియిపుడు వచియింతున్
మునుపు పరాశర సంహిత
యను గ్రంథమునందు నున్నదదియే హనుమా ॥ (34) 153.

ఓ స్వామీ హనుమా పరాశరసంహిత యందు మీ జన్మచరిత్ర గాంచినానయ్యా అది ఒక ప్రామాణిక సంహిత అందులో మీ జన్మరహస్యాంశాలు నే గ్రహించానయ్యా అంటూ ఆసంహితలో తాను కనుక్కున్న అంశాలను ఎంతచక్కగా వివరించినారో ఈ పద్యం ద్వారా మనం తెలుసుకుందామా...

పరాశరుడు మైత్రేయునికి జెప్పిన అంశమును ఆమునిద్వారా తెలిసిన విషయాలను ఈ విధంగా వివరించగలిగారు. పరమేశ్వరుడు పార్వతి సరససల్లాపాల్లో నుండగా జరిగిన అంశమును యీక్రిందిపద్యంలో తెలియజెప్పారు. పరమేశ్వర పార్వతి........॥ హరుని తేజము భరించలేక ఆ జనని పార్వతి ఆంధోళన చెందుతూ ఆ తేజాన్ని అగ్నికి నొసగగా ఆ హుతవహుడు గూడా భరించలేక వాయుదేవునికి ఒసగినాడని ఆ తాపాన్ని భరించలేక ఆ వాయువు భూలోకంలో తిరుగుచుండగా కేసరి పత్ని అంజనీదేవి పుత్ర సంతానముకోరి తపస్సులో యుండగా ఈ వాయుదేవుడు ఈ ఈశ్వర తేజాన్ని అంజనీదేవికి యివ్వడం జరిగింది. అప్పుడు అంజని ఈ విషయం తెలియక ఏర్పడిన గర్భమునుచూసి ఆశ్చర్యంతో భయపడుతూండగా అప్పుడు ఆకాశవాణి ద్వారా ఈ మాటలు వినిపించినాయని చెప్పినారు.

కం॥ ఆకాశవాణి బల్కెను
నీకేమి భయంబు లేదు నీ గర్భమునన్
లోకోద్ధారక పుత్రుడు
నీకుద్భవమొందునంచు నిష్టత బల్కెన్ ॥ (39) 154.

ఆకాశవాణి మాటలు విని అంజనీదేవి వైశాఖ శుద్ధ పూర్ణిమరోజు నిన్ను ప్రసవించింది. అదే వైశాఖ శుద్ధ పూర్ణిమ మీ జయంతిదినంగా నేటికినీ కలియుగ మానవులు మహాపర్వదినంగా భావిస్తూనేవున్నారన్నది అందరి అనుభవంలో వున్నదే అందుకే ఆ వైశాఖ శుద్ధ పూర్ణిమ శుభతిథి రోజున కోటానుకోట్లుగా మిమ్ము కొలుస్తూ

వున్నారని ఈ హనుమద్ వృత్తాంతంలో కవిగారు శ్రీమాన్ రామక రామశర్మ గారు ఆ కథాంశాన్ని ఎంతో భక్తి ప్రపత్తులతో తెలియజేశారు. ఈ అంశాలను వినిన భక్తబృందము అందరూ ఎంతగానో సంతోషిస్తూ కవిగారి భక్తిచింతనను అభినందించడం జరిగింది. ఇలా ఎన్నో తెలియని అంశాలు పాఠకలోకానికి అందించడంలో కవిగారు ఎంతో అభిమానాన్ని మూటకట్టుకోవడం జరిగింది.

2. సూర్యబింబము ఆహారమని ఫలంగాభావించి లంఘించిన కథ

అంజనీదేవికి వాయుదేవుని వరప్రసాదంగా జన్మించిన మహాబలవంతుడు తేజోశీలి అయిన వరప్రసాదుడు బాలాంజనేయస్వామి బాలుడుగా వుండగనే తన మాహాత్మ్యాన్ని ప్రపంచానికి చాటదలిచాడా అన్న చందంగా తనకు ఆకలిగా వుందని కిటికీలోంచి ఆకాశంలో కనిపించే లేలేత భానుడిని వీక్షించి అది మధురఫలమని భావించి దాని సాధనకై ఆహారాన్వేషణలో భాగంగా ఆకాశంలోకి ఎగిరి వెళ్ళిన హనుమన్మహిమను వారి ఘనతను మరియు హనుమ దేనినైనా చాలా సులభంగా తీసుకుంటూబాల్యంలోనే ఘనతర లీలలు చూపిస్తూవున్న సంఘటనలను ఈ క్రింది పద్యంలో చూద్దాం.

కం॥ అమ్మా యాకలి యయ్యెను
యిమ్మా యేదైన ఫలము యిప్పుడె యనగా
సమ్మతితో అంజనియనె
కమ్మని ఫలమిత్తు నీకు గనుమనె హనుమా ॥ (46) 155.

కం॥ అనగనె మీదికి జూచితి
గనబడెనట సూర్యబింబ కాంతి ఘనంగా
మినుముట్ట ఎగిరి పండను
చునుమ్రింగితి నీదుమహిమ చోద్యమెహనుమా ॥ (49) 156.

అలా సూర్యుణ్ణి ఫలముగా భావించి మ్రింగగానే త్రిలోకములన్నీ అంధకార బంధురమై పోయాయి ఆగ్రహించిన దేవేంద్రుడు మహాకోపంతో బాలాంజనేయుడిని ఎదుర్కొనగా వజ్రాయుధఘాటికి బాలహనుమ మూర్ఛను పొందాడు. తద్వారా అంజని కేసరి దంపతులు మిగుల రోదించారు అందరూ కలిసి పరమేశ్వరుణ్ణి ప్రార్థించగా వెళ్లినారు. దేవతలు, ఋషులు, పరమేష్ఠి, శివుడు, విష్ణువు వద్దకు వెళ్లి ప్రార్థించినారు. ఈ బాల హనుమానుని బ్రతికించమని వేడుకున్నారు. అప్పుడు దేవతలందరు కలిసి బాలుడైన ఆంజనేయ స్వామిని పునరుజ్జీవింపజేసి చిరంజీవిగా ఆయుష్మంతునిగా చిరకాలము వర్థిల్లమని దీవించినారు.

ఈ విధంగా మైత్రేయుడు పరాశరునికి వినిపించిన ఈ హన్మత్ సూర్య విషయాన్ని శని హనుమ వృత్తాంతంలో పొందుపరచి పాఠకులకు ఉత్సాహాన్ని, ఆనందాన్ని తీర్చి దిద్దడం జరిగింది. స్వామి వారికి తమాల పత్రములతో అర్చన,

జిల్లేడు పుష్పములతో మాల అలంకరింపజేయడం ఒక విధిగా తీర్చిదిద్దబడింది. ఇది ఒక ఆచారంగా నేటికిని కొనసాగించ బడుతుంది. హనుమత్ భక్తులు ఆంజనేయ స్వామిపై ఎనలేని భక్తి విశ్వాసాలతో స్వామి వారిని అర్చిస్తూ, తాదాత్మ్యాన్ని పాలుపంచుకోవడం వర్తమాన కాలంలో అందరు చూస్తున్నా అనుభవైక వేద్యమైన విషయంగా భావించవచ్చు.

హనుమద్భక్తిని వర్ణించిన విధానము చాలా శోభాయమానమని భావించవచ్చు కవిగారికి ఆరాధ్యదైవాలలో హనుమడొకరు వారొకసందర్భంలో యేదో ధార్మికోపన్యాసములో ఇలా చెప్పియున్నారు హనుమంతుడిని సంతృప్తి చేస్తేనేగదా నాకు శ్రీరామ దర్శనభాగ్యం కలిగించడంలో కాస్తో కూస్తో సాయమందిస్తాడు యీ హనుమ స్వామి భక్తి పరాయణుడు యైనట్టి యీ భక్త మనుమను ముందు ప్రసన్నత చేసుకోవడం అత్యంత ప్రాధాన్యమని వివరించేవారు ఆక్రమంలో భాగంగానే యీ రచనలు అని వారే వివరించడం గమనార్హం.

కం॥ కవిగారి భావనంబులు
కవి కలమున భక్తి నింపి కమనీయంబౌ
నవ విధ భక్తులు దెలుపుతు
కవి గాథలు జనుల మదికి కదిలెను ముదమై ॥ 157.

--×--

# చెన్నకేశవ శతకము - ఆధ్యాత్మిక నేపథ్యం

శా॥ శ్రీవైకుంఠ పురమ్మునుండి యిటకున్ శ్రీ భూమినీళాసతుల్
సేవింపంగ సుపర్ణవాహనుడవై శ్రీఘ్రంబుగా వచ్చియు
న్నావా మన్నెముపల్లి కోవెలను నో నారాయణా మాకిదే
శ్రీ వైకుంఠము మోక్షధామమిదె మా చిత్తంబులో కేశవా॥(1) 158.

ఇది ఈ శతక ప్రారంభ పద్యము, "మంగళాదీని మంగళమద్యాని, మంగళాంతాని"

అన్న పూర్వ సాంప్రదాయాన్ననుసరించి శ్రీకారంతో ప్రారంభించడం గతంలో 11 శతాబ్దంలో నన్నయ భారతాంద్రీకరణంలో శ్రీవాణీ గిరిజాశ్చిరాయ--- వలె ఎత్తుగడ శతకంలో నాయకుడు కేశవుడు అనగా విష్ణువు, అంశం భక్తి అది చూపిస్తు విష్ణువు ఎక్కడ వుంటాడో తెలియజేస్తూ ఆప్యాయంతో శ్రీ వైకుంఠపురంబులో నివసించే ఓ శ్రీహరి అక్కడ నుండి భూలోకంలోని మా గ్రామములోనికి అయ్యా, తమరుండే వైకుంఠపుంబులోనుండి శ్రీ భూనీళాదేవతలు సేవిస్తూ ఉండగా గరుడవాహనంపై రండి అంటూ ఆహ్వానిస్తూ ఉండడం నిత్య సమాజంలో మానవులు ఏదైనా ఒక శుభకార్యానికి ఎవరినైనా ఆహ్వానిస్తున్నపుడు బంధుమిత్ర సపరివార సమేతంగా అని ఎలా ఉదహారిస్తారో అలాగే స్వామి! శ్రీదేవి, భూదేవితో సహ విలాసంగా గరుడ వాహనంపై నెమ్మదిగా కాకుండా శీఘ్రంగా వెంటనే వేగంతో రమ్మని హృదయపూర్తిగా ఆహ్వానిస్తాడు. మరి వేగంగా ఎందుకు? ఆర్తత్రాణ పరాయణుడవైన ఓ శ్రీహరి నీ భక్తులను ఆదుకోనే నెపంతో మా గ్రామములోని దేవాలయంలోకి వేంచేయవయ్యా అంటూ కేశవ స్వామిని వేడుకుంటాడు. అందుకే మాకు ఇదే శ్రీవైకుంఠం, ఇదే మోక్షధామము అని కవిగారు భావిస్తారు. భక్తుల హృదయాల్లోని ఆవేదనను అనురాగ పూరితంగా ఈ పద్యంలో చెప్పడం జరిగింది.

ఇందులోని క్రమం గమనిస్తే శ్రీ వైకుంఠం ఊర్ధ్వ లోకంలో ఉంటుంది. అక్కడినుండి మా గ్రామానికి మీ సేవకుడైన ఖగపతి వాహనంపై మీ సేవలకు ఎలాంటి లోటు కానీయమంటూ దేవాలయంలోకి ఆహ్వానించడము ముదావహము. ఓ స్వామి మీరు ప్రీతిగా భావించే శ్రీ వైకుంఠ పురమే మా ఈగామము అని నివేదించడము భక్తునికి, భగవంతునికి గల అనుబంధాన్ని తెలియజేసే సుమధురమైన శక్తివంతంబైన పద్యమిది.

కేశవ స్వామి గొప్పతనమును వర్ణిస్తూ వారిని శ్లాఘించిన విధానమును పరిశీలిస్తే వీరి భక్తి తత్వము అంచంచలమని నిరూపిస్తూ ఈ పద్యం....

ఉ॥ శాంతుడు శేషశాయి కలుషంబులడంచెడివాడు విజ్ఞతా
బ్రాంతులు సర్వశేషి సురసన్నుత దుర్మతుండాదిశేషుడే
కాంతుడు శ్రీనివాసుడు సుగాన విలోలుడు కర్మసాక్షి శ్రీ
కాంతుడు విష్ణు భక్తులను గాంచెడి మన్నెముపల్లి కేశవా..(12) 159.

ప్రథమంగా శాంతుడు, శేషశాయి, కలుషంబులడంచడెవాడు, విజ్ఞతాశ్రాంతుడు, సర్వశేషి, సురసన్నుతుడు, అచ్చుతుడు, ఆదిశేషుడు, ఏకాంతుడు, శ్రీనివాసుడు, సుగానవిలోలుడు, కర్మసాక్షి, శ్రీకాంతుడు, విష్ణు భక్తులను గాంచెడు మన్నెముపల్లి కేశవుడు. ఎన్ని సంభోదనాత్మకములు? విష్ణువుకు గల లీలా విశేషములను ఇందుమూలంగా పేర్కొన్నాడు. దాదాపుగా 16 షోడషనామాలలో స్వామిని కీర్తించడం ఇదీ పద్యం. భక్తి రసంలో మునిగిన కవిగారి లేఖిని నుండి జాలువారిన అద్భుత కవితాఝురి అని దీనిని నిరూపణాత్మకముగా నివేదించినాడు.

కవిగారి భావనలో స్వామికి తానెంత దగ్గరివాడో ఎంత బంధుసముడో నిరూపిస్తూ ప్రాధేయ పడినా వైనాన్ని ఈ పద్యంలో గమనిస్తే కవిగారికి స్వామివారి పైన ఎంత అవియాజానురాగమో గమనించవచ్చు.

చ॥ పిలిచిన వచ్చువాడెనడు పేరులభించెను స్వార్థమేమి? నే
బిలిచిన రావదెందుకని పెద్దతనంబునకేమి భంగమౌ
తలచెదనిన్ను దాసుడను దర్శనమిచ్చిన నీకె కీర్తి నా
కిల మోక్షమీయదిక్కు ననునేలుము మన్నెముపల్లి కేశవా॥(16)160

ఎంత చక్కని వేడుకోలు కవిగారి తపనలో గాంచినచో ఓ స్వామి నీకో మంచిపేరుంది నరసింహా అవతారంలో గజేంద్రమోక్ష ఘట్టనలో పిలిస్తేనే వచ్చేవాడని ఒక మంచి పేరు వచ్చింది. అది ఆయా సందర్భంలో నిరూపించుకున్నావు. మరి నే పిలిచినచో రావెందుకయ్యా? అని స్వామిని తన వాడిగా చేసుకొని ప్రశ్నిస్తాడు. అంతే కాదు పెద్దతనంబునకేమి భంగమౌ అని అప్యాయంతో స్వామిని నిలదీస్తాడు. నిన్ను మాత్రమే తలచే నీవాడను స్వామి నాకు దర్శనమిస్తే నీకే కీర్తి. ఇంతలోతుగా ఆలోచన కవిగారికి ఉందని గ్రహించవచ్చు. ఆయా అవతారాల్లో ఆయా ఘట్టాల్లో కనిపించినట్లు ఆర్తులను రక్షించినట్లు గ్రంథస్తమయి ఉంటే మేము గమనిస్తాము. కాని ఈ కలియుగంలో కనిపిస్తే నీకే కీర్తి వస్తుందయ్యా అని స్వామి మేలు కోరే కవి ఈ పద్యంలో ఆప్యాయంగా నివేదిస్తాడు.

ఓ స్వామీ ఇన్ని లోకాల్లో సంచరిస్తూండే మిమ్ము అన్ని ప్రాంతాల వారు వేడుకుంటు ఉంటే సంరక్షిస్తు అవిశ్రాంతంగా భక్తజనోద్ధరణలో నిమగ్నమైన మీకు

వి(శాంతి అన్నది లేదుకదా. స్వామీ మీకు వి(శాంతిని నేనేర్పస్తాను రండి అంటూ దీనంగా ఆలపిస్తున్న ఈ పద్యాన్ని వీక్షిద్దాము.

ఉ॥ అంతటనుండి యీ జగములన్నియు నేలుచునుండు దాక వి
(శాంతిని కలిగియుండుటకు చక్కని ధ్యానపు పుష్పశయ్య నే
కాంతము నాహృదబ్జమున కల్పన జేసితి సమ్మతించి శ్రీ
కాంతయు నీవు నిద్దరును కమ్మగ నిద్దురపొందు కేశవా ॥ (24)161.

ఇందుగలడందు లేడని సందేహము వలదు... అన్న భాగవత పద్యంలోని రమణీయ దృశ్యం వలె ఓ స్వామి అంతటా ఉన్నారు. ఈ జగములన్నియు మీవే, అన్ని (ప్రాంతాల్లో సంచరించే మీకు వి(శాంతిని నేనేర్పాటు చేస్తాను. ఓ శ్రీపతీ చక్కటి ధ్యానపు శయ్య నా హృదయంలో ఏర్పరిచాను. ఏకాంతముగా మీరు లక్ష్మిదేవి వి(శాంతి పొందుతూ ఓలలాడండి, సేదదీరండి, నిదురపొండి స్వామి అంటూ ఎంతో అప్యాయంతో ఆ(ర్ధతతో ఈ పద్యంలో కోరుకుంటూ ఉంటాడు. ఇందులో భక్తి భావము నావాడు అని (పేమభావము తెలియజేస్తుంది.  ఎవరి చూపులకు అందగరానివాడైన ఓ కేశవ మూర్తి ఓ స్వామి నీ అను(గహము కావలెనయ్యా అంటూ దీనంగా (ప్రార్ధిస్తున్నా ఈ పద్య నడకను చూడండి. అందులోని అంతరార్థమును (గహిద్దామా....

ఉ॥ చూచెడు వాడవెవ్వరికి చూపులకందగరాని వాడ నో
యాచన చేయువాడ నిను యాచన జేయని భక్తకోటికిన్
దాచక ఇచ్చువాడ కడు దాతకు దాతవు భూజనాళికిన్
(బోచెడివాడ వినుము సరి బోలరు ఎవ్వరు చెన్నకేశవా॥ (28)162.

ఓ స్వామి అందరిని క్షేమంగా చూస్తావు. ఎవరికి చూపులకు అందగ రానివాడవు అయ్యావు.  యాచన చేసిన వాడిని అయిన నాకు నీ దర్శన భాగ్యము కలుగజేయండి. మిము యాచన చేయని భక్త కోటికి కూడా దాచుకోకుండా అన్ని ఇచ్చే వాడవయ్యావు. గొప్ప దాతవుగా, నేతగా మారినావని (పజలందరు అనుకుంటు ఉంటారు. వారందరిని కాపాడే వాడివి నీవే అని నీకు సరి దైవం వేరెవరు లేరని ంతో విన(మతతో కవి గారు ఈ పద్యంలో స్వామిని వేడుకోవడం కడు (ప్రశంస నీయము.

స్వామి వేవే రూపాలతో కొలుస్తారని నేను మా(త్రము మిమ్ము ఈ రూపాలలో తలుస్తానని ఎంతో చక్కగా కోరుకుంటున్నాడో గమనించడానికి  పద్యం చాలు.

శా॥ శాంతాకారుడు మేఘవర్ణుడును విశ్వాధారుడున్నాది మ
ద్యాంతాబావుడు పద్మనాభుడును విద్యా ప్రాభవోపేతుండును
భ్రాంతార్థకిలా జంతుపోషకుడు విప్రాధ్యర్చనా ప్రీతుడే
కాంతుండాగమ శాస్త్రముల్ పురుషునింగాజూతు నిన్కేశవా॥(31)163

ఈ పద్యంలో కవి తాదాత్మ్య చింతన భక్తి పారవశ్యత ఎంతగా నిండి యున్నది మనం గమనించవచ్చు. శాంతమే ఆకారముగా కలిగినవాడు శాంతాకారుడు పద్మ నాభుడు అనే శ్లోక ప్రభావం కావచ్చు మేఘ వర్ణం కలవాడని విశ్వాధారుడు ఆది, మద్య, అంత్య రహితుడు ఏకాంతుడు ఆగమశాస్త్రంల పురుషునిగా స్వామి నిన్ను నే చూస్తున్నానయ్యా అంటు ఎంత వినయంతో వేడుకున్నాడో ఈ పద్యంలో పాఠకలోకానికి తెలియవచ్చింది.

తను స్వామి భక్తుడనని తన్నాదుకొమ్మని ఆర్థజన రక్షణ అనే దీక్షలో ఉన్న నా స్వామివి నీవేనని ఎంత చక్కగా వేడుకుంటున్నాడో ఈ పద్యంలో మనం గమనిద్దామా పదండి.......

ఉ॥ చక్కగ నాలుగు బాహువులు శంఖము చక్రము శార్ఙ్గమున్ గదా
పక్కిని వాహనంబుగొని భక్తులనార్తిని విన్నవెంటనే
అక్కడిగేగి యాపదలనన్నిట బాపు దయాసముద్ర నా
దిక్కిటు జూసిబ్రోవు కదుదీనుడ మన్నెముపల్లి కేశవా.॥ (34) 164.

స్వామిని సాలంకారునిగా వర్ణిస్తూ శంఖము చక్రము గదా శారంగము మొదలగు ఆయుధ సపితుడవై గరుడ వాహనముపై భక్తుల మొర వినగానే ఆ ప్రాంతానికి వెళ్లి ఆపదనన్నింటిని బాపి వేసే దయాసముద్రడవు నీవే కదయ్యా, అలాగే నా దిక్కు కూడా ఒకసారి చూసి దీనుడనైన నన్ను కాపాడవా స్వామీ ఓ మన్నెముపల్లి కేశవా నీకు జయోస్తు, నమోస్తు, తథాస్తు అంటూ వర్ణించే ఈ ఘట్టం భక్తికి పరాకాష్ట అని చెప్పవచ్చు.

స్వామీ దీనులను కాపాడే లక్ష్యంతో నీవున్నావని ఇది ఆయా అవతారాల్లో ఆయా భక్తులను కాపాడి సంరక్షించినట్లే నన్ను కూడా కాపాడమని అర్థిస్తూ ఎంతో దీనంగా స్వామిని ప్రార్థిస్తున్నాడని ఈ పద్యం ద్వారా మనం గ్రహించవచ్చు.

ఉ॥ ఆ సభలోన ద్రౌపదికి నక్షయ వస్త్రములియ్యలేదె నీ
కోసము దెచ్చి యా శబరి కోరికిన పండ్లు భుజించలేదే నీ
దాసుని దాసుడా గుహుడు తా వరదాస్య మొసంగ లేదే నీ
తో సరివారులేరు కృపతో నను బ్రోచుము చెన్న కేశవా॥(38)165.

కృష్ణావతారంలో ద్రౌపదికి అక్షయ వస్త్రములిచ్చి మాన సంరక్షణ చేసి ఆదుకున్నావు. అలాగే రామావతారంలో శబరి ప్రేమతో, భక్తితో, అనురాగంతో, అభిమానంతో ఎంగిలి పండ్లు పెట్టేది. మధురంగా తృప్తిగా ఆరగించావు. అలాగే పడవలు నడుపుకునే గుహునిచేత పాద ప్రక్షాళనము చేయించుకొని పాదసేవ చేయించుకున్నావు. నీతో సరియైన దైవం వేరెవరు లేరుకదా అంటూ దీనంగా అర్థించిన కవి గారి వేడుకోలు శ్లాఘనీయమైనది.

కవి గారి దృష్టిలో తన నివేదన లోకంలో నివసించే వారందరికోసమని అందరిని క్షేమంగా చూడాలని లోకాః సమస్తాః సుఖినోభవంతు అనే విధంగా అందరిని తన శతకంలోని ప్రతి పద్యంలో కాపాడమని కోరుకుంటాడు. ఆ విషయాన్ని ఈ పద్యంలో నిరూపిస్తుంటారు. ప్రజలందరికి సద్బుద్ధి లక్షణాలను దయచేయాలని ఎలా వేడుకుంటాడో చూడండి.

మ॥ పరకాన్తన్ గన తల్లిగా గనెడు సద్భావంబు గల్గించు మా
పరవిత్తంబులను నాకు కావలెనని బ్రాన్తిందొలంగించు మా
పరసౌఖ్యంబులు చూసి నొప్పగలిగే భావంబు సందించుమా
పరమాత్మా నిను నమ్మియుంటి ఎపుడున్ భక్తుండనో కేశవా..॥

(41) 162.

ఎంత చక్కటి భావన ఇది అందరికి వర్తిస్తుంది అని కవిగారి తలంపు అమోఘం. ఇతర స్త్రీలను తల్లి వలె చూసే సద్భావాన్ని కలిగించవయ్యా స్వామి కేశవా ఇతరుల ద్రవ్యం నాకే కావాలి అనే పరద్రవ్య భ్రాంతి తొలగింప జేయవయ్యాపుండరీకాక్ష ఇతరుల సౌఖ్యంబును జూచి ఓర్చే శక్తిని నాకు ప్రసాదించుస్వామి, పరమాత్మా నిన్నే నమ్మియున్నానయా స్వామి అంటూ ఎంత పద్ధతిగా ప్రార్థించాడో గమనిస్తే కవిగారి ఆధ్యాత్మిక చింతనతో పాటు సమాజ శ్రేయస్సును కాంక్షించే సద్బుద్ధిని ప్రసాదిస్తు సమాజాన్ని సంరక్షించవయ్యా అనే ఈ నివేదనఎంతో ముచ్చట వేసే విధంగా ఉందికదా. ఇది భక్తునికి భగవంతునిపై ఉండే నమ్మకానికి ఓ గొప్ప ఉదాహరణ.

స్వామి మాకు మానవజన్మను ప్రసాదించావు సరే, నీ నామస్మరణ చేస్తూనిత్యం భక్తి అనే కేశవ నామ భక్తి సముద్రంలో మునికి తపస్సు ఆచరిస్తున్నానయ్యా ఏదీ నీ దర్శనం అంటూ నిలదీసే ఈ వైనాన్ని వీక్షిద్దాము.

ఉ॥ మానవ జన్మనిచ్చితివి మంచిదె జన్మ తరించు మార్గమే
నేను భవాద్దిలో మునిగి నిన్ను భజించగ రావదేమి యో
దీనజనావనా యిపుడు దిక్కెవరయ్య తరింపజేయ నీ
వేనను బ్రోవకున్న మరి వేరెవరీయిల చెన్న కేశవా॥ (46) 163.

భారాన్ని ఎంత చక్కగా స్వామిపైన వేసి స్వామిని ఉద్బోదిస్తు చెపుతున్నాడో ఈ పద్యాన్ని చూసిన వారెవరికైనా సుబోధమౌతుంది. స్వామీ మానవ జన్మను ప్రసాదించావు, సరే ముక్తికి మార్గము మీరే చూపాలి కదా అంటూ ప్రశ్నిస్తాడు.

ఓ దీన జనావనా ఇంకా దిక్కెవరయ్యా? నీవు తప్ప అంటూ స్వామిని నిలదీస్తాడు. నేను త్రికరణ శుద్ధిగా మీ నామ భావాబ్ధిలో మునిగి మిమ్ము భజిస్తూనే ఉన్నాను.

మరి మీరు తప్ప నాకు దిక్కెవరయ్యా అంటూ స్వామి వారిపైనా తన భారాన్ని వేసి ఎంత చక్కగా కవిగారు ఆ దేవదేవుడైనా చెన్న కేశవ స్వామిని వేడుకుంటున్నాడో గమనించినట్లయితే స్వామికి కవిగారికి ఎంత దగ్గరి సంబంధ బాందవ్యం ఉందో అని అనుకునే విధంగా ఈ పద్యం రూపొందింపబడింది. పద్య రూపంలో స్వామి వారిపై తనకు గల భక్తి ప్రవాహాన్ని ఈ రూపంలో కవిగారు ప్రకటించారు. అది చాలు ముక్తికి మార్గం

భక్తుల బాధలను మాన్పడము మీకే సాధ్యమవుతుంది స్వామి అని గతంలో స్వామి చేసిన మహోత్కృష్ట సన్నివేశాలను స్వామికి జ్ఞాపకం చేయడం చేస్తూనే నన్ను కూడా అలాగే సాకవయ్యా అంటూ అనురాగపూరిత ప్రార్థనా స్వరం ఈ పద్యంలో చూద్దాం.

ఉ॥ భక్తులలోన నీకు ప్రియ భక్తుడు రాజగు నంబరీశుడా
సక్తిగా ద్వాదశీ వ్రతము చాలగ భక్తిగా చేయుచుండగా
శక్తిని బరసితాపసుడు చక్రముతో ఉపసంహరింపవా
భక్తుల బాధ బాపగలవాడవు మన్నెముపల్లి కేశవా॥ (50) 164.

ఓ స్వామీ! నీ ప్రియ భక్తుడు అంరీశుడు అవస్థల్లో యుండి యున్నపుడు శక్తిని పంపి సుదర్శానాయుధంతో ఆ దుష్ట శక్తిని సంహరించి అతడిని సంరక్షించిన ఆపన్న జనరక్షకా నేను నీ భక్తుడను నిన్నే నమ్మియున్న వాడను. కష్టాల్లో ఉన్నాను. నన్ను కూడా అలాగే అంబరీశును కాపాడినట్లు కాపాడి శిష్ట జన రక్షకుడవనే నామాన్ని సార్థకం చేసుకోవయ్యా ఓ స్వామి మన్నెముపల్లి కోవెలలో స్థిరప్రతిష్టుడవైన ఓ కేశవా పాహిమాం అని ఎంత చక్కగా స్వామికి తన మధుర నివేదన వినిపించాడో గ్రహిస్తే కవిగారి భక్తి ప్రశంసనీయము.

కృష్ణావతారంలో స్వామీ! నీ స్నేహితుడు, నీ హితుడు, సన్నిహితుడు దయామయుడైన విదురుడు నిన్నాహ్వానించకుండగనే ఓ భక్తవత్సలా విదురుడు ప్రేమతో విందులు చేస్తే ఆరగించి వానినిఅనుగ్రహించినట్లు అలాంటి నా సేవ  కూడా ప్రీతి పాత్రముగా భావించవయ్యా అంటూ వేడుకుంటున్న ఈ పద్యంలోని మర్మాన్ని ఆలోకన చేద్దాం.

చ॥ విదురుడు ప్రేమతో బిలిచి విందులు చేసిననీవు భక్తితో
ముదమున నారగించితివి ముక్తినొసంగించితివట్లు జేయగా
కుదురుని నీకు నియ్యదగినట్టిది నీవు దయాబ్ధి యిచ్చితీ
సదయుడవై గ్రహించినను చక్కగనేలుము చెన్నకేశవా॥(56)165.

మహాత్ములు ప్రేమతో అర్పించిన విందును ఆసాంతము అభిమానంతో ఆరగించావు. పుష్పం, పత్రం, ఫలం, తోయం అన్నట్లుగా నేనిచ్చే ఈ సేవలో స్మరణములైనవి కీర్తనలు నీ వందలేవా స్వామి వారికో న్యాయం, నాకో న్యాయం ఉంటుందా? ఇది మీకు తగునా? నాకు తగినది నా చేతనైనది కేవలం నా హృదయమే నీకందివ్వడము, అది ఎప్పుడో ఇచ్చి వేయడము జరిగింది. దయతో స్వీకరించి నన్నేలుకొమ్ము ఓ కేశవా అంటూ కవిగారు ఎంతో దీనంగా ప్రార్థించడం ఆలోకిస్తే కవిగారి వేదన తపన స్వామికై నిరీక్షణ, ముక్తికై అలుపెరగని ఆరాట, పోరాటం ప్రయత్నం, సంవేదన ఇవన్నీ ఒకే పద్యంలో చూపించడం కవిగారి కవన శక్తికి నిదర్శనం.

కం॥ కేశవ స్వామీ నమతులు
కేశవ నీపాద సేవ కీర్తన జపముల్
నాశలు తీర్చగ జేసెద
యాశయమే మీదు సేవ యచ్యుత గొనుమా॥ 166.

-----0----

# స్వామి దశావతార వర్ణన

దుష్టశిక్షణకు శిష్టరక్షణకు పూనుకున్న శ్రీహరి పాపులను శిక్షించి, సాధు జీవాలను కాపాడాలని తద్వారా "లోకాః స్సమస్తాః సుఖినోభవంతు" అనే నానుడిని వాస్తవం చేయాలని దశావతార రూపాల్లో సమస్త లోకాల్ని సంరక్షించవలెనని అందులో భాగంగానే అనేక అవతారాలు దాల్చడం జరిగింది. ప్రపథమంగా మత్స్యావతార ఆవిష్కరణ జరిగింది. మత్స్యావతార వర్ణణ ఈ పద్యంలో వీక్షిద్దాం.

చ॥ శృతులను మృచ్ఛిలింయును శీఘ్రము వారిధిజొచ్చి సో సోమునిన్
హతమోనరించి వేదములు హర్షముతోడుత బ్రహ్మకిచ్చినన్
సతతము సృష్టి జేయుటను సంతసమందడె నీ ప్రతాపమున్
శతముఖ రుద్రులందెలియ జాలరు మన్నెముపల్లి కేశవా॥ (22)177

పై పద్యంలో కృతయుగంలో సోమకాసురుడు అనే రాక్షసుడు బ్రహ్మగారి వద్దనుండి వేదములన్ దొంగిలించి సముద్ర మధ్యమున దాగియుండగా సృష్టికర్త విష్ణువును అభ్యర్థించగా విష్ణువు మత్స్యావతారమెత్తి సముద్రములోకి వెళ్లి ఆ రాక్షసున్ని అంతమొందించి వేదాలను సంరక్షించి బ్రహ్మకిస్తేనే గదా బ్రహ్మ నిరాఘటంగా నిర్విఘ్నంగా తన సృష్టి కార్యక్రమాన్ని కావించుకొన్నాడు. లోకోపకారమునకై అన్ని జీవులను బ్రహ్మ సజావుగా సృష్టింపజేయునట్లుగా చూపిన నీ వీరత్వ పటిప అనన్య సామాన్యము అద్భుతము, అందరికి ఆరాధ్య దైవమైనా ఓ శ్రీహరి, ఓ కేశవా అంటూ సమస్త లోకులు వారిని కీర్తించడం మనందరికి తెలిసిందే.

ఋగ్, యజు,స్సామా,థర్వణ వేదాలను అన్ని కలిపి శృతులు అంటారు. అట్టి శృతుల సంరక్షణా భారాన్ని మీరు వహించడమే కాకుండా దష్ట శిక్షణ యెనగూర్చి సమస్త లోకాలకు శాంతిని, స్థైర్య, ధైర్యాలను అందించిన మహానుభావులు మీరే అంటూ కేశవా మిమ్ము స్తుతించటం మీ ఘనతను అందరికి తెలియజేయడం అదే ఈ శతకంలో కనిపిస్తూ వినిపింపజేయడం కవిగారి ఉద్దేశ్యం.

ద్వితీయావతార వర్ణణ కొనసాగిస్తూ కూర్మావతార వర్ణణ చేయడం వారి భక్తి తత్వానికి నిదర్శనం. ఇందులో దేవతలు అమృత సాధనకు సముద్ర మదనమును సంకల్పించుకోగా మందర పర్వతము వాసుకి అను సర్ప రాజం అత్యవసరంగా ఏర్పడినది. సముద్ర మదనములో భాగంగా మందర పర్వతము మునిగిపోకుండా ఊనిక అవసరం ఏర్పడింది. అద్భుతము, అందరికి ఆరాధ్య దైవమైనా ఓ శ్రీహరి, ఓ కేశవా అంటూ సమస్త లోకులు వారిని కీర్తించడం మనందరికి తెలిసిందే.

ఋగ్, యజు,స్సామా,థర్వణ వేదాలను అన్ని కలిపి శృతులు అంటారు. అట్టి శృతుల సంరక్షణా భారాన్ని మీరు వహించడమే కాకుండా దష్ట శిక్షణ యొనగూర్చి సమస్త లోకాలకు శాంతిని, స్థైర్య, ధైర్యాలను అందించిన మహానుభావులు మీరే అంటూ కేశవా మిమ్ము స్తుతించటం మీ ఘనతను అందరికి తెలియజేయడం అదే ఈ శతకంలో కనిపిస్తూ వినిపింపజేయడం కవిగారి ఉద్దేశ్యం.

ద్వితీయావతార వర్ణణ కొనసాగిస్తూ కూర్మావతార వర్ణణ చేయడం వారి భక్తి తత్వానికి నిదర్శనం. ఇందులో దేవతలు అమృత సాధనకు సముద్ర మదనమును సంకల్పించుకోగా మందర పర్వతము వాసుకి అను సర్ప రాజం అత్యవసరంగా ఏర్పడినది. సముద్ర మదనములో భాగంగా మందర పర్వతము మునిగిపోకుండా ఊనిక అవసరం ఏర్పడింది.

సమస్త దేవతా లోకం శ్రీ మహా విష్ణువును ప్రార్థించగా అపుడు శ్రీ మహావిష్ణువు పర్వతము నీరధిలో నిలిచియుండే విధంగా శ్రీ మహావిష్ణువు కూర్మావతారం దరించి ఆ పర్వతమునకు ఆధారముగా నిలిచి క్షీరసాగర మధనమును కొనసాగింపజేశాడు. పర్వతము మునిగి పోకుండా దేవతలందరికి ఉత్కృష్ట సహాయాన్ని ఒనరించిన శ్రీ మహావిష్ణువు కూర్మరూప ధారిగ అనేక స్తోత్రాలలో కీర్తిస్తూ భజించడం జరిగింది. ఫలితంగా అమృత సాధన క్షీరసాగర మధనము సులభవంతంగా సుఖాంతమైనది. ఈ విషయాన్ని కవిగారు చక్కని పద్యంలో వివరించినారు.

ఉ॥ కూర్మమవయ్యి మందరము క్రుంగగ వీపున మీదికెత్తి స
ద్ధర్మము జూచి దేవతలు రాక్షసులున్మ మథియించ బుట్టె నా
నిర్మలమైన యాసుధను నీవే గ్రహించియు దేవతాళికిన్
మర్మముతోడ పోసితివి మాధవ మన్నెముపల్లి కేశవా॥(23)178

ఓ స్వామీ కేశవా దేవతలందరి యవసరం నెరవేర్చే భారం నీదిగా భావించి పర్వతా భారాన్ని మోసి అమృతం చిలకడానికి సాధనంగా మారి జగత్ కళ్యాణ కార్యక్రమానికై నిర్మలమైన అమృతమును అందరికి అందించిన ఓ శ్రీపతీ ! కేశవా ! పరోపకారార్థం మీరొనరించిన కార్యమ్ము అత్యద్భుతమైందయ్యా అంటూ వేడుకోవటం ఇందులో అంతరార్థం దేవతల మర్మమెరింగి అనడంలోనే ఉంది కవిగారి అంతరార్థం. రాక్షసులు క్రూర స్వభావులు అటువంటి క్రూర స్వభావులకు అమృతం ఒసంగడంలో ఎలాంటి భవితవ్యం ఉండదని వేరే ఏదైనా యోచించి దేవతలకు మాత్రమే అమృతమెసంగేటట్లు చూడాలని వారి భావన. విష్ణువుయొక్క పది అవతార రూపాలను దశావతార వర్ణన అనే శీర్షికలో చూపించడం కవిగారి సాహితీ ప్రేమను వివరిస్తుంది.

దశావతారములలో ఒక్కొక్క అవతారానికి ఓ పద్యం చొప్పున పది అవతారాలను వరుసగా కడుచక్కగా బహురమ్యంగానూ, అందంగానూ వర్ణించారు చివరి కల్కి అవతారం విషయంలో శంబల గ్రామం మొదలుగాగల అన్ని అంశాలను కవిగారు చక్కగా వివరించారు యేయే యుగాలలో ధర్మస్థాపనార్థమై ఆ శ్రీమన్నారాయణుడు శిష్టరక్షణార్థమై ఎటువంటి అవతారాదులను ఎత్తాల్సివచ్చిందో వివరించినారు కవిగారి నిష్కల్మషమైన హరిభక్తికిది నిదర్శనమని భావించవచ్చు.

కవిగారి భక్తి తత్పరత అనే సుగుణం అధికమైన ఓజస్సును, తేజస్సును కవిగారికి అందింపజేసిందని చెప్పవచ్చు. ఓ మన్నెముపల్లి కేశవా! నీకు జయోస్తు అంటూ స్వామివారి నామ స్మరణ నిరంతరం కొనసాగించటం కవిగారి ఆధ్యాత్మిక చింతనలో ఇదొక భాగమే అనిపిస్తుంది. భక్తితత్వము అనునది యెంతగొప్పదో కవిగారు స్వయంగా అనుభవించి చూపించారు. కవిగారి ధర్మచింతన, స్వామి దర్శనమునకై వీరు పడే తపన, ఆరాటం యెంతగానో శ్లాఘనీయమైనదిగా వారి భక్తిని ఆరాధించే వీరి భక్తులు గాఢంగా విశ్వసిస్తూవుంటారు.

కవిగారి ఆధ్యాత్మిక చింతన, వీరి నిష్కళంకమైన, భక్తి వీరి నిర్మలమైన సేవాభావము అందరినీ యెంతగానో ఆకట్టుకునే విధంగా వుంటూవుండేవిగా అందరు చెప్పుకుంటుంటారు. ప్రత్యక్షంగా నేను (పరిశోధకుడు) వీరి శిష్యునిగా వుండేరోజుల్లో నేను విద్యార్థిగా వుండేరోజుల్లో నాకు వీరి ఆరాధనావిధానము నన్ను యెంతగానో వుత్సాహపరుస్తూవుండేది. కవిగారికి అనేకానేక ధన్యవాదములు.

కం॥ కేశవ దాసుడు తానై
కేశవ సద్భక్తి చరిత కీర్తన లవియున్
కేశవ భక్తుల కొసగెను
కేశవ భక్తాగ్రగణ్యు కీర్తింతు సదా ॥ 187.

-----0----

# సామాజిక చింతన

కవిగారికి కేవలం భక్తి మాత్రమే మార్గముగా తోచినదేమో అని అనుకోవాలసిన అవసరం లేదు. వీరికి సామాజిక స్పృహకూడా అటనట పుష్కలంగా కనిపింపజేసే సులక్షణం ఉండియున్నది అని ఈ క్రింది పద్యం ద్వారా అవగతం అవుతుంది.

మన్నెముపల్లి వాసులగు మానవులందరు వేరువేరుగా
నన్ని కులాల వారికిని యా దొరలాది పటెండ్లు కాపులున్
పన్నగ వైశ్య విప్రులు నపాంగులు గౌడులు విశ్వ బ్రాహ్మణులు
యెన్నగా పద్మశాలురును ఎర్రని గొల్లలు మేరవారలున్
నున్నరు నాపకుల్ హరిజనులు రజకుల్ దగశాలివాహనులు
మన్నికజూడు మర్చకుని మానుగ బెస్తలు ముత్తరాసులున్
మన్నెపువాండ్రు మాలలును మంత్రపు వైద్యము జేయువారలున్
పన్నగ శాయివీరికిని భక్తియునాయువు ధాన్య సంపదల్
నన్నియుయించి బ్రోవుమని యంజలిబట్టితి చెన్నకేశవా॥(33)188

ఈ నవ పాదాల ఉత్పల మాలికలో ఆ గ్రామములో ఉన్న దాదాపు అన్ని కులాల వారికిన్ యోగ క్షేమాలు నీవే కాపాడవలెనయ్యా అంటూ అంజలించి అర్థించడం. వరుసగా అన్ని వర్ణాల వారికి ఆయువు ధాన్య సంపదలు భోగభాగ్యాలు స్వాస్థ్యము వంటి మేలొనరించే అన్ని భాద్యతలు నీవే స్వామి అంటూ కీర్తించడం శ్రేయోదాయకమైంది. యిందుమూలంగా కవిగారి సామాజికచింతన యెంతగొప్పదో వ్యవగతమవుతుంది. కవిగారికి గ్రామస్థులు అందరూ కాదగినవాళ్ళుగానే అగుపిస్తూవుండేవారు.

దొరలు, పటేండ్లు అంటే కాపులు, వ్యవసాయ రైతులు అంతేగాకుండా వైశ్యులు, విప్రులు, ఓ పదికుటుంబాలు, వైశ్యులు, ఓ మూడు కుటుంబాలు, అసంఖ్యాకంగా మిగతావారు ముఖ్యంగా అపాంగులు, గౌడులు, విశ్వబ్రాహ్మణులు, కంసాలి, వండ్రంగి, స్వర్ణకారులు, పద్మశాలివారు, గొల్లలు, ఎర్రని గొల్లలు, యాదవులు, దర్జీలు, మేరవారు అలాగే మంగళివారు, హరిజనులు, అరుంధతి సుతులు, రజకులు, శాలివాహనులు అలాగే వంశపారంపర్య అర్చకులు, గంగపుత్రులు, ముత్తరాశివారు, మన్నెపువారు, మాలవారు, బైండ్లవారు దాదాపుగా గ్రామములో ఉన్న అన్ని కులాల వారిని పేరుపేరున తలుస్తూ వారందరికి చిరాయువు, భోగభాగ్యములు, ధనదాన్యాదులు, క్షేమ, మంగళాది

శుభములు మున్నగు వాటిని కవి గ్రామస్తుడే అయినందున ఆ గ్రామములోని ఆబాలగోపాలము అయిన సర్వులకు క్షేమము కలుగజేయాలని ఆ లక్ష్మీ చెన్నకేశవ స్వామిని వేడుకోవడం వీరి సామాజిక బాధ్యతను చింతనను తెలియజేస్తుంది. ప్రతినిత్యం గ్రామ పెద్దలకు అవసరమైనచో సందార్భానుసారంగా అనేక విషయాల్లో సూచనలు, సలహాలు, కట్టుబాట్లు వ్యవహారాలు తెలియజేస్తూ ఉండేవారు.

దొరలు, పటేండ్లు అంటే కాపులు, వ్యవసాయ రైతులు అంతేగాకుండా వైశ్యులు, విప్రులు, ఓ పదికుటుంబాలు, వైశ్యులు, ఓ మూడు కుటుంబాలు, అసంఖ్యాకంగా మిగతావారు ముఖ్యంగా అపాంగులు, గౌడులు, విశ్వబ్రాహ్మణులు, కంసాలి, వండ్రంగి, స్వర్ణకారులు, పద్మశాలివారు, గొల్లలు, ఎర్రని గొల్లలు, యాదవులు, దర్జీలు, మేరవారు అలాగే మంగళివారు, హరిజనులు, అరుంధతి సుతులు, రజకులు, శాలివాహనులు అలాగే వంశపారంపర్య అర్చకులు, గంగపుత్రులు, ముత్తరాశివారు, మన్నెపువారు, మాలవారు, బైండ్లవారు దాదాపుగా గ్రామములో ఉన్న అన్ని కులాల వారిని పేరుపేరున తలుస్తూ వారందరికి చిరాయువు, భోగభాగ్యములు, ధనదాన్యాదులు, క్షేమ, మంగళాది శుభములు మున్నగు వాటిని కవి గ్రామస్తుడే అయినందున ఆ గ్రామములోని ఆబాలగోపాలము అయిన సర్వులకు క్షేమము కలుగజేయాలని ఆ లక్ష్మీ చెన్నకేశవ స్వామిని వేడుకోవడం వీరి సామాజిక బాధ్యతను చింతనను తెలియజేస్తుంది. ప్రతినిత్యం గ్రామ పెద్దలకు అవసరమైనచో సందార్భానుసారంగా అనేక విషయాల్లో సూచనలు, సలహాలు, కట్టుబాట్లు వ్యవహారాలు తెలియజేస్తూ ఉండేవారు.

ఓ కేశవా! మా గ్రామములో అన్ని వర్గాల వారు, చేతివృత్తిపనివారు, వ్యవసాయ కార్మికులు, వ్యాపార, వాణిజ్య వేత్తలు, విద్యావంతులు, ఉద్యోగస్థులు అన్నివర్గాలవారికి అన్ని ప్రాంతాలవారికి అన్నివర్ణాలవారికి సదా క్షేమ,మంగళాది శుభములు ఒనరగ జేయవయ్యా అంటూ వేడుకోవడం లోకా స్సమస్తా: సుఖినో భవన్తు అనే ఆధ్యాత్మికతికకు సజీవ సత్యంగా భాసిస్తోందని చెప్పగలము.

అలాగే కేవలం స్వార్థంతో నాకు లేదా మావారికి మాత్రమే క్షేమం కలిగింప జేయవయ్యా అంటూ కోరుకోకుండా తన గ్రామస్థులందరికి యావల్లోకానికి మంగళమొనరించాలని తదేక దీక్షతో నామపారాయణాది భక్తి ప్రపత్తులతో చేపట్టిన దైవ కార్యక్రమాలు యజ్ఞయాగాది క్రతువులను ఆ ప్రజల గ్రామ సౌభాగ్యం కొరకే అని నిరూపించే ఈ క్రింది పద్యాన్ని గమనిద్దాము.

ఉ. ఎప్పుడు వానకాలమున యిచ్చటి కుంటలు చెర్లు భావులున్
తప్పక నిండగా వలయు దాతవు దైవము దీన రక్షకా
యప్పులు లేక యందరికి నన్నియు పంటల నిచ్చి వీరినె
ల్లప్పుడు బ్రోవు మంచు కమలాపతి మ్రొక్కెద చెన్న కేశవా.॥ (34)

కవిగారి పరోపకార దృష్టి లోక క్షేమము గ్రామ సౌభాగ్యము, గ్రామ సంక్షేమము శాశ్వతంగా ఎలాంటి యీతి బాధలు కలుగకుండగా ఎలాంటి క్షామం లేకుండగా కరువు కాటకాలు, అతివృష్టి,అనావృష్టి బాధలు లేకుండగా జేయవలెనని కడుపు నిండుగా అన్నం పెట్టే అన్న దాతలు క్షేమంగా వర్ధిల్లాలని కవిగారు ఆశాభావాన్ని వ్యక్తం చేస్తూ తమ కావ్య నాయకుడైన శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామిని ఆర్తితో మనసారా ప్రార్థించిన వైనం గణనీయమైనది.

వర్షాకాలంలో ఈ గ్రామంలోని చెరువులు, కుంటలు నీటితో నిండి యుండాలని మన్నెంపల్లి గ్రామంలో రెండు పెద్ద చెరువులు, నాలుగు కుంటలు, రెండు ఒర్రెలు ,నిర్మించబడిన జలాశయములు. అవి వర్షాధారితములు సహజంగా నిర్మించబడియున్న జలాశయములు యివి సువృష్టితో నిండియుంటే ఇక అన్నదాతకు చేతినిండా పని, కడుపునిండా తిండిని సృష్టించవచ్చుని వర్షాకాలంలో యిలా చెరువులు, కుంటలూ పూర్తిగా నిండిపోవాలని, జలాశయాలు సమృద్ధిగా జలధారలతో వృద్ధి చెందుతూండాలని కేశవా మీరే యీపని చేసి పెట్టాలని భగవన్ మీ బాధ్యతనే యిది అని దీనంగా వేడుకుంటున్న కవిగారి దూరదృష్టి పరోపకార చింతన యెంతగొప్పది. అలాగే యీ గ్రామంలో నాలుగైదు పెద్ద పెద్ద వ్యవసాయ బావులు ఉన్నాయి. వాటి పేర్లు తీగల దొర్రి, చిందొర్రి, పెద్దొర్రి,నిమ్మతోటబావి, కమ్మలబావి వంటివి యిప్పటికినీ అవే పేర్లతో పిలువబడుతూ వుండడం గమనార్హం. యివన్నియు నిండి వ్యవసాయావసరాలను నెరవేర్చాలని కవిగారి ఆశయం యెంతగొప్పది ఆభారాన్ని కూడా స్వామివారిపైన్నే వేయడం ముదావహం.

ఎలాంటి క్షామం లేకుండగా కరువు కాటకాలు, అతివృష్టి,అనావృష్టి బాధలు లేకుండగా జేయవలెనని కడుపు నిండుగా అన్నం పెట్టే అన్న దాతలు క్షేమంగా వర్ధిల్లాలని కవిగారు ఆశాభావాన్ని వ్యక్తం చేస్తూ తమ కావ్య నాయకుడైన శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామిని ఆర్తితో మనసారా ప్రార్థించిన వైనం గణనీయమైనది.

వర్షాకాలంలో ఈ గ్రామంలోని చెరువులు, కుంటలు నీటితో నిండి యుండాలని మన్నెంపల్లి గ్రామంలో రెండు పెద్ద చెరువులు, నాలుగు కుంటలు, రెండు ఒర్రెలు, నిర్మించబడిన జలాశయములు. అవి వర్షాధారితములు సహజంగా నిర్మించబడియున్న

జలాశయములు యివి సువృష్టితో నిండియుంటే ఇక అన్నదాతకు చేతినిండా పని, కడుపునిండా తిండిని సృష్టించవచ్చని వర్షాకాలంలో యిలా చెరువులు, కుంటలూ పూర్తిగా నిండిపోవాలని, జలాశయాలు సమృద్ధిగా జలధారలతో వృద్ధి చెందుతూండాలని కేశవా మీరే యీపని చేసి పెట్టాలని భగవన్ మీ బాధ్యతనే యిది అని దీనంగా వేడుకుంటున్న కవిగారి దూరదృష్టి పరోపకార చింతన యెంతగొప్పది. అలాగే యీ గ్రామంలో నాలుగైదు పెద్ద పెద్ద వ్యవసాయ బావులు ఉన్నాయి. వాటి పేర్లు తీగల దొ్రి, చిందొ్రి, పెద్దొ్రి,నిమ్మతోటబావి, కమ్మలబావి వంటివి యిప్పటికినీ అవే పేర్లతో పిలువబడుతూ వుండడం గమనార్హం. యివన్నియు నిండి వ్యవసాయావసరాలను నెరవేర్చాలని కవిగారి ఆశయం యెంతగొప్పది ఆభారాన్ని కూడా స్వామివారిపైన్నే వేయడం ముదావహం.

అంతేకాదు దీనరక్షకా ! మావూరి కర్షకులకు, కార్మికులకు, వ్యాపారులకు, ఉద్యోగులకు, శ్రామికులకు, కూలీలకు ఎవరికైనా సరే మా గ్రామస్థులందరికి ఎలాంటి అప్పులు, తిప్పలు లేకుండా శాశ్వత సంక్షేమాన్ని మీరే కుదుర్చాలి. కరుణా సింధూ! పరాత్పరా! దామోదరా!చెన్నకేశవా! లక్ష్మీ కేశవా! మాగ్రామ సంక్షేమ బాధ్యత యిక పూర్తిగా మీపైనే వుంది అని దీనంగా వేడుకుంటున్న వైనం ఎంత గొప్పదిగా వుందో కనిపిస్తోంది. సస్యసృష్టి కావించి వీరందరిని ఎల్లప్పుడు కాపాడే దైవము నీవేనయ్యా ఓ కేశవా నీవే శరణు పాహిమాం దీనరక్షకా ! రక్షమాం అంటూ లోకోపకార క్రమాన్ని యెంత చక్కగా నివేదించాడో గమనిస్తే కవిగారి పరోపకార నిష్ట సామాజిక చింతన అవగతమవుతుంది.

స్వామీ కేశవా ! నీవంతట నిండియున్నావయ్యా ! మా దీనులను రక్షించుకోవడానికి మా గ్రామంలోని సుందరమైన కోవెలలో కొలువై యున్నావు స్వామీ అంటూ స్వామిని ఎంత మధురంగా కీర్తించినారో యీ క్రింది పద్యంలో మనం గమనించవచ్చు స్వామిపై కవిగారికి గల నమ్మకమును ఈ పద్యంలో వున్నది వున్నట్టుగా స్పష్టంగా, సమగ్రంగా నిరూపిస్తుందో గ్రహిద్దాం.

ఉ॥ అందరి యందు నీవ గలవందురు యెందరొ యిందిరా ప్రభూ
ముందర వెన్క సందులను మొత్తము క్రిందను మీదనుండు గో
విందు, ముకుంద, కృష్ణ, యరవింద, మనోహర, నందనందనా
వందనమందుకొమ్ము సురవందిత మన్నెముపల్లి కేశవా॥ (35)190

స్వామీ అందరియందు నీవె కలవు అని అంటుంటారు భాగవతంలో శ్రీమాన్ బమ్మెర పోతన గారు ఆపద్యాన్ని చూద్దామొకసారి...

కం. యిందుగలడందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదికి జూచిన
నందందే గలడు దానవాగ్రణి వింటే...॥(36)191.

యీ పద్యం స్మరణకు రాక మానదు ఓ యిందిరా ప్రభూ ! ముందూ, వెనుక, సందుల్లో అటు, నిటు అంతటా సర్వాంతర్యామివై గోవిందా,! ముకుందా,! కృష్ణా,! యరవిందా,! మనోహరా,! నందనందనా! యశోదా నందనా ! నీకివే నా శతవందనాలు. అందుకోవయ్యా! సురవందితా! ఓ దీనబాంధవా ! ఓ ఆర్తత్రాణ పరాయణా! మన్నెంపల్లి కేశవా! ఆదుకోవయ్యా అంటూ ఎంత చక్కగా వేడుకుంటున్నాడో మనం గమనిస్తే స్వామివారి కరుణా దీక్షలయందు కవిగారికి గల నమ్మకము దృఢదీక్ష ఎంతగాఢంగా, నిగూఢంగా అంతర్లీనంగా నిండియున్నదో తెలియవస్తుంది. నిరంతర కేశవ నామ పారాయణాతత్పరుడైన శ్రీరామక రామశర్మగారు అన్ని వర్గాల వారి సంక్షేమాన్ని కాంక్షించారు. గ్రామస్తులందరికి ఆయురారోగ్యా భోగభాగ్యాలను ప్రసాదించాలని ఆ కేశవ స్వామిని కోరినాడు.

ఉన్నాడా భగవంతుడెపుడు ... అనే పద్యంలో దేవుడు లేడు అని దేవుడు ఉనికిని ప్రశ్నించే వారిని ఒక పాత్రగా ప్రవేశపెట్టి అతనితో ఉన్నాడా? భగవంతుడు? యెప్డు కనరా? ఉంటేలా రాడాయారా? అని ప్రశ్నింపజేశాడు. తత్ సమాధానాన్ని అనువుగా పద్యంలో రసవత్తరముగా గజేంద్ర ఘట్టాన్ని, ద్రౌపదీ వస్త్ర సంరక్షాణా వైనాన్ని, ప్రహ్లద మొరను

ఆనవాలుగా చె ఆయా విధంగా వచ్చి కాపాడడాన్ని ఒక చిన్న పద్యంలో ఎత్తి చూపడం మహదానందంగా సమాధానాలివ్వడం నాస్తికత్వ వాదం తప్పని నిరూపించడం కవి గారి కవితా శిల్పానికి ఒక చక్కని ఆనవాలు. శ్రీ రామకరామశర్మ గారి కవిత్వ ధోరణి పాఠకునికి కళ్ళకు కట్టినట్లు చేయు విధంగా అత్యంత రామణీయకత నిండియుంది.

ఆనవాలుగా చెప్పిచూపించినాడు. ఆయా కాలాలలో, ఆయా రూపాలతో, ఆయా విధంగా వచ్చి కాపాడడాన్ని ఒక చిన్న పద్యంలో ఎత్తి చూపడం మహదానందంగా సమాధానాలివ్వడం నాస్తికత్వ వాదం తప్పని నిరూపించడం కవి గారి కవితా శిల్పానికి ఒక చక్కని ఆనవాలు. శ్రీ రామకరామశర్మ గారి కవిత్వ ధోరణి పాఠకునికి కళ్ళకు కట్టినట్లు చేయు విధంగా అత్యంత రామణీయకత నిండియుంది.

ఉదా॥ శ్రీ వైకుంఠపురంబునుండి .....అనే పద్యంలో కవిగారి శిల్ప

రామణీయకత గమనించి నట్లయితే ఎక్కడో దూరాన ఉన్న స్వామి వారిని సపరివారంగా వేంచేయమని తమ ఆలయంలో సుప్రతిష్ఠులు కండీయని కోరుకోవడం కవిగారికి చెల్లింది. ఈ గ్రామము శ్రీ వైకుంఠంతో సమానమైనదని కవిగారి భావన. విష్ణువును ఒక్కరినే ఆహ్వానించడం భావ్యమవుతుందా? అని ప్రశ్నించుకొని సర్వసాధారణంగా ఎవరినైనా ఆహ్వానిస్తే బంధు మిత్ర సపరివార సమేతంగా అని ఆహ్వానించడం పరిపాటి. పైగా సాక్షాత్తు శ్రీ మహా విష్ణువుని ఆహ్వానిస్తున్నాడు. కావున ఓ స్వామి! శ్రీ, భూ, నీళా సమేతంగా రావయ్యా స్వామి అని ప్రార్థిస్తున్నాడు. ప్రయాణ బడలిక స్వామికి ఉండ కూడదనే ఉద్ధేశ్యంతో శ్రీ భూ నీళా సమేతంగా సేవలందుకుంటు రావయ్యా అని పిలవడంలో అర్థం ఆ మాత్రం అలసట కలుగనీయకుండా ఉండాలనీ కవిగారి ఉద్ధేశ్యం.

కేశవా! నీకేమో ఇంత మంచి పేరు దాన్ని సార్థకం చేసుకోవయ్యా అంటూ “పిలిచినవచ్చు వాడనెడు పేరు లభించెను స్వార్థమేమి” చే. కె. శ. 14. అంటూ పై పద్యంలో స్వామిని ఇలా నిలదీస్తాడు. ఎంత సహజంగా ఉందో గమనించినట్లయితే ఓ స్వామీ మీకేమో పిలుస్తునే వచ్చేవాడు చెన్నకేశవుడు అని పేరు మరి నే పిలిస్తే రావెందుకయ్యా, ఒకవేళ పిలువగానే వస్తే నీ పెద్దతనమునకు ఏమైనా భంగం కలుగుతుందా అంటూ అనురాగ పూర్జితంతో అర్థిస్తాడు. నిన్నే తలుస్తాను స్వామీ నీకే ఆ కీర్తి వస్తుంది కదా. నీవు తప్ప నాకు ఈ భూమిపై వేరే ఎవ్వరు లేరని, నీవే నాకు దిక్కు అని “ నీవే తప్ప హితపరంబరుగ” (1) అనే పోతన గారి భాగవత గజేంద్రమోక్ష ఘంటాన్ని గుర్తుకుతేవడం జరుగుతుంది.

ఇందులో స్వామీ సార్థక నామధేయుడన్న విషయాన్ని పాఠక లోకానికి గుర్తు చేస్తూనే స్వామీ నీపేరు నీవే రక్షించుకో ఇది నీ అవసరం. లేకుంటే అపప్రధ వస్తుంది అంటాడు. అంతేకాదు నీకు నన్ను రక్షించాలని ఉంటే దర్శనమివ్వు, ఇస్తే నీకు ఖ్యాతి వస్తుంది. లేకుంటే నీ ఖ్యాతి లేకుండా పోతుంది అంటూ అడగడం తన హక్కు అనే విధానాన్ని చక్కని పద్యంలో అందించాడో గ్రహించవచ్చు స్వామిని తనవాడిగా భావిస్తూ కవిగారు స్తుతిస్తున్నాడని దీనర్థం.

సీతమ్మకు తమ్ముడాయతడు దారంతో …… అనే పద్యంలో కవిగారి ఆలోచనా తరంగములు వీక్షించినట్లయితే పోతనగారు నమ్మినది ఆరాధించినది కులదైవంగా భావించినది శ్రీరామ చంద్రున్నే వ్రాసినది మాత్రము కృష్ణ చరిత్ర, కృష్ణ లీలలు అయినప్పటికి పోతన కవిత్వానికి అంత మాధుర్యం రావడానికి రామయ్య నీవేనయ్యా కారణం అంటాడు. పోతన గారు సాక్షాత్తు సీతమ్మకు తుమ్ముడేమోనని కవిగారి భావన. ధర్మపత్నికి తమ్ముడు కావున అతనిపై ప్రేమ మమకారం యినుమడింప చేసుకొని

పోతన భాగవత రచనా ఝరిని మాధురీ ఝరి అని తలపింపజేశాడు. వికసింపజేశాడు పాఠకులను పునీతుల్నిజేశాడు. అటువంటి మంచి కవితా స్వాధనా గుణం మీకున్నాక నేను కూడా నీ భక్తుడనే కదా కేశవా నాకేందుకు అలా కరుణ ప్రసాదించవు అంటూ ప్రశ్నిస్తాడు. ఇది వేరే ఎవరికి సాధ్యం.

స్వామిపైన ఏర్పరచుకున్న అనురాగ బంధమే ఇలా కవిగారిచే అనిపించి లేఖినినుండి పద్యరూపంలో వినిపింపజేసింది. ఇదీ విషయం. ప్రతినిత్యం ఆరాధనా రూపంలో, భజనల రూపంలో స్తోత్ర రూపంలో, పఠనపారాయాణాదుల రూపంలో స్వామిని నుతిస్తూ, స్తుతిస్తూ, కొలుస్తూ ఉండే నిరంతర భగవద్యాన చిత్తజులయిన కవిగారికి స్వామికి మధ్యగల సంబంధం యిలా వారిచే అనిపింప జేయగలిగింది, వినిపింపజేయగలిగింది. చివరలో మళ్ళీ యిలా స్వామికి సూచిస్తూ తన అభ్యర్థనను సున్నితంగా వినిపించడం గమనించి చూసినట్లయితే ఎంత రసవత్తరంగా ఉంటుదో గ్రహించవచ్చు ఇది వీరి తరహా.

నేనమ్మితి నీ పదాబ్జములు నాకటులీయవే చెన్న కేశవా..... అంటాడు ఓ పద్యంలో కవిగారు. పోతన గారిని కరుణించాడు దానికి కారణాలు ఇవ్వి మరి నన్ను కూడా అట్లే కరుణించవయ్యా అంటూ నీ తామరలవంటి పాద ద్వయాన్ని నమ్మినాను. నన్ను కరుణించడం నీదే బాధ్యత అంటూ సాక్షాత్తు స్వామి వారిపైనే తనను కాపాడే బాధ్యతను అంటగట్టినాడు. ఇది స్వామివారిపై కవిగారికి ఉన్న అపార అవ్యాజానురాగాలకు ఒక సంకేతం. కవి గారిలో దాగియున్న భక్తి స్వామి యందలి అనురక్తి ప్రతి పద్యాలో కనిపించకనే కనిపిస్తూ ఉంటుంది. ఇది ఆయనలో ఉన్న కవిత్వ ధోరణిని నిరూపిస్తుంటుంది. అనేక సందర్భాలలో వారు ఈ విషయాన్ని ఉంటంకిస్తూ ఉండేవారు. తాను నమ్మిన దైవంపట్ల నమ్మకం ఏ రీతిలో ఉందో చూపింపజేస్తూ ఉంటారు. కవి నమ్మిన సిద్ధాంతాన్ని పాఠక లోకం అందరూ పాటిస్తూ, ఆదర్శంగా తీసుకొని ఉన్నట్లయితే ఆధ్యాత్మిక ఆనందానికి లోటు లేనేలేదని అంటారు కవిగారు. అంతే కాదు వారు నమ్మిన భక్తి ఎంత మధుర ఫలితాలు ఇవ్వగలదో అనేక రూపాల్లో, అనేక పద్యాల్లో, అనేక కీర్తనల్లో వినిపింపజేయడం జరిగింది.

కం॥కవిగారి భక్తి యుక్తులు
యవనిని ఆదర్శమయ్యె నందరి యెడలన్
నవవిధ శక్తులు నింపెను
కవిగారికి శతసహస్ర కమనీయ నుతుల్ ॥ 192.

----0----

# 5. శ్రీరామ నవరాత్రోత్సవ కల్పః

ప్రపంచంలో తొలిసారిగా నాగరికతను అందించింది ఈ సంస్కృత వాంగ్మయమే ఋషిప్రోక్తాలయైన వేద సంహితలు. ఋగ్వేదము, కృష్ణ యజుర్వేదం, శుక్ల యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం మరియు వేదాంగాలు, శాస్త్రాలు, ఐతిహాసములు, రామాయణ భారత భాగవతాదులు, అష్టాదశ పురాణాలు యివి భారతీయ సంస్కృతికి ప్రతిబంభాలు యిలాంటి వైధిక సాహిత్యంలో తొలి కావ్యం శ్రీమద్రామాయణం, మహర్షి వాల్మీకి గారిచే “కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం” మానిషాద ప్రతిష్టాంతం... అనే శ్లోకాల ఆధారంగా వాగ్మయ సృష్టి జరిగినట్టుగా ఆనవాళ్ళు ఉన్నాయి.

అలనాటి రామాయణం నేటికి ఆరాధ్య గ్రంథంగా ప్రపంచంలోని అనేకానేక దేశాల్లో అనేక ప్రాంతాల్లో, అనేక గ్రామాల్లో శ్రీరామచంద్ర మూర్తి నిత్యారాధ్య దైవంగా, అనునిత్యం పూజలందుకుంటున్న ఆ శ్రీరామచంద్రమూర్తి వారి జయంతి, జన్మదినోత్సవమే శ్రీరామ నవమి మహోత్సవంగా చైత్ర శుద్ధ నవమి శ్రవణా నక్షత్రమందు జన్మించిన ఆ శ్రీరామచంద్రమూర్తి వారికి నవరాత్రి మహోత్సవాలు జరుపుకోవడం ఆనవాయితిగా వస్తుంది. పవిత్రమైన భారతదేశంలో అనేక ప్రాంతాల్లో శ్రీరామ నవరాత్రి మహోత్సవాలు జగజ్జేగీయమానంగా అన్ని గ్రామాల్లో నిర్వహించుకోవడం పరిపాటిగా మారింది. అటువంటి తరుణంలోకవిగార్రైన శ్రీమాన్ రామకరామశర్మ గారు నిరంతర రామాయణ, పారాయణ ప్రీతులైయుండి పరిశుద్ధమైన శ్రీరామ నవరాత్రి పూజావిధానమును ఏర్పరచుకోవాలి అనే సంకల్పం వారికి ఏర్పడింది. తదనుగుణంగా 1-4-1993 నాటికి ఈ గ్రంథం వెలుగులోకి వచ్చింది. శ్రీమాన్ శాస్త్రుల్ల విశ్వనాథ శర్మ గారి పరిష్కర్తృ రూపంగా ఈ గ్రంథం వెలువడి ఎందరికో శ్రీరామ భక్తులకు నిష్టా, గరిష్టా పరులకు కరదీపికగా మారి శ్రీరామచంద్రుని ఆరాధన రూపంలో బహుళ ప్రయోజనాన్ని చేకూర్చి ఎంతో జనామోదాన్ని పొందగలిగింది.

(1)శ్రీ విద్యారామ గ్రంథమాల హన్మకొండ వరంగల్ గారి ప్రకాశికత్వంలో వెలువడిన యీగ్రంధం ఎందరో ధార్మిక, ఆస్తిక మహాశయుల ఆదరమును చూరగొన్నది. యిందులో కరపాత్రస్వామివారి మంగళాశాసనములతో శ్రీ వీరేంద్రకృష్ణ డోంగ్లేశాస్త్రి గారి ముందుమాటతో ప్రారంభించబడింది. శ్రీ సన్నిధానం

లక్ష్మీనారాయణ గారి సందేశంలో ప్రతి రామమందిరం నిర్వాహకులు ఆచరింపవలిసిన గ్రంధరాజమిది అని తెలియజేస్తూ ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణవేద మంత్రపూతంగా యేరోజు యేవిధంగా యేమంత్ర సహితంగా అర్చించాలో చాలా చక్కగా వివరించినారు. యిది అందరికీ ఆమోదయోగ్యంగా యుంటుందని

తెలియజేశారు. అనంతరం సంతానం గోపాలాచార్యులు గారు శ్రీ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు గారు శ్రీ శ్రీభాష్యం విజయసారథి గారు మున్నగు మహానుభావులు మహామహోపాధ్యాయులు లోకంలోని అందరూ అభినందించేవిధంగా అద్భుతంగా ఈ గ్రంధరాజం రూపుదిద్దుకోబడింది అని దీనిని వైదికులందరూ అపురూపంగా ఆదరిస్తూ వసంతనవరాత్రి మహోత్సవాల్లో దీనిని ప్రతినిత్యం ఉపయోగించే విధివిధానంగా మహోత్సవాలు జయప్రదం చేసుకోవడం అందరిచేత మన్ననలు అందుకోవడం ఈ పుస్తకం ద్వారా కవిగారికి ఎంతో ఖ్యాతి లభించింది.

శ్రీ శ్రీభాష్యం విజయసారథి అధ్యక్షులు సర్వవైదిక సంస్థానం కరీంనగరం గారు ఈ శ్రీరామ నవరాత్రోత్సవకల్పః అనే గ్రంధరాజాన్ని ఉద్దేశించి పరమోపాసకులు ఐన శ్రీమాన్ శ్రీ రామక రామశర్మ గారు సర్వలక్షణ సమన్వితంగా యీ కల్పాన్ని తీర్చిదిద్దినారనుకోవాలి అంటూ యిందులో పద్ధతి ప్రకారంగా వివిధ ఆవరణపూజలు ఆవరణఅర్చనలు చతుర్వేదమంత్రసహితంగా ధ్యానం,వివిధ న్యాసాలు, అంగన్యాస, కరన్యాసాదులు శరీర హృదయాదిన్యాసాలు, సర్వాంగ న్యాసాలు, నామావళి యుక్తంగ పండితులందరికి ఉపయోగపడే విధంగా అత్యంత ప్రయోజన కారకంగా ఉండేట్లుగా సర్వాంగ సుందరంగా కవిగారు ఈ కావ్య రాజాన్ని రూపొందించినారని వారి కృషిని మెచ్చుకుంటు అనేక విధాలుగా శ్లాఘించినారు.

లఘ్వాహ్నిక-దశావరణార్చన - నవాహ్నిక శ్రీమద్రామాయణ పారాయణ క్రమ - మంత్ర రామాయణద్వ్యుప బృంహితః శ్రీ రామా నవరాత్రోత్సవ కల్పః ఇది ఈ గ్రంథముకు నామధేయము ఆహ్నిక వరణార్చన, పారాయణక్రమ, ఉపబృంహిత, నవరాత్రి పూజా విధానము మామూలుగా సామాజంలో గణపతి నవరాత్రి ఉత్సవాలు, దేవి నవరాత్రి ఉత్సవాలవలే కాకుండా శ్రీరామ నవరాత్రి ఉత్సవాలకు విశేష పూజా విధానములకు రూపకల్పన చేసి శ్రీరామ చంద్ర మూర్తిని అర్చించే విధానమును ఇందులో పొందుపరచినారు కవిగారు.

.

కం॥ నూతన పూజా మార్గము
భాతిగ శ్రీరామకవియు బ్రహ్మాండంగా
భూతలమున జనులకు విధి
సీతారాములకు పూజ సేవలు దెలిపెన్ ॥ 193.

-----0-----

# 4. వ అధ్యాయము - ఛందోలంకార వైశిష్ట్యము :

నాలుగు పాదాల్లో త్ర్యిక్షర ప్రాస శ్రీరామా!, శ్రీరామా!, శ్రీరామా!, శ్రీరామా! ఇది శ్రీరామ రాఘవ స్తవంలో 37వ పద్యంలో కవిగారి ఛందోవైశిష్ట్యం, అలాగే 37వ పద్యంలో, 41వ పద్యంలో నీదయ, నీదయ, నీదయ, నీదయ, అనే త్ర్యక్షర ప్రాసా ప్రయోగం ప్రారంభపద్యంలో శ్రీరామా,శ్రీరామా, శ్రీరామా, శ్రీరామా 14 వ పద్యంలో ఇంద్రియ, యేంద్రియ, చంద్రియ, రింద్రియ వంటి త్రక్షరప్రాసాప్రయోగాలు నాలుగుపాదాల్లో అలాగే 32 వ పద్యంలో కఠిన. కఠిన, కఠిన, కఠిన 47 వ పద్యంలో మేల్కొను, యేల్కొను, మేల్కొను, మేల్కొను 60 వ పద్యంలో మాటాడ, మాటాడ, మాటాడ, మాటాడ 62, 71 పద్యాలలో ఏమయ, ఏమయ, ఏమయ, ఏమయ, 91 వ పద్యంలో చతురక్షర ప్రాస నీస్మరణ, నీస్మరణ, నీస్మరణ, నీస్మరణ యిలాంటి చిత్రవిచిత్ర ప్రయోగాలు కోకొల్లలుగా వీరి కావ్యాల్లో అతి సుందరంగా మలిచి పాఠకులకు ఆనందాన్ని పంచిపెట్టారు. (2)

ఇదే కావ్యంలో అనుబంధపద్యాల్లో ద్వ్యక్షర, త్ర్యక్షర, చతురక్షర, పంచాక్షర, షడక్షర ప్రాసాప్రయోగాలు అనేకాలుగా చేర్చి కావ్యానికి అందాన్ని, పుష్టిని చేకుర్చినారు. త్ర్యక్షరప్రాసాక్షరాలలో 22 వ పద్యంలో 25 వ పద్యంలో బ్రహ్మము, బ్రహ్మము, బ్రహ్మము, బ్రహ్మము అలాగే 34 వ పద్యంలో మాలికలోని 8 పాదాల్లో జూచెద .......... అనే త్రక్షర ప్రాసను వరుసగా 8 పాదాల్లో ప్రయోగించడం జరిగింది. 34 వ పద్యంలో సర్వంబు, సర్వంబు, సర్వంబు, సర్వంబు వంటి ప్రయోగాలు విరివిగా చేసి వారి ఛందోశ్రేష్ఠత్వాన్ని చూపించినారు. అలాగే షడక్షరప్రాసాప్రయోగం 33 వ పద్యంలో రాఘవా మేలుకో, రాఘవా మేలుకో, రాఘవా మేలుకో, రాఘవా మేలుకో వంటి ప్రయోగం ద్వారా వారి ఛందఃప్రయోగ విశిష్టతను చెప్పకనే చెప్పదలిచినారు.

అనేకానేకంగా చేసి వీరి కవిత్వ పరిణితిని నిరూపించుకున్నారు. తద్వారా కవిగారి సాహితీకృషి వేనోళ్ళ పొగడబడింది.

కం॥ కవిగారి పద్య కవితకు
భువిపై యనురాగ భక్తి భూషణమగుచో
సవివర రామ గాథలు
కవి కలమున పద్యమందు గలగల సాగెన్ ॥ 195.

----0----

# అలంకార వైశిష్ట్యం

ఆలంకారిక లాక్షణికులు సూచించినట్లు అలంకారయుతములైన పద్యరచన కవిశక్తికి గొప్ప రాణింపునిస్తుంది ముమ్మట, భామహాదుల వంటి పూర్వలాక్షణికులు ఉచ్ఛరించినట్లు మానవులకు కృత్రిములు యెట్లు భూషితములవుతున్నాయో సాహిత్యంలో అలంకారాదులు ఆవిధంగా కావ్యభూషితాదులవుతాయని బ్రహ్మశ్రీ శ్రీమాన్ రామక రామశర్మగారు వీరి శతకాది కావ్యాదుల్లో అనేకములైన అలంకారాదులు ప్రయోగిస్తూ పద్యరామణీయకతను అందించగలిగినారు.

కం॥ మఱువకు, మఱువకు, మనియిటు
మొఱలిడ నను విడిచి యెటకు బోయితి నంచున్
గొఱజూడకు కవి వరదా
మఱపును రాకుండజేసి మనమున నిలుమా ॥ (6) 196.

పై పద్యంలో శకటరేఫ అనేకమార్లు పునరుక్తమైంది దీంతో అది ఒకచ్ఛేత్యాను ప్రాసమైయున్నది యీ శకటరేఫ పునరావృతం గావడంతో ఈ పద్యానికి దివ్యమైన శోభచేకూరింది మఱు, – యెఱు, – మొఱ, – గొఱ, – కుఱ యిలా దాదాపు ఐదుసార్లు ప్రయోగం చేయడంవల్ల యిది వృత్త్యానుప్రాసమైనది.

ఇలాంటి అలంకారాదులతో పద్యాలకు అందాన్ని చేకూర్చి పద్య పఠనము జేయు సదరు పాఠకులకు ఆనందోత్సాహాదులు నింపగలుగుతూ ఆనందాన్ని అందిస్తున్నది. సాహిత్యపఠనం ప్రయోజనాలు నెరవేరాలంటే యిలా ఆలంకారిక ప్రయోగ లక్షణయుక్తమైన పద్యాలు వుండకతప్పదు అందువల్ల పుస్తకపఠనం గావించే పాఠకదేవుళ్ల మనస్సుకు ఆనందం కలిగించే విధంగా వుండాలని కవిగారి ఆలోచన ఆమేరకే వారి కవితాశ్వాన్ని ఆ వైపుగా ప్రయాణం కొనసాగింపజేశారు. వారు నమ్మిన స్వామిని మోక్షానికై అర్థించడం ఆవేదనాభరితమైన భావయుక్తమైన పద్యాలు వీరి శతకరాజాల్లో నిబిడీకృతం చేయడం యివన్నీ భావితరాలవారికి ఆదర్శప్రాయములుగా తీర్చిదిద్దడం వంటి ఆలోచనలతో వీరి కవిత్వసృష్టి కొనసాగించబడటం అది ఆ గ్రామవాసుల మహాభాగ్యంగా చెప్పవచ్చు. యిప్పటికినీ వీరి గ్రామంలో వీరి రచనలను సందర్భానుసారంగా వుపయోగించని వారువుండరు అని జెప్పడంలో సందియం యిసుమంతైననూ లేదు. వారి మనుమలు మునుమరాళ్ళు కొందరు వివిధ విశ్వవిద్యాలయాల్లో మాస్టర్ డిగ్రీలు డాక్టరేట్లు సాధించడం వీరి ఆశీర్వచన శక్తివల్లనే అని వారు నమ్మియుండి మాబోటివారికి తెలియజేస్తూవుండడం మాకు ఆనందాన్ని పంచుతుంటుంది. పరిశోధకులకు కర్తవ్యాన్ని సూచిస్తోంది.

మకుట నిర్ణయం సాహసోపేతం శ్రీ రామరాఘవ స్తవము లో అనుబంధ పద్యాల్లో 75 వ పద్యంలో రాఘవా అనే మకుటాన్ని యెన్నుకొని కవిగారు చంపకోత్పల, మత్తేభ, శార్దూలాల్లో వృత్తాశ్వాలను పరుగులు తీయించగలిగినారు. ఒకే మకుటం నాలుగు వృత్తాలలో పరుగులు తీయగలగడం ఒకింత ఆశ్చర్యాన్ని అందించక మానదు కవిగారి ధీరోదాత్తతకు నిదర్శనమిది. ఈ ప్రయోగమకుటంలో రాఘవా అని ఎన్నుకోవడంలోని అంతరార్థంయిదే రాఘవా అనునది సంబోధనార్థకం కావడం తగణానికి, రగణానికి, వగణానికి యలా సంబంధబాంధవ్యం కలిగివుండడం యన్నింటిని తనలో యిముడ్చుకొని కొనసాగుతుంటాయి యీపద్యసుమాలు కవిగారి భక్త్యావేశానికి యిదీ ఓ నిదర్శనం.

అంత్యప్రాస ప్రయోగాలు అనేకపద్యాల్లో అపారంగా జరిగినాయి. కవిగారికి శబ్దసంపద యనిన యెంత గౌరవమో ఈ అలంకారసంపదను విరివిగా ప్రయోగం చేయుడంవల్ల తెలుస్తుంది. అలంకార భూషణంతో పద్యసౌందర్యాన్ని యినుమడింపజేయడం కవిగారికి వెన్నతో పెట్టినవిద్యలాగా అనిపిస్తుంది కొన్నిపద్యాల్లో ఉదాహరణలు గమనిద్దాము.

కం॥ రామా దాసుని గావగ
రామా కఠినంబు సేయ రఘుపతి నీకున్
రామా న్యాయంబగునా
రామా దయజూడ వేగ రావా రామా॥ (7) 197.

పై ఉదాహరణలు రామా దయాజూడవేగా రావా పతితులకు ఆనందమే లక్ష్యంగా ఈ పద్యంలో అలంకార లక్షణంగా ప్రయోగం చేయడం సమ్మోదమే.

కం॥ రామా యీ తనువుండగ
రామా దరిశనము నొసగ రాదా యిపుడే
రామా దాసుడ గానా
రామా యశాశ్వతపు తనువురా శ్రీరామా ॥ (8) 198.

రామా యిది అశాశ్వతపు తనువురా శ్రీరామా అని సాక్షాత్తు ఆ శ్రీరామచంద్రునితోనే సంభాషింప బూనుకోవడం రామా అనే అంత్యప్రాస ఈ పద్యానికి అలంకార భూషణమైంది. రామా నే దాసుడ గానా? అంటూ ప్రశ్నించడం ప్రశ్నిస్తూనే ఓ శ్రీరామచంద్రా! ఈ అశాశ్వతపు తనువును కోరి నేనుండలేను మరణించకమున్నే నీ దర్శనము నాకందించి నన్ను రక్షించవయ్యా ! అంటూ ప్రార్థించడం కవిగారి భక్తికి తార్కాణం కవిగారి భక్త్యావేశంలో శ్రీరామస్తుతి అనే భక్తిభావ పుష్టిని నింపుతూ రచించిన ఈ పద్యాల్లో అంత్యప్రాసలు వంటి ప్రయోగాలు ఈ శతకానికి పుష్టిని చేకూర్చుతాయి

అనడంలో సందేహం ఏమాత్రం లేదని చెప్పవచ్చు ఈవిధంగా కవిగారి కవిత్వ ధోరిణిని మనం వీరి రచనలన్నింటిలోనూ పరిశీలించవచ్చు. భక్తిభావన, ధార్మికచింతన మున్నగు ఇంధనాదులను నింపి వీరి పద్యకవితా హయములను పరుగులు తీయించినారు. తెనుగు పద్యసాహితీ లోకానికి పుష్టిని, తుష్టిని, యష్టినీ అందించినారు. వృత్త్యానుప్రాసాలంకార పద్యం

ఉ ॥ అమ్మ వరమ్ము నా కొసగుమమ్మ బ్రియమ్మున నన్ను జేరగా
రమ్మని వేడితిం గనికరమ్మున నిమ్ము జయమ్ము భారతీ
యిమ్మహిలోన గ్రుమ్మరిన యిమ్ములు వాపగ నీవెసుమ్ము నే
నమ్మికతోడ నుండెదను నాల్కపయిన్ వసియించు శారదా ॥(9)199

అమ్మ, వరమ్ము, ఒసగుమమ్మ, బ్రియమ్ము , రమ్ము , కనికరమ్ము, జయమ్ము, యిమ్మహి, గ్రుమ్మరి, యిమ్ముల, సుమ్ము, నమ్మిక మొదలగు పదజాలములో పద్యాన్నిపరుగులెత్తించిన తీరు ప్రశంసాపాత్రములందుకుంటుంది కవీంద్రులు పద్యానికి మంచినడకను గూర్చి తనభక్తిభావాన్ని యిమిడ్చి శ్రీ శారదామాతను ప్రార్థించడం కవిగారి జిహ్వాగ్రంపై నివసించమని ఆ వాగ్వాదినీమాతను కోరుకోవడం యెంతైనా అభినందనీయం.

## ప్రశ్నార్థక పద్యం

కం॥ నీ కభిమానము లేదా?
నీ కొరకై పడిన పాట్లు నీ వెరుగనివా ?
నీ కుమరుడ నే గాదా ?
నా కెప్పుడు నీవె దిక్కు నమ్ముము రామా? ॥ (10) 200.

కం॥ విభవము చే మరిచితివా ?
ప్రభువరుడవు యైన నీకు భక్తుడ గానా ?
యిభరాజు నేల లేదా ?
యభయంబిడు మయ్య నాకు హరి శ్రీరామా ॥

----0----

# ముగింపు ఉపసంహారము

భక్తి శతక రచనలతో శ్రీ రామకరామశర్మగారు ఆ ప్రాంతంలోని సాహితీ పరులలో ఓ గొప్ప కదలికను తీసుకు రాగలిగినారు. అపారమైన భక్తి భగవంతునియందు గల మమకారం, మనశ్శాంతిని ఆపాదింపజేస్తుందని నమ్మి వీరు దైవ చింతనను భక్తులందరిలో కలిగింపజేసిన యొక చైతన్య శీలిగా మధురమైన భక్తి రచయితగా పేరు సాధించగలిగినారు. వీరి రచనలలో నిగాఢమైన భక్తి తత్పరత, శరణాగతి, దీక్ష భగవంతునియందుగల నిగూఢమైన భక్తిని నేటికిని అందరు ప్రశంసిస్తుంటారు.

రామకరామశర్మగారి భక్తి తత్వము వీరి నిష్ఠ వీరు నిర్వహించే వైదికకార్యక్రమాల్లో సందర్భానుసారంగా వీరు చేసిన అనుగ్రహ భాషణములు భక్తులలో గొప్ప మార్పును చేయగలిగాయి. "మానవసేవే మాధవసేవ" అన్నమాటకు అర్థం స్ఫురించే విధంగా భక్త బృందాలలో వచ్చిన మార్పులు ద్వారా వారు చేపట్టిన సామాజిక కార్యక్రమాలు ధార్మిక కార్యక్రమాలు తిరునాళ్ళు (జాతర) వంటివి ఏర్పాటు చేయడంలో వారు చూపిన కృషి, శ్రద్ధ అంతయు వీరి భోధనల ప్రతిఫలాలు అని అందరు చెపుతుంటారు.

సామాజిక చైతన్యంలో భాగంగా అన్ని వర్గాల వారిని అన్ని కులాల వారిని ప్రోత్సాహ పరుస్తు అందరి భాగస్వామ్యంతో ధార్మిక కార్యక్రమాలు ప్రతిష్ట బ్రహోత్సవాది కార్యక్రమాలు తద్వారా వెల్లివిరిసిన ఆనందం అందరి సమష్టి కృషి ద్వారా విజయవంతమైన కార్యక్రమాల ద్వారా కలిగిన సంతృప్తి వీరి వల్లనే సమకూరినట్లుగా గ్రామస్తులు చెపుతూ ఉంటారు. అటువంటి మహానుభావుని రచనలు పరిశీలన నేను చేపట్టిన నా అదృష్టంగా భావిస్తున్నాను.

సాంప్రదాయిక విషయాలు వీరి కవిత్వంలో నిండుగా నింపాదిగా కానవస్తాయి. కవిగారి తపన వీరి మోక్షాకాంక్ష వీరి రచనలలో "లోకాఃసమస్తాః సుఖినోభవంతు" అనే విధంగా ప్రజలందరి యోగ క్షేమాలు కోరుకోవడం భగవద్గీతలో ....

శ్లో॥ అనన్యాశ్చింతయం తోమాం యేజనాః పర్యుపాసతే
తేశాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహం॥

అన్నట్లు అందరి క్షేమాన్ని అర్థిస్తూ వీరి రచనల్లో శ్రీరామచంద్రుడుని, ఆంజనేయస్వామిని, చెన్నకేశవ స్వామి వారిని కోరుకోవడం ఆనందదాయకమై వీరి కవితా విధానం ఆదర్శంగా నిలిచిపోవడం జరిగింది.

వీరి ఆశయాలకు అనుకూలంగా వీరి పుత్రులు, పౌత్రులు తీర్చి దిద్దబడడం, వీరు చేసిన దైవ పూజా ఫలితమే అనుకోవచ్చు. పౌరాణికులుగా, ఆగమసిద్ధాంతులుగా,

పౌరోహితులుగా, ఆచార్యులుగా, అర్చక శ్రేష్టులుగా, ఉపాధ్యాయులుగా, ఉపన్యాసకుడిగా సిద్దపడినారు. శ్రీమాన్ గంగవరం నారాయణ శర్మ బోధన్ గారలు, ఆగమసిద్ధాంత కర్తగా వేదపండితునిగా నేటికిని అన్ని ప్రాంతాలలో గౌరవాధరములు పొందుతూ ఉన్నారు.

కవిగారి పౌత్రుడు రామశర్మ, ఆంజనేయశర్మ కృష్ణ యజుర్వేద పండితులుగా సంస్కృత ఉపన్యాసకులుగా స్థిరపడ్డారు. వీరి కుమార్తె గారి పుత్రులు బ్రహ్మశ్రీ పురాణం మహేశ్వర శర్మగారు యజుర్వేద పండితులుగా శృంగేరి, పీఠాధిపతుల వద్ద పౌరాణికులుగా, బెంగుళూరులో మీ మాంసా శాస్త్రాధ్యాయులుగా ప్రస్తుతము కరీంనగర్ పట్టణంలో మహాపౌరాణికులుగా, వేద పండితులుగా స్థిరపడ్డారు. పురాణం శ్రీనివాస శర్మ అర్చక శ్రేష్టులుగా సేవలు కొనసాగిస్తున్నారు. వాస్తు పౌరోహిత రంగాలలో వీరి పుత్రులు కృష్ణశర్మ (పెద్దన్న), సూరయ్యశర్మగారలు కరీంనగర్‌లో స్థిరపడ్డారు. వీరి పౌత్రులు డాక్టర్ పాండురంగశర్మ గారు, కృష్ణయజుర్వేద అధ్యయనం పూర్తిచేసి సంస్కృత ఉపన్యాసకునిగా హత్నూర్ మెదక్ జిల్లాలో స్థిరపడ్డారు. విదేశాల్లో కొందరు వివిధ ఉన్నతోద్యోగాల్లో కొందరు స్థిరపడ్డట్టుగా వీరి ద్వారా కవి గారి విశేషాలు అన్నింటిని సేకరించడం జరిగింది.

వీరి రచనల్లో వీరు చేపట్టిన దశావతార వర్ణన అనుబంధ పద్యాలు, నేటి తరం పద్య కవులకు ఆదర్శప్రాయంగా నిలిచిపోయాయి. శ్రీ రామకరామశర్మ గారు మన్నెంపెల్లి గ్రామములో ఒక సాహితీవేత్తగా, భక్త కవిగా, పౌరాణికులుగా, యజ్ఞాచార్యులుగా, జ్యోతిర్ విద్యావేత్తగా భజన పరులుగా వేనోళ్ళ కీర్తులు ఆర్జించిన మహామహో పాధ్యాయులుగా స్థిరస్థాయిగా అందరి హృదయాల్లో నిలిచిపోవడం ఆనందం కలిగించే విషయం. ఇటువంటి మహానుభావును రచనలు పరిశీలించే భాగ్యాన్ని ప్రత్యక్ష శిష్యుడైనా నాకు కలుగజేయడం మాగ్రామ యిలవేల్పు అయిన శ్రీ లక్ష్మి చెన్నకేశవ స్వామి వారికి శతధా, సహస్రధా సాష్టాంగ ప్రణామాలు సమర్పిస్తూ ఈ సిద్ధాంత వ్యాసాన్ని నాగర్జునా యూనివర్సిటీ గుంటూరు గారలకు సమర్పిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

కం॥ కవిగారికి అంజలి యిదె
కవిగారికి ఋణము నిట్లు కమనీయంగా
సవినయ పూర్తిగ నిచ్చితి
కవిటేడుకు ప్రాంజలింతు కవి శోధకునై ॥

---0---

## ఉపయుక్త గ్రంథ సూచి :


1. శ్రీమద్రామాయణం - గోరఖ్‌పూర్ వారి ప్రతి
2. ఉపనిషత్తులు - గోమఠం వారి ప్రతి
3. మహాభాగవతం (గీర్వాణం) - వేదవ్యాస మహర్షి
4. మహాభాగవతం (తెలుగు) - బమ్మెర పోతన
5. మహాభారతం (గీర్వాణం) - వ్యాస మహర్షి
6. కవిత్రయ భారతం (తెలుగు) - నన్నయ్య కవిత్రయం
7. భారతీయ తత్వశాస్త్రము - టి.టి.డి.
8. దర్శనములు - తెలుగు అకాడమీ
9. యజ్ఞవరాహ స్తుతి - శ్రీ భాష్యం విజయ సారధి
10. ఆంధ్రుల సాంఘీక చరిత్ర - సురవరం ప్రతాపరెడ్డి
11. తెలుగు సాహిత్య చరిత్ర - పింగళి లక్ష్మికాంతం
12. తెలుగు సాహిత్య చరిత్ర - ఆచార్య నాగయ్య
13. భాషా శాస్త్రం - భద్రిరాజు కృష్ణమూర్తి
14. సమగ్రాంధ్ర సాహిత్యం - ఆరుద్ర
15. ఆధునికాంధ్ర కవిత్వం - డా॥ సినారె.
16. జానపద గేయ సాహిత్యం - నాయిని కృష్ణకుమారి
17. జానపద సాహిత్యం - బి. రామరాజు
18. ముకుంద మాల - కులశేఖరాళ్వార్
19. దాశరథీ శతకం - కంచర్ల గోపన్న
20. ధర్మపురి నర్సింహ శతకం - శేషప్ప
21. కరీంనగర్ జిల్లా సాహిత్యచరిత్ర - మలయశ్రీ
22. కరీంనగర్ జిల్లా చరిత్ర - జైశెట్టి రమణయ్య
23. ఆంధ్రసాహిత్య చరిత్ర - దివాకర్ల
24. గోలకొండ కవుల సంచిక - సురవరం ప్రతాపరెడ్డి
25. దేశీఛందస్సు - సంగనభట్ల నర్సయ్య
26. భగవద్గీత - వేదవ్యాస మహర్షి
27. భాగవత వైజయంతిక - తెలుగు అకాడమీ
28. బ్రహ్మోత్సవాను క్రమణిక - వైఖానస ఆగమ పీఠం
29. కావ్యాలంకార సంగ్రహం - భట్టుమూర్తి

30. చాటుపద్య మణిమంజరీ - వేటూరి ప్రభాకర శాస్త్రి
31. కృతి స్వర్ణోత్సవ సంచిక - శ్రీభాష్యం విజయసారధి
32. పాతికేళ్ళ ఆంధ్రదేశ చరిత్ర - తెలుగు అకాడమీ
33. నిజమాబాద్ జిల్లా
మోహర్రం పాటలు - గంగాధర్
34. ఎం.ఎ. తెలుగు
సంస్కృతం పాఠ్యపుస్తకాలు - ఉస్మానియా కాకతీయ విశ్వవిద్యాలయం.
35. రామాయణ పారాయణ విధులు - శ్రీ భాష్యం విజయసారధి
36. రామశతకం - డా॥ రంగాచార్య
37. రామపారిజాతం - దప్పూరి సత్యనారాయణాచార్య
38. ఆపదుద్దారక స్తోత్రం - జీయర్ ట్రస్ట్
39. దాశరథీ శతకము - రామదాసు
40. తెలుగు సాహిత్య చరిత్ర - ద్వా. నా. శాస్త్రి
41. పోతన పద్య మందారాలు - సాహిత్య అకాడెమీ
42. డింగరి రామాచార్య రచనలు - పరిశీలన - కటుకోజ్వల మనోహరాచారి
43. విష్ణుసహస్రనామ భాష్యం - నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు
44. రామగాన సోయగం - విధుమౌళి శర్మ
45. గేయరామాయణం - నర్సింహమూర్తి
46. నరసింహశతకం - వాసుదేవా చార్యులు
47. రామగిరి కోదండరామ శతకం - శేషం వేణుగోపాల శర్మ
48. యజ్ఞవరాహ శతకం - ”
49. నీవు శత స్తుతి - డా॥ గంద్ర లక్ష్మణ్ రావు
50. రాఘవశతకం - గట్టు వామనమూర్తి

--xx--